# ఈ సంచికలో




ముఖచిత్రం శీతల హేమంతిని

చిత్రకారుడు వడ్డాది పాపయ్య

యువ సాలుచందా రూ 36-00

దీపావళి సంచికతో రూ 42-00

యువ హైదరాబాదు-500001




స్వరాంగ సుందరంగా, ఆలోచనలను, అనుభూతులను రేకెత్తించే విధంగా ఈ సంవత్సరం వెలువడిన 'యువ' దీపావళి సంచికను ప్రత్యేకంగా అభినందిస్తున్నాము. 'దీప్తి' ముఖచిత్రమూ, 'శ్రీ చక్రపాణి' లోపలి త్రివర్ణ చిత్రమూ మమ్మల్ని ముగ్ధుల్ని చేశాయి. ఇందుమతీ పట్నాయక్‌గారి నవల మనస్సుకు హత్తుకొనేట్టుగా వుండి, ఒక్క వూపులో ఆసక్తిగా చదివించింది. కథలు దాదాపు అన్నీ బావున్నాయి. ముఖ్యంగా మధురాంతకం రాజారాంగారి 'ముగ్గురత్తగార్లు', శ్రీధర 'సాగర సంగీతం', ఇ. జి. రావుగారి 'రాజీ', పవని నిర్మల ప్రభావతిగారి 'పూజారి'—చెప్పుకోదగ్గ స్థాయిలో ఉన్నాయి. కార్టూన్లు కోకొల్లలు – ఇంటిల్లిపాదీ ఆహ్లాదాన్ని కలిగించేవి. పత్రిక గెటప్, ప్రింటింగ్ – అత్యుత్తమంగా ఉన్నాయని వేరే చెప్పనక్కర్లేదు.

—సావిత్రి, లక్ష్మిపాపాయి, రాజేశ్వరి
అనంతపల్లి

మీరు ప్రకటించిన 'శ్రీ చక్రపాణి అవార్డులు' సాహితీ జగత్తుకు ధ్రువ తారలు వంటివి తెలుగులో ఏ పత్రికా అందించని ఈ కొత్త పథకాన్ని నేను మనసారా అభినందిస్తున్నాను రచయితలు, రచయిత్రులు ఈ అవకాశాన్ని పురస్కరించుకొని మాబోటి సామాన్య పాఠకులకు మేలైన సాహిత్యాన్ని అందిస్తారని ఆశిస్తున్నాను

—పి వి సుబ్రహ్మణ్యం
విజయవాడ – 3

1976 యువ దీపావళి సంచిక అన్ని దీపావళి సంచికలకంటె మిన్నగా, అందంగా, సుందరంగా ఉందని తెలియజేయటానికి సంతోషిస్తున్నాము వడ్డాది పాపయ్యగారి శ్రీ చక్రపాణి త్రివర్ణచిత్రం అత్యద్భుతంగా ఉంది కథల్లో – వకుళ, మాయా మర్మమూ, పూజారి, ఎథిస్ట్, గడ్డిపువ్వు, రాజీ, ఆలస్యం – చాలా బావున్నాయి 'దీపాంజలి' నవల ఎంతో ఇంటరెస్టింగ్‌గా వుంది తక్కువ వెలలో ఎక్కువ తృప్తిని అందించేటట్లు సంచికను తీర్చి దిద్దినందుకు మా హృదయపూర్వక అభినందనలు

—కె వి రామచంద్రం, కె చంద్రమతి
రూర్కేలా

ఏ బొంబే డైయింగ్ దుకాణానికైనా
సరే, వెళ్ళి మీ విజ్ఞానాన్ని పరి
పూర్తి చేసుకోండి! ఉవ్విళ్ళూ
రించే మా సూపర్ ఫైన్
పాప్లిన్‌లు లాన్‌లు
కేంబ్రిక్‌లు డెనిమ్‌లు
పాలియెస్టర్/నూలు మిశ్ర
మాలని చూడాలని అడగండి
మీవీ-వారివీ కూడా
హృదయాలను
స్పందింపజేసే
రంగుల్లో,
డిజైన్లలో

# మీరు సెక్స్ అప్పీల్‌ను గురించి ఎంత తెలుసుకోవాలనుకున్నారు.*

*కాని
అడగడానికి
సంకోచించారు

# బొంబే డైయింగ్



BD:1418

## చేసిన పరీక్షల వలన తెలింది...





# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా

# గ్లూకోజ్-డి



పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వల్ల తెలిందేమిటంటే, విటమిన్లూ పుష్టినిచ్చే పదార్థాలూ గ్లూకోజ్-డిలో ఉన్నాయనీ, ఇంకి తియ్యదనానికీ, కరకరలాడే రుచికీ దీని కావాలంటారని.

అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.




బ్రిటానియా

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు చక్రపాణి

సంపుటి 34 డిసెంబరు, 1976 సంచిక 6


ఆంధ్రప్రదేశ్ అవతరించి, గత నవంబరు ఒకటవ తేదీకి ఇరవై సంవత్సరాలు పూర్తిఅయాయి. మొదటి పది సంవత్సరాలు ఒకవిధంగా ప్రశాంతంగా గడిచినప్పటికీ, రెండవ పది సంవత్సరాలు ఒడిదుడుకులుగానే గడిచాయి. ముఖ్యంగా, 1970 నుంచి 1973 డిసెంబరువరకు, రాష్ట్రంలో ఆందోళనలు జరిగి, పదిహేను సంవత్సరాల శాంతికి తీవ్రమైన భంగమే కాకుండా, ప్రభుత్వ ఆస్తికి, వ్యక్తుల ఆస్తికీ అపారనష్టం కలిగింది. ఆ దెబ్బ నుంచి రాష్ట్రం ఇంతవరకూ పూర్తిగా కోలుకోనలేదు.

అయితే, 1973 డిసెంబర్‌లో శ్రీ జలగం వెంగళరావుగారి నాయకత్వాన ఏర్పడిన మంత్రిమండలి ఏ దొందుదుకులూ లేకుండా నిలబడి, రాష్ట్రంలో పటిష్టమైన పరిపాలనను సాగించడమే కాకుండా, అనేక అభ్యుదయ ప్రణాళికలను అమలుజరపడమే కాకుండా, శాంతిభద్రతలను చక్కగా కాపాడింది. ఈ కాలంలోనే, దేశమంతటా ఎమర్జెన్సీ అమలుజరపబడడమూ, ప్రధాన మంత్రి 20-సూత్రముల ప్రణాళికను ప్రకటించడమూ జరిగింది. దానితో, దేశవ్యాప్తమైన అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభమయాయి. ఈ కార్యక్రమాలను అమలుజరపడంలో, ఇతర రాష్ట్రాలకు ఏమాత్రం తీసిపోకపోవడమే కాకుండా, కొన్ని విషయాలలో ఆంధ్రప్రదేశ్ ఇతర రాష్ట్రాలను అధిగమించింది కూడాను.

గత నెలలో పార్లమెంటు ఆమోదించిన రాజ్యాంగ సవరణవల్ల ఎన్నికలు మరొక సంవత్సరం వాయిదా పడినవి కాబట్టి ప్రస్తుతపు మంత్రి

మండలులూ, శాసనసభ్యులూ అవిరామంగా, మరొక సంవత్సరం అదనంగా పదవులలో వుండడం జరుగుతున్నది అందువల్ల, ప్రస్తుత మంత్రివర్గాల హాయాములో ప్రారంభింపబడిన అభ్యుదయ కార్యక్రమాలనూ సంస్కరణలనూ సక్రమంగా, జయప్రదంగా అమలుజరపడానికి చక్కని అవకాశం ఏర్పడింది

అభ్యుదయ ప్రణాళికలను చురుకుగా అమలుజరిపినట్లయితే, యీ సంవత్సరంలో, అంటే మళ్లీ ఎన్నికలు వచ్చేలోగా రాష్ట్రంలోని అనేక లోటులను పూర్తిగా సవరించవచ్చు ఇలా చెయ్యడంలో, ప్రస్తుత మంత్రిమండలి విజయం సాధించగలదనే మా నమ్మకం

ఇక సంస్కరణలమాట. ప్రస్తుతం, రాష్ట్రంలో అతిచురుకుగా పనిజరుగుతున్నది, భూసంస్కరణల సందర్భంలో భూసంస్కరణలతోపాటు, ఈ 1976 లో అకస్మాత్తుగా అమలుజరుపబడుతున్న నగర నివాసస్థలాల గరిష్ఠ పరిమితి చట్టంకూడా ప్రభుత్వం అంటే మంత్రిమండలి, చాలా జాగ్రత్తగా అమలుజరుపవలసిన విధానాలలో ఒకటి ఈ చట్టాల ఆశయం, వీలైనంత వరకు, సాంఘిక సమానత్వాన్ని తీసుకురావడము ఇలా చెయ్యటం బలహీన వర్గాలకు వసతులను ఏర్పరచడంకోసమే బలహీనవర్గాలకు వసతులను కల్పించడంలో, సాధారణ కుటుంబీకులకు నష్టం ఏమాత్రమూ కలగనియ్యకూడదు సాధారణ కుటుంబీకులు ఏమాత్రం నష్టపడినా వారు బలహీన వర్గంలో చేరవలసివస్తుంది అంటే, ఒక వర్గాన్ని ఉద్ధరించడంలో, మరొక వర్గాన్ని అధోగతికి పంపడం జరుగుతుంది ప్రభుత్వం అమలుజరిపే చట్ట ఆశయమే భగ్నమౌతుంది అలా కాకుండా చట్టాన్ని జాగ్రత్తగా అమలు జరుపవలసినవారు ప్రభుత్వోద్యోగులు ఈ ఉద్యోగులు ఏ ఒక్క సందర్భంలోనూ, ఏ వ్యక్తికీ, అన్యాయం జరుగకుండా ప్రవర్తించాలి. చట్ట నిబంధనలను అమలుజరపడంలో ఏమాత్రం ఉదాసీనతనుగాని, అనవసర అమితోత్సాహాన్నిగాని ప్రదర్శించకుండా వుండాలి అలాంటి జాగ్రత్తతో ప్రవర్తించవలసిందని, యీ ఉద్యోగులకు ప్రభుత్వం పదే పదే హెచ్చరికలను జారీచేస్తూ వుండాలి అయినప్పటికీ, యీ ఉద్యోగులు ఒక్కొక్కప్పుడు పొరపాటు పడడం సంభవిస్తుంది అలాంటి సందర్భాలలో న్యాయస్థానానికి అపీలుచేసుకొనే ఏర్పాటు చట్టంలోనే వుంది. న్యాయస్థానం తీర్పుచెప్పిన తరువాత ఆ తీర్పుపై మళ్లీ అపీలుచెయ్యడం ప్రభుత్వం విరమించడం మంచిది ప్రభుత్వం అలా అపీలు చేసేవ్యక్తులకు ప్రభుత్వం తమమీద కత్తకట్టిందా అనే భావం కలుగవచ్చును నేరాల విషయంలో తప్ప, సంస్కరణల అమలులో ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వం ప్రజలలో కొందరిమీద న్యాయస్థానాలలో వ్యాజ్యాలు జరిపించడం, ప్రజల

లోని కొందంమీద దాక్షిణ్యరహితంగా ప్రవర్తించడం అవుతుంది. న్యాయాన్ని ప్రవర్తింపచెయ్యటంలో గాని, శిక్షలను అమలుజరపడంలో గాని ప్రజలపట్ల ప్రభుత్వం ఎక్కువ దాక్షిణ్యభావంతో ప్రవర్తించాలి, అనేది పరిపాలనా సూత్రాలలో ప్రధానమైనది. ఈ సూత్రం ప్రభుత్వానికిగాని, ప్రభుత్వోద్యోగులకుగాని తెలియనిది కాదు. కాని, కొన్ని సందర్భాలలో యీ సూత్రాన్ని పాటించడంలో ఉదాసీనత సంభవిస్తుంది. అలా ఒక్క సందర్భంలో కూడా జరుగకుండా చూడవలసిన అవసరం యీ భూసంస్కరణలు, నగరస్థలాల గరిష్ఠపరిమితి చట్టాల విషయంలో చాలా ఎక్కువ.

భూసంస్కరణల విషయంలో ఒక ఉదాహరణ తీసుకుందాము ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత గరిష్ఠపరిమితికి మించిన భూములుగల వారెవరూ ఆ అదనపు భూమిని అమ్మడానికిగాని, అన్యాక్రాంతం చెయ్యడానికిగాని వీలులేదు. అలాటివారికి గల అదనపు భూమిని ప్రభుత్వం తీసుకోవలసిందే; తీసుకుంటుంది కూడాను. కాని, యీ చట్టం రాకముందు భూములు అమ్ముకున్నవారిని, అలా అమ్మకంలో ఉద్దేశం భూసంస్కరణలు రాబోతున్నాయని వాటిని తప్పించుకోడానికి ఆ భూములను అమ్మారని ఆరోపించడం కఠినమార్గం అవుతుంది. ఇలాంటి ఆరోపణకు అవకాశం, ఆంధ్రప్రదేశ్ చట్టంలో మాత్రమే వుంది ఇది చాలా కఠిన నిబంధన. ఈ నిబంధనను ప్రభుత్వం సవరించడం మంచిది ఎవరికీ గరిష్ఠపరిమితికి మించిన భూమి వుండకూడదనే చట్టంప్రకారం, యీ చట్టం అమలు రాకముందు కొంతమంది భూమిని అమ్మితే, ఆ భూమిని కొన్నవారు కూడా యీ గరిష్ఠ పరిమితిలోపు భూమినే కలిగివుంటే, యీ నిబంధనను అమలుజరపడం అనవసరం. ఏమంటే, గరిష్ఠపరిమితికి మించిన భూమి ఎవరికీ వుండకూడదనేదే, యీ చట్టపు ప్రధానాశయం. ఈ ఆశయానికి వ్యతిరేకం కానప్పుడు, యీ చట్టం అమలు రాకముందు జరిగిన అమ్మకాలను స్థిర పరచడంవల్ల అనేక కుటుంబాలకు న్యాయం కలిగించడం అవుతుంది. ఇలాటి ఏర్పాటును చేస్తూ, ఆ చట్టాన్ని ఆర్డినెన్సు ద్వారానయినా సవరించడానికి ప్రభుత్వం ప్రయత్నం చెయ్యాలి. ఇలాటి సవరణవల్ల ఎవరికీ నష్టం కలుగక పోగా, అనేక కుటుంబాలకు వ్యథకలుగకుండా వుంటుంది. ఎన్నో విషయా లలో ప్రజారంజకంగా పరిపాలన సాగిస్తున్న శ్రీ వెంగళరావు ప్రభుత్వం, యీ అత్యవసరమైన సవరణను అమలు జరపగలరనీ, దానివల్ల ఏ వర్గానికీ నష్టంకలుగకుండా చూసారనీ ఆశిసున్నాము.

# డిసెంబరు నెల యువ భావపరిచయ పోటీ

**బహుమతి పొందిన వ్యాఖ్య**



పెద్దల ప్రాణాలు పై పైకి
పిల్లవాని ప్రాణాలు పిస్తోలు పైకి

— వై. యస్. పార్థసారథి
హైదరాబాదు

# ఓ లవిలి

## యర్రంశెట్టి శాయి

సీత తనకు అతి సమీపంగా ఆగిన కారును చూసి ఉలిక్కిపడింది. ఏవేవో ఆలోచనల్లో విహరిస్తూండడంచేత సరిగ్గా ఏం జరిగిందీ తెలీలేదు. బహుశా తనే కారుకి అడ్డంగా నడిచి ఉంటుంది.

"హాయ్ సీతా!..." వెనుక సీట్లోంచి ఓ యువతి పిలవడం చూసి చకితురాలయి ఆమెవంక చూసింది సీత.

"రా! నీకోసమే ఆపాను కారు..." అంటూ తలుపు తెరచిందామె. ఆమె పేరు అఖిల భాను! ఆమెది తన క్లాసే! కాలేజీలో చేరిన ఈ పదిరోజుల్లోనూ ఏ నాలుగయిదుసార్లో పలుకరించుకొన్నారిద్దరూ. డ్రైవింగ్ సీట్ దగ్గర యువకుని వంక ఓసారి చూసి బాక్ సీట్లో కూర్చుని తలుపు మూసివేసింది సీత. కారు వేగంగా బయల్దేరింది. అయిదు నిమిషాల్లో బషీర్ బాగ్ దాటింది.

"ఇతను మా అన్నయ్య వినోద్ – ఈమె మా క్లాస్‌మేటన్నాయ్ – సీత" అంటూ పరిచయంచేసింది అఖిల.

"నమస్తే!..." తల వెనక్కు తిప్పి నవ్వుతూ అన్నాడతను.

ఖంగారుగా ప్రతి నమస్కారం చేసింది సీత. ఓ యువకునితో పరిచయం కావడం ఆమెకు మొదటిసారిది.

కాలేజీదగ్గర ఆగింది కారు.

ఇద్దరూ దిగి నుంచున్నారు.

"ఓకే – బై..." అంటూ కారు స్టార్ట్ చేశాడతను. అలా అంటూన్నప్పుడు అతను నవ్వుతూ తనవంక చూడటం గమనించింది సీత. ఎంచేతో

ఆమె గుండెలు వేగంగా కొట్టుకున్నాయ్. • అతనలా ఎందుకు చూసినట్లు? తన అందం అతనిని ఆకర్షించిందా? తన క్లాసులో అందరికంటే తనే అందంగా ఉంటుంది. కాలేజిలో చేరిన మొదటిరోజే గమనించిందా విషయం తను. ఆ విషయం తనకు చాలా సంతృప్తి, సంతోషం కలిగించింది.

'వినోద్' అతని పేరు! మనిషికూడా చాలా ఠీవిగా, దర్జాగా ఉన్నాడు. మెడిసిన్ చదువుతున్నాడు.



వాళ్ళకెంత ఆస్తి ఉందో! ఎంతేమిటి తన మొహం! కొన్ని లక్షలు ఉండి ఉంటుంది.

అఖిల ప్రతిరోజూ కనీసం యాభై రూపాయలయినా ఖర్చు చేస్తూం టుంది స్నేహితురాండ్రకోసం!



రెండు కార్లున్నయ్ వాళ్ళకు! నాలుగంతస్థుల మేడ ఉందిట! ఇంకేం కావాలి? సీతకి తన పరిస్థితి గుర్తుకొచ్చింది. తనున్న ఇల్లూ, తను కట్టుకుంటున్న బట్టలూ – తమ కుటుంబ పరిస్థితీ – అబ్బ! భగవంతుడా ఇవన్నీ గుర్తు తేవద్దు! భారంగా కణతలు నొక్కుకుందామె.

ఇద్దరూ క్లాస్‌లోకి నడిచి కూర్చున్నారు.

అప్పటికే అక్కడ ఏదో కొత్త సినిమా గురించి చర్చ జరుగుతోంది. ఓ అమ్మాయి తనకు పూనా ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌లో ప్రవేశం దొరికిందనీ, త్వరలో కాలేజీ వదిలేస్తున్నట్లు ప్రకటించింది. దాంతో చాలామంది ఆ అమ్మాయిచుట్టూ గుమికూడిపోయారు.

ఆ ఇనిస్టిట్యూట్‌లో ఎన్నిరకాల కోర్స్‌లు ఉన్నవీ, వాటికి కావలసిన అర్హతలేమిటీ, ఎలా అప్లయ్ చేయాలీ అన్నీ ప్రశ్నలే!

తనకు తెలిసినంతవరకూ ఓపిగ్గా సమాధానాలు చెబుతోందామె.

సీతకూడా ఆసక్తిగా వినసాగిం దవన్నీ. నిజంగా ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌లో ప్రవేశం దొరకడం ఎంత అదృష్టం? అక్కడి విద్యార్థు లందరూ ఇప్పుడు సినిమాఫీల్డులో గొప్ప పేరు సంపాదించారు, ఉన్నత ప్రమాణాలు నెలకొల్పారు. లక్షాధికారు లయ్యారు. అందమైన బంగళాల్లో, ఎయిర్ కండిషన్ కారుల్లో-లగ్జరీ హోటళ్ళలో -వాళ్ళ జీవితం ఎంత బావుంటుంది? తనకీ అలాంటి అదృష్టం లభిస్తే! ఈ బీదతనం, ఈ సమస్యలు-ఇవేమీ ఉండవ్! పైపెచ్చు చెల్లాయినీ తమ్ముడినీ ఎంతో పెద్ద చదువులు చదివించి తన కుటుంబాన్ని ఉన్నతస్థితికి తీసుకువెళ్తుంది.

"అసలు ఇలాంటి అవకాశం సీతలాంటి అందమైన అమ్మాయికి రావాలి! ఆ డబల్ రోటీ చంద్రిక కెందుకు?" అంది అఖిల మరో అమ్మాయితో.

"అవును! సీతకే ఇలాంటి అవకాశమొస్తే ఆమె ఇప్పుడున్న పెద్ద తారలందరినీ ఇంటికి పంపిస్తుంది..." అందా అమ్మాయి.

సీత ఇబ్బందిగా నవ్వింది అఖిలవేపు చూస్తూ. తనకు తెలుసు! తను అందంగా ఉంటుంది! చాలా అందంగా ఉంటుంది! పెద్ద పెద్ద తారలందరికన్నా అందంగా ఉంటుందో లేదో తనకు తెలీదుగాని తను వారికి ఏమాత్రం తీసిపోదని తన నమ్మకం! తనలాంటి అందగత్తెకి దేముడీ భీదతనం ఎందుకంటగట్టేడు? ఎందుకింత పక్షపాతం!

లెక్చరర్ వచ్చింది క్లాస్‌లోకి.

అంతా ఎవరి స్థానాల్లో వాళ్ళు కూర్చున్నారు. అటెండెన్స్ తీసుకోగానే ఏదో పాఠం మొదలుపెట్టిందామె.

సీత ఏమీ మనసుకి పట్టించుకోలేకపోతోంది. తను నిజంగా సినీతార అయితే? అబ్బ! ఎంత తియ్యటి జీవిత మది!

ఆ రోజంతా సినీజీవితం గురించే ఆలోచించింది సీత. సాయంత్రం అఖిలతోపాటు బయటి కొచ్చేసరికి వినోద్ కారుతోసహా సిద్ధంగా ఉన్నాడు.

"రండి!" అన్నాడు బాక్ డోర్ తెరుస్తూ.

తను కారులో ఎక్కడానికి సంశయించింది సీత.

"నేను నడిచే వెళ్తాను... మీరు వెళ్ళండి..." అంది నవ్వుతూ.

"ఊహూ! దయచేసి ఎక్కండి! మీఇంటి దగ్గర వదిలే బాధ్యత మాది! ఏం అఖిలా?" చనువుగా అన్నాడతను, సీత కళ్ళల్లోకి చూస్తూ. చూపులు మరల్చేసుకొంది సీత.

ఆ చూపులు తను ఎదుర్కోలేదు. వాటిల్లో ఏదో గిలిగింతలు పెట్టేశక్తి ఉంది.

"కమాన్ సీతా! హెజిటేట్ చేస్తున్నా వెందుకు?'' బలవంతపెడుతూ అంది అఖిలఖాను.

సీత కార్లో కూర్చుంది.

అమెకు భయంగా ఉంది. వినోద్ తనని ఇంటిదగ్గర డ్రాప్ చేస్తానంటున్నాడు! తనిల్లు ఇల్లులా ఉంటుందా అసలు? ఓ కోళ్ళగూడులా ఉంటుంది. వెలసిపోయిన గోడలూ-శిథిలావస్థలో ఉన్న పెంకులూ-

నాలుగంతస్తుల అందమైన భవనంలో ఉండే మనిషి హఠాత్తుగా తన ఇల్లు చూస్తే ఇంకేమయినా ఉందా? తనమీద గౌరవమేపోతుం దతనికి. తనలాంటి అందమైన అమ్మాయి అలాంటి పాడుబడ్డ ఇంట్లో నివసిస్తోందన్న విషయం అతనికి తన ఎడల చులకనభావం కలుగజేస్తుంది. ఆ ఇల్లు తన అందాన్ని తగ్గిస్తుంది! వ్యక్తిత్వాన్ని రూపుమాపుతుంది.

ఎలాగోలా కారు తనింటికి పోకుండా చూడాలి! ఏదో వంకబెట్టి మెయిన్ రోడ్ దగ్గరే ఆపించి, తను దిగిపోవాలి!

"మీ ఇల్లెటో చెప్పండి! డ్రాప్ చేస్తాను..." అన్నాడు వినోద్.

"అదిగో! ఆ కనబడుతున్న హోటల్ దగ్గర ఆపండి! అక్కడినుంచి చాలా దగ్గరే మా ఇల్లు! నేను నెమ్మదిగా వెళ్ళిపోగలను..." అంది నెమ్మదిగా.

"ఎందుకు! మమ్మల్ని మీ ఇంటికి ఆహ్వానించడం మీ కిష్టం లేదనుకొంటాను?" నవ్వుతూ అని హోటల్ దగ్గర కారు ఆపాడతను.

"అదేంకాదు! నాకు త్రోవలో మా ఫ్రెండ్ ఇంటి కెళ్ళాల్సిన పని ఉంది?" అంది దిగి నుంచుంటూ.

కారు కదిలింది.

"థాంక్యూ!..." అంది సీత అతనివంకే చూసి చేయి ఊపుతూ.

అతనుకూడా చేయి ఊపాడు.

నెమ్మదిగా ఇంటివేపు నడువసాగిందామె. ఆ సందంతా చాలా అసహ్యంగా ఉంది. చెత్తగుట్టలూ-రోడ్డు కిరువేపులా మురికిగుంటలూ-ఈగలూ, దోమలూ-సీతకి వళ్ళు జలదరించినట్లయింది.

ఇక్కడి మనుషులు మనుషులు కారు! పిల్లలు ఆ దుమ్ములోనే-మురికి వాతావరణంలో ఆడుకొంటున్నారు. వాళ్ళ పరుగులకీ ఆటలకీ దుమ్ము మేఘంలాగా లేచి ఆ ప్రాంతమంతా అల్లుకుపోయింది. ఓ పక్క గుడిసెలోనుంచి ఒక స్త్రీ కేకలు వినబడుతోన్నాయ్! రోజూ దాని మొగుడు తాగి వచ్చి ఆ పైముకి తంతూంటాడు, ఆ పక్క గుడిసెలో ఇద్దరు స్త్రీలు జుట్టూ జుట్టూ పట్టుకోడానికి సిద్ధమవుతున్నారు. ఇద్దరూ బూతుమాటలు యధేచ్ఛగా వాడుతున్నారు. వాళ్ళను త్వరగా దాటి నడువసాగింది సీత.

"ఏమే సీతా-ఇవాళ త్వరగా వస్తున్నావ్ ఇంటికి," బయట కూర్చుని తన రెండేళ్ళ కూతురికి తల దువ్వుతున్న సక్కుబాయ్ అడిగింది.

"అవును! త్వరగానే వస్తున్నాను." నవ్వుతూ జవాబిచ్చింది సీత. సక్కుబాయ్ సీతతోపాటు అయిదో క్లాస్‌వరకూ చదివింది తరువాత తల్లితోపాటు పాచిపని చేయడానికి వెళ్ళడంమూలాన చదువాగిపోయింది,

"త్వరగా పెద్ద ఆఫీసరయిపోవే! మీ ఇంట్లో పనిచేసుకొంటూ ఉంటాను!" అంది నవ్వుతూ.

"తప్పకుండా అవుతాన్లేవే! నిన్నొవలనని మాటిచ్చానుగా!" నవ్వుతూ జవాబిచ్చింది సీత.

ఇంటికి చేరుకొనేసరికి చెల్లాయ్ బయటే వరండాలో కూర్చుని డ్రాయింగ్ పుస్తకంలో ఏవో బొమ్మలు గీస్తోంది. తల్లి వంటింటి గడపదగ్గర కూర్చుని బియ్యం ఏరుతోంది. లోపల చీకటిగా ఉంది. పట్టపగలుకూడా ఇంట్లో చీకటిగానే ఉంటుంది. ఆ గదికి కిటికీ లేదు. వెంటిలేటర్ లేదు. లైట్

స్విచ్ వేసిందామె కరెంటు లేదు కాబోలు అదికూడా వెలగలేదు. చిరాకు పుట్టుకొచ్చింది సీతకి పుస్తకాలు టేబుల్‌మీద విసిరేసి పెరట్లోకి నడిచింది. ముఖం కడుక్కొని తిరిగి గదిలో కొచ్చేసరికి తల్లి తనకోసం గ్లాసుతో 'టీ' సిద్ధంగా ఉంచింది ఆ ఇంట్లో 'టీ' కేవలం తనకోసమే తయారవుతుంది. అందరూ 'టీ' తాగే స్తోమత తమ కుటుంబానికి లేదు కాని తనంటే ఉన్న ప్రేమవల్లా, కాలేజీలో చదివి అలసిపోయి ఇంటికొస్తుందన్న అభిమానంవల్లా యి తల్లి తనొక్కర్తికే కొంచెం 'టీ' ఇస్తుంది. ఈ 'టీ'లో భాగంకోసం ఆత్రుతగా ఎదురుచూస్తూంటుంది చెల్లాయ్ తను రోజూ అందులో కొంచెం చెల్లాకివ్వడం కూడా మామూలే! మరోగ్లాసు తీసుకొని సగం టీ అందులోకి పంచి చెల్లాయ్ కందించింది సీత సంతోషంతో అందుకొందామె.

ఈ జీవితమే తనకిష్టంలేదు! ఇలాంటి చిన్న కోరికలుకూడా నెరవేర్చుకోలేని బ్రతుకు నరకంకాక మరేమిటి? ఈ నరకానికి దూరమవాలంటే తను గొప్పదయిపోవాలి! కాని 'గొప్ప' అవడం ఎలా? తనలాంటివాళ్ళ కెక్కడున్నయ్ ఆ అవకాశాలు? కాలేజీ చదువు ముగిసీ ముగియకుండానే ఎక్కడో ఏ ప్రైవేట్ ఉద్యోగమో, లేక గుమాస్తాగిరో వెలగబెట్టాలి! ఒకవేళ ఈ రెండూ దొరక్కపోతే సేల్స్‌గరల్‌లాంటి చిన్న ఉద్యోగమైనా చేయక తప్పదు. ఆ ఉద్యోగం మరో నరకమయిపోతుంది ఉదయంనుంచి రాత్రివరకూ అలసిపోయే పని! కడుపుకూడా నిండని జీతం! కొన్నేళ్ళు ఈ విధంగా నడిస్తే-తరువాత మరో చిన్న ఉద్యోగస్తునితోనో-లేక ఫాక్టరీ వర్కర్‌తోనో వివాహం-దాంతో మళ్ళీ అన్నీ మామూలే! ఇదే పాకల్లో-చాలీ చాలని జీతం-పిల్లలు-ఇంటి చాకిరీ-మురికిబ్రతుకు-

"భగవంతుడా! నన్నీ నరకంలో ఎందుకు పుట్టించావ్? కనీసం ఇప్పటికైనా దయతలచి నన్నీ నరకంలోనుంచి బయట పడెయ్..." లోలోపలే అనుకొంది సీత

ఆమెకి కళ్ళువెంబడి నీళ్ళు తిరిగినయ్ కుర్చీలో నీరసంగా కూర్చుండిపోయింది వరండాలో దేవుడు తనకి అందం ఇచ్చేడు చాలామంది! లభించని వరం అది. కనీసం ఈ అందాన్ని ఉపయోగించుకొనయినా తను గొప్పదయిపోవాలి! ఓ గొప్పింటి కుర్రాడిని వివాహం చేసుకోవాలి! అతన్తో పాటు ఈ ఇంటికి-ఇంటిచుట్టూ అల్లుకుపోయిన బీదతనాన్ని మర్చిపోవాలి!

తన కోరికకు తనకే నవ్వు వచ్చింది సీతకి. తను సిద్ధంగానే ఉందికాని,

తనను చేసుకోడానికి ఏ గొప్పింటి కుర్రాడు సిద్ధపడతాడు. తనలాంటి అగర్భదరిద్రురాలిని చేసుకోవాల్సిన అవసరం అతనికేమిటి? తనకంటే అంద మైన ఆడపిల్లలు కొన్ని వేలమంది ఉన్నారు.

"హలో-సీతగారూ! ఏమిటంత సీరియస్‌గా ఆలోచిస్తున్నారు?"

ఉలిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకొంది సీత. ఎదురుగా చలపతి నుంచుని ఉన్నాడు.

"నువ్వా!" చిరాగ్గా అంది సీత! తన కంటూన్న కలలు అతనిమూలాన చెదిరిపోవడం కొంచెం కోపంకలిగించిం దామెకి.

"ఇంకెవరనుకొన్నా వేమిటి?" నవ్వుతూనే అడిగాడతను ఆమె కూర్చున్న కుర్చీమీద చేతులుంచుతూ.

అతని చనువు రానురాను భరించరానిదిగా తయారవుతోంది! అత్త కొడుకయి నంత మాత్రాన తనమీద అతనికేవో హక్కులున్నట్లూ-ఎంతో చనువున్నట్లు అతనంటే తను పడిచస్తున్నట్లు——

"ఎవరూ లేదులే—" అక్కడినుంచి లేచి వంటింటివేపు నడిచిందామె

"అయ్యో! నాతో మాట్లాడమే కష్టంగా ఉందే నీకు! చూస్తూండు! ఏదో ఒక రోజు నేను పేద్ద ఆఫీస రయిపోతాను! అప్పుడు నువ్ ట్రూ కాఫీస్‌మీద సంతకంకోసం నా దగ్గరకే వస్తావ్..." నవ్వుతూ అన్నాడతను.

"నువ్వా-ఆఫీసరయేది ?" వెనక్కు తిరిగి హేళనగా అతనివంక చూసి అందామె.

"అవును ! ఏం ? అనుమానంగా ఉందా ? మొన్నే బాంక్ ఆఫీసర్‌కి పరీక్ష రాశాను. చూస్తూండు. ఠకీమని సెలక్టయిపోతాను కూడా !"

"ఏమీ కావు ! అదంత తేలికయితే డిగ్రీ అయి రెండేళ్ళవుతోన్నా ఇంకా పరీక్షలెందుకు రాస్తూంటావ్, ఉద్యోగాలకోసం ?" అతనిని అవమానపరచా లన్న ఉద్దేశంతో అందామె.

కాని చలపతి అదేమీ పట్టించుకోలేదు.

"ఎన్ని ఇంటర్వ్యూలయితే అంత అనుభవం వస్తుందట ? అందుకే నేనూ ఉద్యోగంకోసం తొందరపడటంలేదు..."

"ఓహో ! అలాగా ! మరి, ఆ చిరిగిన చొక్కాలూ - తెగిన చెప్పులూ అవన్నీ కూడా అనుభవంకోసమేనా ?" వెక్కిరింపుగా అందామె.

"అవును మరి ! ఆఫీసరయిన తరువాత ఇవన్నీ వేసుకొనే అవకాశం ఎలా



కలుగుతుంది చెప్పు! అందుకే వీలయినన్ని రోజులు వీటినే ఆశ్రయించ దలచుకొన్నాను..."

ఎన్ని మాటలన్నా ఏమాత్రం కోపంలేకుండా, నవ్వుతూ మాట్లాడటం ఆశ్చర్యం కలిగించింది సీతకి.

"ఈ మనిషి కోపానికి అతీతుడా ఏమిటి? అసలు వంట్లో ప్రవహించేది రక్తమేనా"

ఈలోగా సీత తల్లి వంటింట్లోనుంచి అక్కడి కొచ్చింది

"ఏం చలపతీ! కనపడి చాలారోజులయినట్లుంది?" అడిగిందామె కుతూహలంగా. సాధారణంగా ప్రతిరోజూ ఒక్కసారయినా వచ్చిపోతూంటా డతను

"ఎక్కడత్తా! ఉదయం లేచినదగ్గర్నుంచీ, సాయంత్రం పడుకోబోయే

వరకూ ఉద్యోగంకోసం తిప్పలే ! ఇంటర్వ్యూలు, పరీక్షలు, ఎన్నిటికి హాజరవుతున్నా దొరికే సూచనలు ఎక్కడా కనిపించడంలేదు..." కొంచెం నిరుత్సాహంగా అన్నాడతను

"దొరుకుతుందిలే ! కొంతకాలం ఓపికపట్టాలి మరి..." ఓదార్పుగా అందామె

సీత గడపలోనే కూర్చుని ఆ సంభాషణతో తనకేమీ సంబంధంలేనట్లు ఏదో కాలేజి పుస్తకం తీసి చదువుకోసాగింది

"నీతో మాట్లాడాలనివస్తే - నువ్వేమో పుస్తకాలు చదువుకొంటూ కూర్చుంటావా ?" ఆమెకు దగ్గరగా నిలబడి అన్నాడతను.

"ఏమిటా మాట్లాడాల్సింది ? విసుగ్గా అడిగింది సీత ! చలపతికి కోపంగా మారిన ఆమె ముఖంలోని అందం చూస్తూంటే పరవశత్వం కలుగుతోంది ! ఆమె ఏంచేసినా అందం ఉట్టిపడుతుంది. ఇలా చిరాకుపడుతూన్నప్పుడు మరింత ఆకర్షణీయంగా, మరింత మోహనంగా ఉంటుంది.

"ఏముంది ! నా గోడే ! నిన్న ఒక ఇంటర్వ్యూ కెళ్ళాను ! ఓ ఫర్టిలైజర్ కంపెనీలో ఎకౌంట్స్ గుమాస్తా ఉద్యోగమది ! మూడుపంతులు సెలెక్టయినట్టే! కనుక ఈ సందర్భంలో నీకో చిన్న టీపార్టీ ఇవ్వాలనుకొంటున్నాను..."

"నాకేం అవసరంలేదు..."

"భలేదానివే ! ఇంటర్వ్యూ సవ్యంగా జరిగితే నీకు టీపార్టీ ఇస్తానని దేవుడికి మొక్కుకొన్నాను.

"ఇంక వెళ్ళరాదూ ? నేను చదువుకోవాలి !..."

"ఏమిటి ? అప్పుడే వెళ్ళిపోవాలా ? కాబోయే భర్తతో మాట్లాడే పద్ధతిదేనా ?''

"ఎవరు, నాక్కాబోయే భర్త ?" కోపంగా అంది సీత.

"అప్పుడే మర్చిపోయావా ? చేసుకొన్న బాసలూ - మరచిపోననీ - మరువాలేననీ - చేతిలో చెయ్యేసి చెప్పు సీతా ! ..." పాట పాడసాగాడు చలపతి.

"ఇంక ఆపు ! నీ కెవరూ బాసలు చేయలేదిక్కడ ?"

"అబద్ధం చెప్పకు ! నువ్ చేయలేదూ ?"

"ఎప్పుడూ ?"

"ఆ మధ్య నా కల్లోకొచ్చి..."

"నా కంత ఖర్మం పట్టలేదు ! నేను ఉద్యోగం చేయగలను. నా పొట్ట నేను పోషించుకోగలను..."

"నువ్వు 'వీమన్స్ లిబ్'లో చేరావా ?"

"అవును ! ఇంక వెళ్ళరాదూ ?"

"వెళ్ళను !"

సీతకు కోపం ఆగటంలేదు కాని భరించటానికి విశ్వప్రయత్నం చేస్తోంది. అసలితగాడికి తనమీద అలాంటి అభిప్రాయం ఎలా ఏర్పడిందో అర్థంకావడం లేదు. ఏనాడూ అలాంటి ఊహలు కలిగే అవకాశాలు తను కల్పించలేదు. తన ఆశలు వేరు ! తన కోరికలు తనవి ! తను గొప్పదవాలి ! ధనికుడిని పెళ్ళాడాలి ! ఈ మురికి కూపానికీ, ఈ తీరని కోరికలకీ, దూరంగా వెళ్ళిపోవాలి ! మనిషి బ్రతికేది, మహా అయితే ఎనభై ఏళ్ళు ! అందులో జ్ఞానం తెలిసేసరికి పదేళ్ళు గడచిపోతయ్ ! యాభై సంవత్సరాల తర్వాత కోరికలే సన్నగిల్లిపోతయ్. మిగిలిన నలభై సంవత్సరాలలో ముప్పై ఏళ్ళు సుఖాలు అనుభవించలేకపోతే ఇంక జీవితం ఎందుకు ? ఇంత విషం తిని ఆత్మహత్య చేసుకొంటే ఏ గొడవా ఉండదు కదా ! ఎవ్వరికీ భారం కాదుకదా !

సీత అక్కడినుంచి లేవబోయింది.

"ఆగాగు..." నవ్వుతూ అన్నాడు చలపతి.

"ఇంకేమయినా మాట్లాడాల్సిందుందా ?"

"ఇంతవరకూ అసలు మొదలే అవలేదు...ఇంతకూ రేపు సాయంత్రం మా యింటి కొస్తున్నావా లేదా ?"

"ఎందుకు ?"

"రేపు నా పుట్టినరోజు..."

"అయితే ?"

"నా పుట్టినరోజునాడు నాక్కాబోయే భార్య నా దగ్గరే ఉండవద్దూ ?"

"ఇంకోసారలా అంటే మర్యాదగా ఉండదు ! కాబోయే భార్యట — భార్య కింకంటె మంచివాళ్ళే దొరకరు కాబోలు నాకు..."

"ఎక్కడున్నారు చెప్పు ?"

"చాలా మందున్నారు ! అయినా నిన్ను తప్ప నేను మరెవర్నయినా నేను కోడానికి సిద్ధంగా ఉన్నాను..."

"నేనేం పాపం చేశానుట ?"

"నేను చదువుకోవాలని చెప్పానా ? ఇంక వెళ్ళు !"

"వస్తే వెళ్ళను !..."

"సరే–నేనే వెళ్తాను..." ఆ గదిలోనుంచి చరచరా వంటింటిలోకి నడిచి తల్లికి దగ్గరగా పీటవేసుకొని కూర్చుంది.

"చూశావా అత్తయ్యా ! సీతేమంటోందో ! నన్ను పెళ్ళిచేసుకోదట..." నవ్వుతూ అన్నాడు చలపతి వంటింటి గడపదగ్గర నుంచుని !

"అవును మరి ! నీకింకా ఉద్యోగమే రాలేదుకదా ! ఎలా ఒప్పుకొంటుంది మరీ ?" తనూ నవ్వుతూనే అందామె.

"చేస్తానత్తయ్యా ! సీతకోసమయినా మాంచి ఉద్యోగం చేస్తాను చూస్తూండు..."

"నీ ఉద్యోగం అవసరంలేదు. నువ్వూ అవసరంలేదు..." విసుక్కొంది సీత.

మరి కాసేపు కూర్చుని వెళ్ళిపోయాడు చలపతి.

చాలాసేపు అతని గురించిన ఆలోచనలతోనే గడిపింది సీత. తనే అతనికి చాలా చనువిచ్చేసింది. మొదట్లోనే దూరంగా ఉంచినట్లయితే ఇవాళ అతనికిలాంటి అభిప్రాయం ఏర్పడి ఉండేదికాదు.

"పెళ్ళట–పెళ్ళి !" తెలిసి మళ్ళీ అదే నరకంలోనా పడటం ? మహా అయితే చలపతికి ఏ గుమాస్తా ఉద్యోగమో దొరుకుతుంది ! అదీ ఉన్న ఊళ్ళో దొరుకుతుందన్న నమ్మకంలేదు. అతనికొచ్చే జీతంలో తమని పోషించుకొంటూ, అతని తల్లిదండ్రుల్నీ, అరడజనుమంది చిన్నపిల్లల్నీ పోషించడం ఎలా సాధ్యం ? మళ్ళీ కథ మొదలవుతుంది. వాళ్ళకోసం తామిద్దరూ తిండి త్యాగం–బట్టల త్యాగం–సరదాల త్యాగం – సర్వం త్యాగమయం అయిపోతుంది జీవితం ! ఇలాంటి అడుక్కు–తినే జీవితం కాదు తను కోరుకొనేది. ఈ జీవితమంటే ఏనాడో తనకు అసహ్యం పుట్టింది. వంటింట్లోంచి తల్లికేక వినిపించింది. చేతిలోని పుస్తకం అవతలపడేసి వంటింటివేపు నడిచిం దామె. తమ్ముడు కూడా అప్పుడే ఎక్కడెక్కడో తిరిగి తిరిగి వచ్చినట్లున్నాడు. వాడికి రెండు నెలల్నుంచీ స్కూల్ ఫీజు కట్టటంలేదు. అందుకని వాడు స్కూల్ కెళ్ళటం లేదు. స్నేహితులతో బజార్లవెంబడి తిరుగుతున్నాడు. ముగ్గురికీ భోజనం వడ్డించింది తల్లి.

మౌనంగా భోజనం చేయసాగింది సీత. అవి రేషను బియ్యం. అంచేత ఆ

అన్నానికి రుచి ఉండదు. కూరలు- రోజూ వండుకొనే తాహతు తమకు లేదు ఏవో పచ్చడి మెతుకులు-చారు-నీళ్ళమజ్జిగ...

త్వరత్వరగా ముగించి మళ్ళీ బయటి గదిలోకి నడిచిందామె. తండ్రి ఇంకా రాలేదప్పటికి. ఆయనింటి కొచ్చేసరికి ఇంచుమించుగా అర్థరాత్రవుతుంది. ఇరవైనాలుగ్గంటలూ ఇంచుమించుగా ఆఫీసునే అంటిపెట్టుకొని గడుపు తూంటాడు. నెలయేసరికి జీతం తీసుకొచ్చి భార్య చేతికిస్తాడు. అంతే! ఇంకేమీ ఆయనకు తెలీదు. తెలిసినా పట్టించుకోడు. సమస్యలంటే ఆయనకు భయం! వినబడనంతదూరం పారిపోతాడు.

ఆయన మనిషికాదు! మనిషి రూపంలో ఉన్న మెషిన్!

పుస్తకంమీదకు దృష్టి సారించింది సీత.

...ఫర్ ఎవ్విరీ యాక్షన్ దేరీజ్ యాన్ ఈక్వల్ అండ్ ఆపోజిట్ రియాక్షన్..."

చదివాలి! న్యూటన్స్ లా ఆఫ్ మోషన్స్ - పైథాగరస్ సిద్ధాంతాలూ- ఇంకా చాలా చాలా తెలుసుకోవాలి! తెలుసుకొని తనలాంటి ఆడది ఏంచేస్తుంది? వంటింట్లో వంట చేసుకొంటూ అవన్నీ తీరిగ్గా మర్చిపోతుంది. మరిం కెందుకవి తెలుసుకోవడం? ఏం ఉపయోగపడతాయని? పోనీ-ఒకవేళ ఉద్యోగంచేసినా చదివిన చదువులకీ-చేసే ఉద్యోగాలకీ ఏమయినా సంబంధం ఉంటుందా? బియస్సీ-ఎమ్మెస్సీ చదివినవాళ్ళు ఎకౌంటెన్స్ గుమాస్తాలుగా పనిచేస్తున్నారు. కామర్స్ చదివినవాళ్ళు జర్నలిజం చేస్తున్నారు ఆర్ట్స్ చదివినవాళ్లు సినిమా టిక్కెట్లమ్ముతున్నారు. మరీ చదువుల కర్థం ఏమిటి? రానురాను ఇంజినీరింగ్, మెడిసిన్ కూడా అలాగే తయారవుతోన్నయ్!

ఠక్కున వినోద్ గుర్తుకొచ్చాడు సీతకి. వినోద్ మెడిసిన్ చదువు తూన్నాడు. రేపో మాపో డాక్టరవుతాడు. దాంతో అతని పేరూ ప్రతిష్టా, ఆస్థీ అన్నీ పెరుగుతయ్! అతన్ని తను ... ఆకర్షించిందా? ఏమో! అతని చూపుల్లోమాత్రం అలాంటి భావమే కనపడుతుంది! తనకు దగ్గరవడానికి అతను ప్రయత్నిస్తున్నట్లు స్పష్టంగా తెలిసిపోతోంది. ఎందుకు? ఒకవేళ తను కోరితే - తనను పెళ్ళాడటానికి ఒప్పుకొంటాడా? ఏమో! తన కెలా తెలుస్తుంది? అలా జరిగితే నిజంగా తనంత అదృష్టవంతురా లెవరుంటారు?

కార్లలో తిరుగుతుంది! దేశ దేశాలూ తిరుగుతుంది. సినిమాల్లో చూసినట్లు ఇంటి బాధ్యతంతా తనే తీసుకొంటుంది ఇనప్పెట్టెలో మూలిగే డబ్బుకి తనే

అధికారిణి అవుతుంది ! ఇంట్లో బోలెడుమంది నౌకర్లు ! తనంటే ప్రాణమిచ్చే ఆడబిడ్డలు – గౌరవించే మరుదులూ – ఆదరించే అత్త మామలు – అన్నట్లు సినిమా రూల్స్ ప్రకారం మామగారు. ఏదో జబ్బుతో బాధపడుతూండాలి ! తను ఆయనకు బలవంతంగా మందులు తాగిస్తూండాలి...

అబ్బ ! ఎంత తియ్యటి జీవితం ! తన ఎదుట ఎలాంటి జీవితం రాబోతోందో ఏమిటో ?

నిద్ర కళ్ళమీద కొస్తోంది ! హఠాత్తుగా బయటి పాకల్లో పెద్దపెత్తున పోట్లాట చెలరేగింది. కలగాపులగంగా అరుస్తోన్న గొంతులు ! అసలు గొడవ వెందుకొచ్చిందో అర్థంకావటంలేదు. చాలా సేపటికి కేకలు తగ్గిపోయినయ్. ఒకగుండె ఏడుస్తోన్న స్త్రీ గొంతుమాత్రం వినబడుతోంది. దగ్గరలో ఎవరో మరో పాకవాళ్ళు మాట్లాడుకొంటున్న మాటలద్వారా అసలు సంగతి అర్థమయింది సీతకి.

చాలారోజులక్రితం భర్త్రచే గెంటివేయబడి పుట్టింటికి చేరుకొన్న నాంచారమ్మ భర్త ఇప్పుడు మరో పెళ్లి చేసుకొన్నాడట ! అందుకని నాంచారమ్మ ఏడుస్తోంది – తన జీవితం, తన తల్లిదండ్రులే పాడుచేశారని పోట్లాడింది ! చివరకు ఏమీ చేయలేక – జరిగింది మర్చిపోలేక – ఇక ముందేం చేయాలో నిర్ణయించుకోలేని పరిస్థితిలో——

సీతకి కోపం వచ్చింది. ఈ మొగాళ్ళింత నీతీ నియమం లేనివాళ్ళేం ? ఆడదంటే అంత చులకనేమిటి, వీళ్ళకు ? ఆడది మనిషి కాదా ? ఆడదానికి వ్యక్తిత్వం ఉండకూడదా ? సిగ్గూ, శరం—అభిమానం— ఆత్మగౌరవం— ఇవేమీ ఆడదానికి పనికిరావా ? ఎన్ని యుగాలు గడిచినా మగాడికి బానిసగా బ్రతకాల్సిందేనా ? మొగుడు తాగి వచ్చి కొట్టినప్పుడూ – అవమానించి గెంటి నప్పుడూ – అనుమానించి వదిలేసినప్పుడూ – మోసంచేసి తప్పు కొన్నప్పుడూ – అన్ని సందర్భాల్లోనూ నోరెత్తక పడివుండాల్సిందేనా ? దారుణంగా నష్టపడాల్సిందేనా ? జీవితమంతా తలెత్తడానికి వీల్లేని బ్రతుకుగా భావించాల్సిందేనా ?

ఆ మగాడిని అడిగేవారూ, దండించేవారూ, గమనించేవారూ, నష్టపడేవారూ ఎవరూ లేరా ?

తన స్నేహితురాలు సక్కుబాయ్ సంగతేమిటి ? పెళ్ళిచేసుకొంటానని మభ్యపెట్టి, దానిచుట్టూ తిరిగి – దానిని లొంగదీసుకొని – తీరా గర్భం




వచ్చాక నీకూ, నాకూ సంబంధం లేదన్న ఆ పెద్దమనిషిని ఎవరేమయినా అన్నారా ?

నిక్షేపంలా వాడికి మరో పిల్లనిచ్చి అందరూ కలిసి పెళ్ళిచేశారు  వాడు చేసింది తప్పన్నవారు లేరు, సక్కూబాయ్‌ది తప్పుకాదన్నవారూ లేరు.

సక్కూబాయ్ సంగతి ఎవరికీ పట్టలేదు “పెళ్ళికాకముందే గర్భం వచ్చింది” అంటూ తూలనాడారు. నిజంగా సక్కూబాయ్ ధైర్యవంతురాలు ! దానికున్న ధైర్యంలో - తెగింపులో - జ్ఞానంలో వందోవంతు ప్రతి ఆడదానికీ ఉండుంటే - స్త్రీ గతి ఇంత దారుణంగా ఉండేదికా దివాళ !

పుట్టిన పాపాయిని ఎవరికో ఇచ్చేయమని తల్లిదండ్రులంటే ససేమిరా ఒప్పుకోలేదు సక్కుబాయ్ !

“ఇది నా పాప ! నేనే పెంచుకొంటాను...” అంది. “మరి నీకు పెళ్ళెలా అవుతుంది” అనడిగితే “ఛీ ! మగాడిని చూస్తేనే అసహ్యంగా ఉంది” అంటుంది అంతే ! ఆ రోజునుంచీ ఇప్పటివరకూ అలాగే ఉందది!

ఎప్పుడు నిద్రపట్టేసిందో తెలీదు ! ఉదయం మెలకువ వచ్చేసరికి ఏడు దాటింది టైము తండ్రి అప్పటికే ఆఫీస్ కెళ్ళడానికి తయారవుతున్నాడు తనూ లేచి కాలేజికి వెళ్ళే ప్రయత్నాలు మొదలుపెట్టింది సీత.

కాలేజికి బయల్దేరేసరికి తొమ్మిదయిపోయింది అంటే పావుగంట ఆలస్యంగా బయల్దేరిందన్నమాట ! త్వరత్వరగా నడువసాగిందామె.

మెయిన్‌రోడ్ దగ్గర బస్ స్టాప్‌లో నిలబడింది. ఏ బస్సూ ఆగటంలేదు ! బాగా రష్‌గా ఉన్నాయ్ ! ఫుట్‌బోర్డులమీద వేలాడుతున్నారు జనం

దూరంగా వస్తోన్న కారుని గుర్తించింది సీత. ఆమె మనసు కొద్దిక్షణాలు ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది. అది అఖిల వాళ్ళకారు కాని అప్పుడే కాలేజీవేపునుంచి వస్తోందేం ! రివ్వుమంటూ వచ్చి సడన్ బ్రేకులతో స్టాప్‌కు దగ్గరగా ఆగింది. వినోద్ నవ్వుతూ ఆమెవంక చూసి వెనుక తలుపు తెరచాడు.

"రండి ! కాలేజ్ దగ్గర డ్రాప్ చేస్తాను..."

బస్ స్టాప్‌లో ఉన్నవారందరూ సీతవంక వింతగా చూడసాగారు. తనకూ, వినోద్‌కూ సంబంధం ఏమిటి ? అదే వాళ్ళకొక్కాలసింది.

కాని వెనుక అఖిల లేదే ! ఆమె ఏమయింది ?

కారు దగ్గరకు నడిచింది సీత.

"అఖిల రాలేదూ !" అడిగిం దతన్ని.

"ఇప్పుడే డ్రాప్‌చేసి వస్తున్నాను ! కూర్చోండి ! బస్‌లు దొరికేసరికి మీకు ఆలస్యం అయేట్లుంది..."

మాట్లాడకుండా కూర్చుంది సీత.

వెనక్కు తిప్పి వేగంగా నడపసాగాడతను.

అతని పక్కనే స్టెతస్కోప్ పడివుంది సీటుమీద! తనకూ మెడిసిన్ చదవాలని ఎంతో కోరిక ! చిన్నప్పుడు మిగతా పిల్లల్తో ఆడేప్పుడుకూడా తను డాక్టరుగా వ్యవహరించేది ! కాని అది తనలాటి ఆడపిల్ల కోరుకోవాల్సిన కోరిక కాదు ! ఈ కాలేజీ చదువయినా సక్రమంగా ముగిస్తే చాలు ! మెడిసిన్ పూర్తిచేసినంత ఫలితం మెడిసిన్ చదివే వాళ్లందరూ ఎంత సరదాగా – హాయిగా జీవితం గడుపుతారో తనకు తెలుసు. తన స్నేహితురాలు ఉష మెడిసిన్‌లో చేరింది. అదెప్పుడూ చెప్తుండేది అక్కడి వాతావరణం గురించి. సెకండ్ ఇయర్‌లోనే అది ఓ కుర్రాడితో ప్రేమకలాపాలు సాగిస్తోంది ! ఇద్దరూ పెద్దవాళ్లకు తెలీకుండా చిక్కడ్‌పల్లిలో ఓ ఇల్లు అద్దెకు తీసుకొని అందులో రహస్యంగా కాపురం చేస్తున్నారు.

"మీకు శ్రమ ఇస్తున్నాను..." అంది సీత నెమ్మదిగా.

"భలేవారే ! మీకు సహాయపడే అవకాశం కలగడం నా అదృష్టం !" వెనక్కి తిరిగి చూడకుండానే అన్నాడతను.

అతని మాటలకు సీత ఉక్కిరిబిక్కిరయింది.

"మీలాంటివారు మెడిసిన్ చదవాల్సింది !" తిరిగి అన్నాడతను.

"ఎందుకనో ?"

"అందమైన అమ్మాయిలు డాక్టర్లయితే పేషెంట్ల జబ్బులు త్వరగా తగ్గిపోతయ్ !" నవ్వేసింది సీత. అతనూ నవ్వాడు.

"నేనేం గొప్ప అందగత్తెనుకాను లెండి ! మా ఇంట్లో అద్దం ఉంది!"

కావాలని అంది సీత. తన అందాన్ని అతను గుర్తించడమే తన క్కావలసింది. అలా జరిగితే తరువాత తన నెలాగూ అదృష్టం వరిస్తుంది.

కాలేజి దగ్గర ఆగింది కారు. దిగి నుంచుంది సీత.

"థాంక్యూ..." అంది నవ్వుతూ.

"నేనే మీకు థాంక్స్ చెప్పాలి ! నా కార్లో వచ్చినందుకు..."

లోపలకు నడిచింది సీత.

అప్పుడే లెక్చరర్ క్లాస్‌లోకి వస్తోంది.

అఖిల పక్కనే కూర్చుంది సీత.

"ఇవాళ ఆలస్యమయిందేం? మా అన్నయ్య దారంతా నీకోసం వెతుకుతూనే ఉన్నాడు !" నవ్వుతూ అందామె.

"ఎందుకు ?"

"నువ్ చాలా బావుంటావుట వాడి కళ్లకి !" ఆమె మాటల్లో కొంత ఈర్ష్య కూడా చోటుచేసుకొన్నట్లు పసిగట్టింది సీత.

ఇక్కడ మళ్ళీ వర్గపోరాటం మొదలు. బీదాళ్ళు, గొప్పాళ్లతో సమానం కాకూడదు. వాళ్ల వీరికంటె ఎందులోనూ ఆధిక్యత సంపాదించకూడదు !

కాని తనది దేముడిచ్చిన అందం ! తనేం చేస్తుంది దానికి !

ఇంతకూ తనను అతను తీసుకొచ్చి కాలేజి దగ్గర వదిలిన సంగతి చెప్పాలా వద్దా అని కొద్దినిమిషాలు ఆలోచించింది సీత.

చివరకు చెప్పకుండా ఉండటమే మంచిదన్న నిశ్చయాని కొచ్చింది. తన కిప్పుడు నమ్మకం కలిగింది, వినోద్ తన ఆకర్షణకు గురయ్యాడు. అత నెన్నోసార్లు తన గురించి అఖిల దగ్గర ప్రస్తావించి ఉండవచ్చు. అందుకే అఖిల తనమీద ఈర్ష్యను పెంచుకొంటోంది.

ఆ రోజంతా ఏవేవో మాట్లాడారు గాని – అఖిల తనతో మాట్లాడ్డానికి ఇష్టత చూపకపోవడం గమనించింది సీత.

మధ్యాహ్నం ఇంటర్వెల్‌లో కొత్తగా రిలీజయిన ఓ హిందీ సినిమాలోని హీరోయిన్ ధరించిన దుస్తులు గురించి చర్చ జరిగింది.

వెంటనే అలాంటి ఫాషన్ దుస్తులు ధరించడానికి సంసిద్ధులయారు నలుగురు అమ్మాయిలు. ఆ సాయంత్రమే కాలేజినుంచి ఇంటికి వెళ్లేముందు బట్టలు కొనడానికి నిర్ణయమయిపోయింది.

సీత ఓసారి తను కట్టుకొన్న చీరవంక చూసుకొంది! ఆ క్లాసందరిలోకీ తనే పాతకాలపు ఫాషన్‌లో ఉంటుంది. తన బట్టలు కూడా అతి సామాన్యంగా అతి తక్కువ ఖరీదువయి ఉంటయ్!

ఇలాంటి తక్కువతనంతో ఈ చదువు చదవటంకంటె చదవకపోడం మంచిదని తన ఉద్దేశం.

కాని తల్లిదండ్రుల బలవంతం మూలాన చదవాల్సివస్తోంది. వాళ్ళెందుకు అలా బలవంతం చేస్తున్నారో కూడా తనకు తెలుసు. తను ఓ డిగ్రీ తీసుకొని ఏదయినా ఉద్యోగంలో ప్రవేశించి, నాన్నగారు రిటయిరయేలోగా ఈ కుటుంబం పూర్తిబాధ్యత తీసుకోవాలి! ఇదెంతవరకూ సాధ్యమో తనకి తెలియదు! ఇలాంటి త్యాగాలు తనకు నచ్చవ్ కూడా! జీవితమంతా ఒకరికోసం అవస్థలు పడుతూ, త్యాగాలుచేస్తూ గడిపేస్తే ఇక ఆ జీవితానికి అర్థం ఏముంటుంది? మిగతావారంతా గుర్తుకొచ్చినప్పుడల్లా, "మా అక్క ఎంతో గొప్పది! దాని మనసు గొప్పది! దాని జీవితం గొప్పది!" అనుకొని తాము ఆనందంగా అనుభవిస్తూంటారు.

ఆ సాయంత్రం అఖిలకంటె ముందుగా ఇంటికి బయల్దేరింది సీత. బస్ వెంటనే దొరికింది.

బస్‌లో సునీత వాళ్లమ్మ కనిపించింది. చిన్నప్పుడు తమ ఇంటి దగ్గర్లోనే ఉండేవాళ్ళు! సునీత, తనూ కలసి ఆరో క్లాసువరకూ చదువుకొన్నారు కూడానూ! హఠాత్తుగా సునీత తండ్రి చనిపోవడంతో వారికి వేరే ఆధారం లేకుండా పోయిందినతి. దానికి తిండిలేని పరిస్థితుల్లో ఆమె తనకున్న కొద్దిపాటి అందాన్ని, అందమైన శరీరసౌష్టవాన్ని అమ్ముకోవడం మొదలుపెట్టింది. కొద్దిరోజుల్లోనే ఆమె పరిస్థితి మారిపోయింది. నారాయణ్‌గూడాలో మంచి ఇల్లు కొనుక్కొన్నారు. బాంక్ బాలెన్స్ ఏర్పడింది. తర్వాత సునీత కూడా అదే




వృత్తి అవలంబించినట్లు తనకు తెలిసింది. ఇప్పుడు వాళ్ళ కేవిధమయిన లోటూ లేదు.

"కాలేజీనుంచా ?" అడిగిందామె.

వార్ధక్యం మీదపడుతోన్నా బలవంతంగా తోసివేయడానికి ప్రయత్నిస్తోందామె అలంకరణ.

"అవునాంటీ !"

"నిన్ను చూసి చాలారోజులయిపోయింది కదూ ! వెంటనే గుర్తుపట్టలేకపోయాను..." నవ్వుతూ అందామె.

నవ్వి ఊరుకొంది సీత.

"ఓసారి మా ఇంటికి రాకూడదూ ?"

"వస్తాను ! వీలుచూసుకొని..." అంది సీత.

"తప్పకుండా రా ! సునీత కూడా నిన్ను చూసి చాలా రోజులయిందంటోంది !"

"అలాగే..."

ఆమెనుంచి తప్పించుకోడానికి తను దిగాల్సిన స్టేజికంటె ఓ స్టేజిముందే బస్ దిగింది సీత.

రోజులు గడుస్తూనే ఉన్నయ్.

ఓ ఆదివారం ఉదయం చలపతి హడావుడిగా వచ్చాడు సీత ఇంటికి.

"నిన్న సాయంత్రం ఆర్డర్స్ వచ్చినయ్ ! ఓ కంపెనీలో ఎకౌంటెంట్ ఉద్యోగం వచ్చింది" అన్నాడు సీతతో ఆనందంగా.

ఆ వార్త సీతకి ఆనందం కలిగించింది గానీ, మరుక్షణంలో భయం కూడా వేసింది.

'ఇప్పుడు కొంపదీసి మళ్ళీ పెళ్ళాడమని అడుగుతాడేమో ఇతగాడు !'

ఇంట్లో అందరితో చెప్పి స్వీట్ పాకెట్స్ ఇచ్చేడు.

"నీకుమాత్రం సాయంత్రం స్పెషల్ పార్టీ ఎరేంజ్ చేస్తున్నాను. ఎక్కడో తెలుసా ? 'అన్నపూర్ణా హోటల్‌లో.'"

"నే నెక్కడికీ రాను..." అంది సీత.

"రాకపోతే బలవంతంగా పట్టుకుపోతాను...తెలుసా ? అదివరకటి చలపతి నన్నుకొంటున్నావేమి టింకానూ ! మూడువందల యాభై రూపాయల జీతగాడి నిప్పుడు..."

"అయితే ?"

"అయితే లేదు, గియితే లేదు ! మధ్యాహ్నం మూడింటి కొస్తున్నాను సిద్ధంగా ఉండు ! తెలిసిందా ?"

"ఊహూ కుదరదు ! నాకు వేరే పనుంది !"

"అవన్నీ ఇవాళ్టికోసం కట్టిపెట్టు !"

అనేసి మళ్ళీ హడావుడిగా అక్కడినుంచి వెళ్ళిపోయా డతను.

మధ్యాహ్నంవరకూ సీత ఆలోచిస్తూనే గడిపింది. ఎలా ఇతనిని వదిలించు కోవడం ? మధ్యాహ్నం మూడింటికి ఖచ్చితంగా వచ్చేస్తాడు.

తనని రమ్మని బలవంతం చేస్తాడు. ఇప్పుడతనికి తన తల్లిదండ్రుల మద్దతు కూడా ఉంటుంది. ఎంచేతంటే ఉద్యోగస్థుడయితే అతనికి తననిచ్చి చేస్తే బావుంటుందని వారికి లోపల ఓ అభిప్రాయముంది.

రెండవుతోండగా ఓ ఆలోచన వచ్చిందామెకి. స్నేహితురాలిదగ్గర కెళ్తున్నానని చెప్పి కాసేపు రోడ్లవెంబడి తిరిగి ఇంటికొస్తే సరి ! చలపతి వచ్చి వెళ్ళిపోతాడు. త్వరత్వరగా ముస్తాబయి స్నేహితురాలింటి కెళ్తున్నానని చెప్పి ఇంట్లోనుంచి బయటపడిందామె. బస్‌లో ఆబిడ్స్ చేరుకొంది. బస్ దిగి నాలు గడుగులు వేయగానే వినోద్ కార్లో వస్తూ ఎదురయ్యాడు. ఆమెను చూస్తూనే కారు పక్కకు తీసి ఆపేశాడు.

"మీకు నిజంగా వెయ్యేళ్ళు ఆయుష్షు..." అన్నాడు నవ్వుతూ.

సీత సిగ్గుపడింది.

"నిజం ! మీరే గుర్తుకొచ్చారు ఇంతకుముందు !...మీరు కలసి చాలారోజు

లయిందనుకొంటున్నాను ! ఇంతలో మీరే వచ్చేశారు దేవత ప్రత్యక్షమయి నట్లు...ఇంతకూ ఎక్కడివరకూ వెళ్తున్నారు మీరు ? నా కారు యథాప్రకారం మీకు సేవచేయడానికి సిద్ధంగా ఉంది..."

"నేను ఊరికే బయల్దేరాను-ఇంట్లో ఏమీ తోచక ?"

"ఈజిట్ ! దేముడు దయామయుడు ! ఇద్దరం ఒకే సమస్యతో తిరుగు తున్నామన్నమాట ! తక్షణం కారెక్కేయండి ! కాసేపు కబుర్లు చెప్పుకొంటూ తిరుగుదాం ! కారు స్లోగా పోనిస్తాను...ఏమంటారు ?"

వెనుక డోర్ తెరవబోయింది సీత.

"ఉహు ! అలా మీరు వెనుకా, నేను ముందూ ఎందుకు ? రండి ! మీరు కూడా ఇక్కడే కూర్చోండి !..."

అతని పక్కనే కూర్చుంది సీత.

నెమ్మదిగా పోతోంది కారు.

"ఇంకా విశేషాలు చెప్పండి ! మరి ప్రతి ఆదివారం టైమ్ ఎట్లా పాస్ చేస్తుంటారు ?" అడిగాడతను.

"ఇంట్లోనే చదువుకొంటూ గడుపుతాను ! ఈవాళ మా బావ చలపతి మూడింటికల్లా ఇంటికొస్తానన్నాడు. అతన్నుంచి తప్పించుకోడానికి బయట పడ్డాను..." నవ్వుతూ అంది సీత. ఎంచేతో అతనిదగ్గర ఏమీ దాచాలని పించటంలేదు.

"మంచిపని చేశారు. ఈ బావలున్నారు చూశారూ ! వర్త్ మేనర్స్‌లెస్ ! మా అఖిలకూ-డా ఓ బావ ఉన్నాడు లెండి ! వాడు నాకు మంచి ఫ్రెండ్ అనుకోండి! వాడికో గర్ల్ ఫ్రెండ్ ఉంది. ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకోవాలని వాడి అభిప్రాయం ! అఖిల కేమో ఈ సంగతెలీక వాడివెంబడే పడుతుంటుంది..."

ఓ ఖరీదయిన హోటల్ ముం దాగిందికారు.

"పదండి ! కాసేపు లోపల కూర్చుని మాట్లాడుకొందాం " అంటూ లోపలకు దారితీశాడు. అతన్ని అనుసరించింది సీత. ఆమెకు చాలా ఆనందంగా ఉంది. అంతకుముందు ఒకటి రెండుసార్లు అతను ఒంటరిగా తారస పడటం; తనని కార్లో డ్రాప్‌చేయడం జరిగింది కానీ ఇలా హోటల్‌కి వెళ్ళలేదెప్పుడూ.

ఎయిర్‌కండిషన్డ్ గది అవడంచేత లోపల అంతా చల్లగా ఉంది.

ఇద్దరూ ఓ టేబుల్‌ముందు కూర్చున్నారు.

ఫ్రూట్ సాలెడ్ ఆర్డర్ చేశాడతను.

అతను చెప్పే మాటలన్నిటికీ ఊకొడుతూ కూర్చుంది సీత. ఆమెకు తెలుస్తోనే ఉంది; అతని మాటలనిబట్టి తమ పరిచయం ఇంతటితో ఆగేదికాదని. అతనికి తనమీద మనసుంది. తను ఒప్పుకోవాలే గాని ఎగిరి గంతేసి వివాహం చేసుకొంటాడు.

"అఖిల ఉంది చూశారూ ! వర్తి జెలసీ టైప్ ! మీతో నేను చనువుగా ఉండటం దాని కిష్టంలేదు. అందుకే మీతో మాట్లాడటం తగ్గించింది. అవునా ?" అడిగాడతను.

"అవును !" అంది సీత.

"ఎన్నోసార్లు మీ గురించి అడిగాను ! కాని ఎప్పుడూ ఏదో ఒకటి చెప్పి, సందర్భం మార్చేస్తూంటుంది..."

సీత నవ్వి ఊరుకొంది.

"అన్నిసార్లు అసలు మీ గురించి ఎందుకడగాలి " అని అడగరేం ‹

"అదీ మీరే చెప్పండి !..." అంది సీత.

"ఏమో నాకూ తెలీదు ! మొదటిరోజు అఖిల మనని పరిచయం చేసింది చూడండి ! అంతే ఆ రోజునుంచే నేను మారిపోయాను ! ఎప్పుడు మీతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం లభిస్తుందా అని ఎదురుచూస్తూ వచ్చాను. ఒకటి రెండుసార్లు తటస్థపడినా ధైర్యం చాలలేదు. మీతో మాట్లాడాల్సిన విషయాలు కూడా ఏమీలేవు. కాని మీరు నా ఎదురుగా మనిద్దరం ఏకాంతంగా ఉండాలనిపిస్తుంది. నిజం చెప్తున్నాను. కొన్నిరోజులు నాకు సరిగ్గా నిద్రపట్ట లేదనుకోండి ! ... ఒకవేళ దీనినే 'ప్రేమ' అంటారేమో నాకు తెలీదు ! ..." ఆగాడతను.

సీత గుండెలు వేగంగా కొట్టుకొంటున్నయ్. ఏం మాట్లాడాలో తెలీటంలేదు. అతని కళ్లల్లోకి చూడాలన్నా అదోలా ఉంది. తను కోరుకొంటున్న క్షణాలు దగ్గరవుతున్నయ్ !

"ఏమైనా మాట్లాడండి సీతగారూ ! లేకపోతే నాకు అశాంతిగా ఉంటుంది ! నేను మాట్లాడే మాటల్లో ఏమయినా తప్పుంటే చెప్పండి ! సరిదిద్దుకొంటాను. లేదా మీ అభిప్రాయం చెప్పండి ! మీకు నామీద ఎలాంటి అభిప్రాయం ఉంది ?"



"కాని మీరు ... ఎంతో ధనవంతులు—మేము చాలా బీదవాళ్లం ..." తడబడుతూ అందామె.

అతను ఘొల్లున నవ్వేశాడు.

"కావుంది ! అయితే ఏం ? దానికేం ప్రాముఖ్యత ఉందని ఇప్పుడు !" తను చాలా తెలివితక్కువగా మాట్లాడినట్లనిపించింది సీతకు. అప్పుడే తామిద్దరూ వివాహానికి సిద్ధపడుతున్నట్లూ, తమ మధ్య తారతమ్యాలు అడ్డుపడినట్లూ మాట్లాడుతోంది తను.

"నా కలాంటి భేదాలేమీ లేవండోయ్ ! నాకు చాలామంది ఫ్రెండ్స్ ఉన్నారు. అందులో ఎక్కువమంది బీదవాళ్లే ! అయినా నా కెప్పుడూ అలాంటి

భావమే కలుగలేదు ! డబ్బు దేముంది చెప్పండి ! ఎప్పుడు ఎవరిని వరిస్తుందో- ఎప్పుడు ఎవరిని వదుల్తుందో ఎవరికీ తెలీదు !"

సీత ఏమీ మాట్లాడలేకపోయింది. టేబుల్‌మీదున్న ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని మృదువుగా నిమిరాడతను. ఒళ్ళంతా ఉత్తేజితమయి పోయిందామెకి.

"చూడండి! మనమిలా రోజూ కలుసుకోడానికి మీకేమయినా అభ్యంతరమా?" నెమ్మదిగా అడిగాడతను.

"ఊహు?..." అంది సీత.

"ధన్యుణ్ణి! రోజూ మీకోసం సాయంత్రం టైములో ఇదే హోటలుబయట కారు పార్క్ చేసి ఎదురుచూస్తూంటాను... తప్పకుండా కలుస్తారుకదూ !"

"ఓ !..."

మరి కొద్దిసేపు ఏవేవో మాట్లాడాడతను. అతనితో అదివరకన్నటే ఎంతో చనువు ఏర్పడిపోయింది సీతకి. ఆమెకు నమ్మకం ఏర్పడిపోయింది. తన జీవితం తను కోరుకొన్నమలుపు తిరగబోతోంది. బిల్లు అతనే చెల్లించాడు. ఇద్దరూ బయటికొచ్చి కార్లో కూర్చున్నారు. ఆమెని ఇంటిదగ్గర బస్‌స్టాప్‌లో వదలి వెళ్ళిపోయాడతను.

నెమ్మదిగా ఇంటివేపు నడువసాగింది సీత. ఒక్కసారిగా స్వర్గంలోనుంచి నరకంలో పడినట్లుంది ఆ సందు ! ఎదురుగా చలపతి కనిపించాడామెకి. తెల్లబోయింది, సీత. అతని విషయమే మర్చిపోయింది తను. తనకోసం ఇంటికొచ్చి లేదని తెలుసుకొని తిరిగి వెళ్ళిపోతాడని ఊహించింది. కాని ఇప్పటివరకూ చలపతి తనకోసం ఎదురుచూసినట్లున్నాడు. అతని ముఖం మలినమై ఉంది. మొదటిసారిగా అతని వంటిమీద కొత్తబట్టలు అందంగా కనిపిస్తోన్నాయ్ !

అతన్ని చూసి నుంచుండిపోయింది సీత.

"మరీ ఇంత పనిష్మెంటా ? నీకోసం చూసి చూసి, విసుగుపుట్టి, ఇక ఇప్పట్లో రావని బయల్దేరాను..." నవ్వుతూ అన్నాడతను.

అంతవరకూ అతనిలో కనిపించిన నిరుత్సాహం — అలుపు మాయమయినయ్.

"నేను ప్రొద్దున్నే చెప్పానుకదా—మా ఫ్రెండింటికి వెళ్ళాల్సిన పని ఉందని" అంది సీత.

"నాకోసం—అది కాన్సిల్ చేసుకొంటావనుకొన్నాను..."

"ఊహూ! అనుకొన్నది జరగాల్సిందే..."

"సరే—పోనీ—ఇప్పుడయినా కాసేపలా తిరిగివద్దామా?" ఆశగా ఆమె వంక చూస్తూ అడిగాడతను.

అతనిని నిరుత్సాహపరచడానికి ధైర్యం చేయలేకపోయిందామె.

"ఎక్కడికి?"

"పార్క్ వరకూ వెళ్ళివద్దాం..."

"పద..."

ఇద్దరూ పార్క్‌కు నడచి ఓ మూలగా కూర్చున్నారు. చుట్టూ పిల్లలు కేకలువేస్తూ పరుగెడుతున్నారు.

"రేపే నేను వెళ్ళిపోతున్నాను సీతా! వెళ్ళేముందు నీతో చాలాసేపు మాట్లాడాలని అనుకొన్నాను. కాని...కుదరలేదు! సరే! ఇప్పుడు నేను ముఖ్యంగా మన భవిష్యత్తుగురించి మాట్లాడదలచుకున్నాను. నిన్ను నేనెంతగా ప్రేమిస్తున్నానో నీకు బాగా తెలుసు. నేను ప్రేమిస్తోంది నీ అందాన్నిమాత్రం కాదు! ఇది ముఖ్యంగా నేను నీకు చెప్పదల్చుకొన్న విషయం! నాక్కావలసింది నువ్వు ఎప్పటికీ నువ్వు నాపక్కనే ఉండాలి!ఉద్యోగం లేకపోవడంవల్ల ఇన్నాళ్లూ ఆ కోరికని బలవంతంగా అణచుకొని ఊరుకోవల్సివచ్చింది. నీ అందం చాలా ప్రమాదమైంది సీతా! ఎప్పుడు ఎవరు నిన్ను పెళ్ళిచేసుకొంటారో నని నాకు భయంగానే ఉండేది. ఇప్పుడు నాకు నీ అభిప్రాయం కావాలి! వెంటనే మనం వివాహం చేసుకోవాలనుంది నాకు! ఇందుమూలాన నీకొచ్చే నష్టంకూడా ఏమీ ఉండదు! నీ చదువు మామూలుగానే సాగుతుంది. తరువాత కావాలంటే ఉద్యోగంచేసి, మీ కుటుంబాన్ని పోషించుకోవచ్చు. అందుకు నా అభ్యంతరం ఏమీ ఉండదు..."

సీత కొంతవరకూ అతనినుంచి ఇలాంటి ప్రస్తావన వస్తుందని ముందే ఊహించింది. అంచేత ఆశ్చర్యపోలేదు.

"సారీ చలపతీ! ఇప్పుడప్పుడే పెళ్ళాడటం...నాకిష్టంలేదు..." వినోద్ విషయం చెప్పాలా వద్దా అనితటపటాయించి అందామె.

"ఎందుకని?"

ఏంజవాబు చెప్పాలో తెలీలేదు సీతకి.

"పోనీ ఎప్పుడు చేసుకోవాలనుకుంటున్నావో చెప్పకూడదూ?"

"ఊహు !...నీకు నిజం చెప్పేస్తాను...ఇంకదాచటం అనవసరం ? నేను వినోద్ అనే అతన్ని ప్రేమిస్తున్నాను. ఇద్దరం త్వరలో వివాహం చేసుకోవాలని కూడా నిర్ణయించుకొన్నాము..."

అతను నిరుత్తరుడయ్యాడు. అతనెప్పుడూ ఇలాంటివి ఊహించలేదు. అతని దృష్టిలో సీత ఇంకా తాను ఏడెనిమిదేళ్ళక్రితం చూసిన సీతలాగానే ఉంది. అతనిముఖం పూర్తిగా వాడిపోయింది. కొద్దిసేపటివరకూ వంచిన తల ఎత్తలేకపోయాడు.

"అతనెవరు సీతా ?"

"మెడికో !—మా క్లాస్‌మేట్ అన్నయ్య..."

"ఓ హో !..."

మరి కొద్దిసేపు నిశ్శబ్దం తాండవం చేసింది ఇద్దరిమధ్యా.

"అతనే నిన్నెందుకు ఆకర్షించాడో తెలుసుకోవచ్చా సీతా ?"

"బావుంది ! అందుక్కారణాలుంటాయేమిటి? నువ్వు ఫలానా అతని ఎందుకు ప్రేమిస్తున్నావంటే ఎవరుమాత్రం ఏంచెప్పగలరు ?"

"నీదీ అలాంటి ప్రేమేనా ?"

"లేకపోతే ఎన్నిరకాలుంయేమిటి ప్రేమల్లో ?"

"సరే పోనీ ! ఇప్పుడు మనకిక వాదాలెందుకు! మనసులో మాట దాచకుండా చెప్పినందుకు నీకు థాంక్స్ ! విష్ యూ బెస్టాఫ్ లక్ సీతా ! ఒక్క విషయం మాత్రం నీ మనసులో ఉంచుకో ! ఈ చలపతి ఎప్పటికీ నిన్ను ప్రేమిస్తూనే ఉంటాడు. నువ్వెలా మారినా, నువ్వెక్కడున్నా సరే—ఇంక వెళ్దామా ?"

ఇద్దరూ పార్క్‌లోనుంచి లేచి బయటికొచ్చారు. పూర్తిగా ప్రొద్దుగూకి పోయింది. లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయ్ రోడ్డు కిరువేపులున్న దుకాణాల్లో !

ఇంటికి చేరుకొంది సీత.

ఆమె కెంతో భారం తొలగించినట్లయింది. ఇక చలపతి బాధ తనకు లేదు. శాశ్వతంగా అతనిని తొలగించివేసింది !

మరునాడే చలపతి వెళ్ళిపోయినట్లు తెలిసిందామెకి.

మరికొన్ని రోజులు గడిచినయ్.

ప్రతిరోజూ వినోద్ ఆమెను కలుస్తూనే ఉన్నాడు. ఇద్దరూ రాత్రి ఏడు.

ఎనమిదింటివరకూ ఏహోటల్లోనో సరదాగా గడపడం అలవాటయిపోయింది. ఆదివారంనాడు సినిమాలకుకూడా వెళ్ళసాగారు. అయితే ఈ విషయాలేవీ అఖిలకు తెలీకుండానే జరుగుతున్నాయ్.

కాలేజికి శెలవు లిచ్చారు.

"ఈ శెలవుల్లో మనం కలుసుకోడం ఎలా ?" అడిగాడు వినోద్.

"ఏముందీ ? శెలవులయేవరకూ కలవకపోవడమే !" నవ్వుతూ అంది సీత.

"ఇంకా నయం ! నేను రోజుకొక్కసారయినా నిన్ను చూడకుండా బ్రతికి ఉండగలననే " దీనంగా అన్నాడతను.

"సరే—పోనీ ప్రతి ఆదివారం కలుసుకొందాం..."

"అదికూడా కష్టమే ! కనీసం రెండ్రోజులకోసారయినా కలవాలి..."

ఒప్పుకుంది సీత.

తరువాత కలుసుకొన్నప్పుడు అతను తను ఏర్పాటుచేస్తున్న పిక్నిక్ గురించి ఆమెకు చెప్పాడు.

"నేనూ మా ఫ్రెండూ—అతని స్నేహితురాలూ—నువ్వూ— అంతే ! మనం నలుగురం కలసి సరదాగా పిక్నిక్ వెళ్దాం ! ఉదయం పదింటికి బయల్దే రామంటే సాయంత్రం అయిదింటికల్లా తిరిగి వచ్చెయ్యవచ్చు—''

ఒప్పుకొంది సీత.

అనుకొన్నట్లుగానే ఆరోజు అతనిని కలుసుకొంది. ఫ్రంట్‌సీట్లో అతని పక్కనే కూర్చుంది. బాక్‌సీట్లో అతని ఫ్రెండూ—అతని స్నేహితురాలూ ఉన్నారు. వారిద్దరి పరిచయం చేశాడు వినోద్. వారిద్దరూ మెడికోలే !

కారు సిటీ వదలి ప్రయాణిస్తోంది. ఊహ తెలసింతర్వాత ఎప్పుడూ కార్లో ఇంతదూరం ప్రయాణం చేయలేదు. చాలా సరదాగా ఉంది సీతకి. వినోద్ ఏవేవో తమాషా కబుర్లు చెబుతూ అందరినీ నవ్విస్తున్నాడు, అరగంటతర్వాత కారు ఓ అందమైన ఉద్యానవనంలోకి ప్రవేశించింది. అది వినోద్ ఫ్రెండ్‌దని తెలిసింది సీతకి. లోపల అందమైన బంగళా ! అవుట్‌హౌస్‌లో వాచ్‌మన్ ఉన్నాడు. బంగళాలో ఎవ్వరూ లేకపోయినా ఎంతో శుభ్రంగా ఉంది. అన్ని గదుల్లోనూ తివాచీలూ—సోఫాలూ, ఫాన్‌లూ—కిటికీలకూ తలుపులకూ కర్టెన్లూ కనిపిస్తున్నాయ్.

అందరూ లోపల కూర్చున్నారు.

"ఇంక ప్రారంభిద్దామా ?" అడిగాడు వినోద్ స్నేహితుడు

"ఓ !" అన్నాడు వినోద్ సూట్ కేస్‌లోనుంచి బ్రాందీసీసాలు బయటకు తీస్తూ, సూట్ కేస్‌లోనే చాలారకాలు తినుబండారాలుకూడా ఉన్నాయ్.

నాలుగుగ్లాసుల్లో బ్రాందీ వంచి షోడాలు కలిపాడు వినోద్. సీత కంగారుపడి పోయింది. కొంపదీసి తననికూడా తాగమంటారా, ఏమిటి ఖర్మ!

"కమాన్ శృతీ! తీసుకో..." ఆ అమ్మాయిని అడిగాడు రెడ్డి.

ఆ అమ్మాయి నవ్వుతూ గ్లాస్ అందుకొంది.

తీసుకోసీతా—" అన్నాడు వినోద్.

"ఊహు! నాకొద్దు..." అంది సీత గాభరాడా,

శృతి గలగల నవ్వేసింది.

"ఫరవాలేదు కొంచెం తీసుకో..." బ్రతిమాలే ధోరణిలో గ్లాసుతీసి ఆమె చేతుల్లో ఉంచాడు వినోద్.

అతనివంక అసహనంగా చూసింది సీత.

"వద్దు వినోద్! ప్లీజ్! బలవంతం చేయకు..."

"కంపెనీకోసమయినా కొంచెం తీసుకోండి! అంతా తాగనవసరంలేదు..." అంది శృతి నవ్వుతూ.

ఆ పిల్లముందు తను అనాగరికరాలిలా కనబడుతున్నట్లనిపించింది సీతకి ఇలాంటివన్నీ ఉంటాయని తెలిస్తే అసలు తనిక్కడికి రావడానికి వప్పుకొనేదికాదు.

కళ్ళుమూసుకొని గ్లాసు నోటిదగ్గరుంచుకొని కొంచెం నోట్లో పోసుకొందామె. నోరంతా అదోలా అయిపోయింది.

గొంతులోమంట! వాంతివస్తున్నట్లయింది.

"ఊహూ! ఇంక నేను తాగలేను..." అంది వికారంగా మొహంపెట్టి చటుక్కున ఆమె పెదాలమీద ముద్దుపెట్టుకొన్నాడు వినోద్. సీత తెల్లబోయింది అతనెప్పుడూ అలా ప్రవర్తించలేదు! అదీ తనకు అపరిచితులయిన వ్యక్తుల ముందు అలా చేయడం చాలా సిగ్గనిపించింది. రెడ్డీ, శృతీ గట్టిగా నవ్వేశారు.

"తాగటం సరిగ్గా మొదలవకముందే అంత నిషా వచ్చేసిందా?" అంది శృతి.

సీత చూపులు మరల్చుకొని అక్కడున్న ఓ పుస్తకం తీసి బొమ్మలు చూడసాగింది.

ఏవేవో మాట్లాడుతూనే తాగటం ముగించారందరూ.



సీత ముళ్ళమీద కూర్చునట్లు కూర్చుంది, ఏ క్షణంలో అక్కడినుంచి బయటపడదామా అని ఉందామెకి.

''నేనలా గార్డెన్ చూసివస్తాను...'' అంది నెమ్మదిగా లేచి నుంచుంటూ.

''ఊహు...అప్పుడేనా ? దానికింకా చాలా టైముంది...'' అన్నాడు వినోద్ ఆమెని బలంగా చేయిపట్టుకొని తనవేపు లాగుతూ.

అతని వళ్ళోకి వరిగిపోయింది సీత. అతని కౌగిట్లో గాఢంగా బంధింపబడి పోయింది.

''వినోద్ ! వదులు...'' అంది కోపంగా.

''ఛీ ! మరీ పల్లెటూరి పిల్లలాగా అల్లరిచేస్తావెందుకు ? మనం వచ్చిందెందుకిక్కడికి ?'' నవ్వుతూ అని ఆమె పెదాలమీద చుబించాడు తను.

"ఇలాంటివాడివని తెలిస్తే అసలు నీతో రాకపోయేదాన్ని..." వెనుగులాడుతూనే అంది సీత.

రెడ్డి అమాంతం శృతిని ఎత్తుకొని పక్క గదివేపు నడిచాడు.

న్చూడు! శృతిని చూసయినా నేర్చుకో...ఈ సుఖం అనుభవించాలని అందరికీ ఉంటుంది! నీలాంటివాళ్ళు ధైర్యం చేయలేక ఊరుకుండిపోతారు. శృతిలాంటి అమ్మాయిలు నిర్భయంగా అనుభవిస్తారు..." సీతలో ప్రతిఘటన శక్తి తగ్గిపోతోంది. ప్రక్కగదిలోనుంచి శృతి, రెడ్డిల నవ్వు గట్టిగా ప్రతిధ్వనిస్తోంది.

సాయంత్రంవరకూ అతని కౌగిట్లోనే ఉండిపోయింది సీత. చివరకు చీకటి పడుతోండగా ఇంటిమొహం పట్టారందరూ. సీత ముభావంగా ఊరుకుండిపోయింది. ఆమె మనసంతా చికాకుగా తయారయింది. వెనుక సీట్లో రెడ్డి కౌగిలి వదలకుండానే ఏదేదో మాట్లాడుతోంది శృతి.

వినోద్ ఇంత సాహసిస్తాడని తను కలలోకూడా ఊహించలేదు. తమది ఎంతో పవిత్రమైన ప్రేమ అని విశ్వసిస్తూ వచ్చింది తను. వివాహం కాక మునుపే తనని ఇలా పరాభవిస్తాడని తెలిస్తే—తమ పరిచయం ఇంత వృద్ధయేది కాదు.

ఏదేమయినా జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు ఆ విషయంగురించి బాధపడి ఏమీ ప్రయోజనంలేదు. త్వరగా తమ వివాహం జరిగేట్లు చూడటమే ఇప్పుడు తను చేయాల్సిన పని.

"సీతా!... కోపం వచ్చిందా?" ఆమె భుజంమీద చేయివేసి దగ్గరకు లాక్కుంటూ అడిగాడు వినోద్.

అతనికి చేరువగా జరిగింది సీత. అతని భుజంమీద తల వాల్చేసింది. ఆమెకు కన్నీళ్ళు ఆగడంలేదు.

"వినోద్!... ఒకవేళ... నాకేమయినా అయితే..." నెమ్మదిగా అంది.

"భలేదానివేలే! అదా నీ భయం! నేను మెడికోనన్న సంగతి మర్చిపోయావేమిటి?" నవ్వుతూ అన్నాడతను.

నాలుగురోజుల తర్వాత తిరిగి అతనిని కలుసుకొన్నప్పుడు మరోసారి అతని స్నేహితుని గదిలో అతనికి లొంగిపోక తప్పలేదు సీతకి.

అంతే! అదే ఆఖరుసారి అతను కనబడడం! ఆ తరువాత ఎంత ప్రయత్నించినా అతను కనిపించలేదు. ఒకసారి కనిపించినా చూడనట్లే కాదు

వేగంగా నడుపుకొంటూ వెళ్ళిపోయాడు. మరోసారి మరో పంజాబీడ్రస్ వేసు కొన్న అమ్మాయితో ఓ హోటల్లోంచి బయటకొస్తూ కనిపించాడు.

సీత మనసు పూర్తిగా విరిగిపోయింది. తెలుస్తూనే ఉంది, తను దారుణంగా మోసపోయింది. ఆడదానికి జరిగే అన్యాయంగురించి ఎన్నో సినిమాలు చూస్తున్నా, ఎన్నో నవలలూ కథలూ చదువుతున్నా-ఎన్నో సంఘటనలు కళ్లారా చూసినా—తనూ తిరిగి అదే అన్యాయానికి గురయింది. అసలు లోపం ఎక్కడుంది ? ఆడదాని బలహీనతా ? మగాడికి సంఘం, ప్రకృతి, చట్టం ఇస్తూన్న రక్షణవల్లా ?

ఇంట్లోంచి బయటకు అడుగుపెట్టలేదు సీత. ఎవ్వరికీ తెలీకుండా ఏడుస్తోనే ఉంది, రోజులు గడచిపోతున్నయ్ ! కాలేజి తెరిచారు! అప్పటికి తెలిసింది సీతకి! తను గర్భవతి ! ఎలా ? ఇప్పుడేమిటి చేయడం ? ఈ విషయం తల్లిదండ్రులకు చెప్పాలా ? చెప్పకుండా ఎలా దాచగలదు ! ఈ వార్తవిని వాళ్ళు తట్టుకోగలరా ? ఊహు ; తల్లి స్పృహతప్పుతుంది ! పోనీ ఏమయినా పిల్స్ తీసుకొంటే... ఎలాగోలా ఇది వదిలించుకొంటే ?...ఆ ఆలోచన నచ్చింది సీతకి. మర్నాడుదయమే లేచి మెడికల్‌షాప్‌వేపు బయల్దేరింది.

"ఎప్పుడూ అలో'అర్జంటు'టైమయిపోయింది'అంటూ వెళ్ళిపోతావేమే! కాసేపు కూర్చుని మాట్లాడిపోకూడదూ ?" నిష్ఠూరంగా అంది సక్కుబాయ్.

ఎంచేతో ఆమెతో కొద్దిసేపు గడపాలనిపించింది సీతకి ఆమె గుడిసెలోకి నడిచి నులకమంచంమీద కూర్చుంది.

"లావెక్కుతున్నావేమిటి- అంతా చిక్కటం ఫాషనంటూంటే..." నవ్వుతూ అంది సక్కుబాయి తన పాపకు గౌనువేస్తూ.

ఆ పాప ముద్దుగా ఉంది ! గౌను వేయవద్దని మారాం చేస్తోంది. వాళ్ళిద్దరినీ చూస్తూంటే కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్ సీతకి. అందరిదృష్టిలో సక్కుబాయి పతితురాలు ! ఆమె పాప ఒక అన్ వాంటెడ్ చైల్డ్ !

"సక్కూ ! నిన్నోవిషయం అడుగుతాను చెప్తావుటే ?" అడిగింది సీత.

"ఏమిటే అది ?"

"నీకు నెల తప్పిన తరువాత, వాడు పరారయిపోయాడు కదా— అప్పుడెందుకని గర్భం పోగొట్టుకోలేదు ?"

నవ్వింది సక్కుబాయి. "భలేదానివేలే ! ఎందుకు పోగొట్టుకోవడం ? మనకు

నచ్చినపని చేసిన తరువాత- అది తప్పో వప్పో ఏదయినా బాధ్యత వహిం చాలి ? భయపడటం ఎందుకు ?"

"మరిప్పుడు నీకిలా కష్టంగా లేదూ ? పెళ్ళికాకుండా- ఒకరనేమాటలు పడుతూ-"

"పెళ్ళిచేసుకోవడం నాకిష్టంలేదు! ఈ మగాళ్ళందరూ రాక్షసులు! ఆడదాన్ని హింసించడానికే వీళ్ళు అవతరించారు. ఇక నన్నునే మాటలంటాచా- ఎంత కాలమంటారో అననీ- చివరకు విసుగొచ్చి వాళ్ళే ఊరుకొంటారు ! నీ క్కావల సింది నేనూ, నా పాప సుఖంగా ఉండటం ! నేను బ్రతికినంతకాలం కాయకష్టం చేసి నా పాపని పోషించుకొంటాను..." పాపని గట్టిగా ముద్దుపెట్టుకొంటూ అందామె.

సీత మనసంతా ఆలోచనల్తో నిండిపోయింది. సక్కుబాయి మాటల్లో నిజం కనిపించిందామెకి ! అవును ! తను మాత్రం ఎందు భయపడాలి ? తప్పు చేసిన మాట నిజమే ? అంత మాత్రాన తనకొచ్చిన నష్టమేముంది ? తనూ సక్కు- బాయిలా ఎందుకుండలేదు ? మరీ తప్పులో మగాడికీ భాగముందిగా- లతని గురించి ఎవ్వరూ మాట్లాడరేం ? వేలెత్తి చూపలేరా ? ఆడదానికో రూలూ, మగాడికోరూలూనా ? కనీసం తనలాంటి చదువుకొన్న వాళ్ళయినా ఈ పక్ష పాతవైఖరిని ఎదుర్కోలేరూ ?

మెడికల్‌షాపుకి వెళ్ళకుండానే ఇంటికి చేరుకొంది సీత.

మర్నాడు తల్లితో జరిగినదంతా చెప్పివేసింది. వింటూనే ఆమె ఏడుపుకి సిద్ధమయింది.

సీతని నిందించింది. తనని తనే నిందించుకొంది, సీత ఆ మాటలేమీ పట్టిం చుకోలేదు.

"ఇందులో కొంపమునిగిందేముందీ ? వివాహం కాకుండా గర్భంవచ్చినంత మాత్రాన ఆడది అధోగతిపాలు కావల్సిందేనా ? ఎందుకని ? మగాడు పెళ్ళి కాకుండా ఎంతమంది ఆడాళ్ళతో తిరగడం లేదు ? మరి అతగాడి నెవ్వరూ నిరసించరేం ?" అంది తల్లితో.

ఆమె తెల్లబోయింది. కొద్దిసేపటివరకూ అసలేమీ అర్థంకాలేదు. కూతురికి ఈ గొడవతో మతిభ్రమించిందేమో అన్న అనుమానం వచ్చింది. ఈ విషయం వెంటనే భర్తచెవినేయకపోతే మొదటికేమోసం వచ్చేట్లుందని భయపడిపోయింది. ఆరాత్రే భర్తచెవినేసిందావిషయం. అతను చాలా ఆశ్చర్యపోయాడు. తన




కూతురు అంత ఎదిగిందని ఎప్పుడూ అనుకోలేదు. అతని దృష్టిలో ఆమె ఇంకా లంగావోణీలేసుకొనే పిల్లలాగానే కనబడుతోంది

"ఇంతకూ ఎవరతను?" అడిగాడు భార్యను.

"చెప్పటంలేదు! వాడు మోసంచేశాడుట! అందుకని వాడి పేరు కూడా తలచుకోదట!"

"మరిప్పుడేమిటి చేయటం?"

"ఎలాగోలా రహస్యంగా ఈ గర్భం తీయించాలి! లేకపోతే ఇంకేమయినా ఉందా? నలుగురిలో తలెత్తుకు తిరగ్గలమా?"

"సరే- సరే- రేపే డాక్టరుతో మాట్లాడతాను..." అన్నాడతను. మర్నాడుదయమే వెళ్ళి డాక్టరుతో అన్ని విషయాలూ మాట్లాడేడు. ఆ సాయంత్రమే సీతను తీసుకురమ్మని చెప్పింది డాక్టరు ఈ విషయం విన్న సీత మండి పడింది.

"ఏమిటీ? గర్భం తీస్తారా? ఛస్తే ఊరుకోను! మీమీద పోలీస్‌రిపోర్టిస్తాను. నాకు పాపాయిని కనడమే ఇష్టం! అందులో తప్పేముంది? పెళ్ళికానంత మాత్రాన వాళ్ళు పిల్లలు కారా- నేను తల్లిని కాకపోతానా?"

ఏమీ చేయలేని ఇరకాటంలో పడిపోయారామె తల్లిదండ్రులు. తల్లి ఎంత నచ్చ చెప్పినా ససేమిరా వినిపించుకోలేదు సీత. కుమిలిపోసాగిందామె. శెలవుల తర్వాత

కాలేజికి వెళ్ళడం మాత్రం మానలేదు సీత. ఆమెను చూస్తూనే ప్రతివారూ హేళనచేయడం మొదలుపెట్టారు. ఆమెకు 'కుంతీదేవి' అని పేరు పెట్టారెవరో. అఖిల, మరికొంతమంది ఆడపిల్లలు ఆమెతో మాట్లాడడం మానివేసి సూటి పోటీ మాటలనసాగారు. కొద్దిరోజులు ఓపికపట్టి విరుచుకుపడిందామె.

"మీ అందరి సంగతీ నాకు తెలుసు! ఎంతమంది గర్భాలు పోగొట్టుకొని కన్యలుగా చెలామణీ అవుతున్నారో కావాలంటే పేరుపేరునా చెప్తాను..." అంటూ డబాయించేసరికి చాలామంది ఆమె జోలికి రావడం మానేశారు. ఓ రోజు ప్రిన్సిపాల్ సీతని తన గదిలోకి పిలిపించి అడిగింది.

"నీకింకా వివాహం కాలేదట నిజమేనా?"

"అవును!"

"ఎప్పుడు చేసుకొంటున్నావ్ మరి?"

"చేసుకోవాలన్న నిబంధనేమయినా ఉందా?

"నీకు పాపాయి పుట్టేలోగానే- అందుక్కారణమయిన వాడిని- మెడలు విరి చయినా పెళ్ళాడితే– నీకూ– మీవాళ్ళకూ కూడా గౌరవంగా ఉంటుంది."

"క్షమించండి! ఇది నా స్వవిషయం! నేను పెళ్ళిచేసుకోదలచుకోలేదు."

"చేసుకోకుండా పిల్లల్ని కంటూంటావా?" కోపంగా అడింగింది ప్రిన్సిపాల్.

"అదీ నా స్వవిషయమే! ఇతరుల వ్యక్తిగత విషయంలో జోక్యం చేసుకో కూడదన్న నిబంధన కూడా ఒకటి ఉంది! అది మీకు తెలీదా?"

"సీతా! నీమీద జాలికొద్దీ- మంచిగా మాట్లాడుతోంటే నువ్వు హద్దులు మీరు తున్నావ్! తలచుకుంటే నేను నిన్ను ఏనాడో కాలేజినుంచి డిబార్‌చేసి ఉండే దాన్ని."

"చెయ్యండి! ఎట్లా చేస్తారో నేనూ చూస్తాను! మిమ్మల్ని కోర్టుకీడ్చి మళ్ళీ చేర్తాను"

"సరే! అంత ధైర్యం ఉంటే అలాగే కానీ!..." అందామె. మర్నాడే సీత కాలేజ్‌నుంచి డిబార్ చేయబడింది ఆ రోజు అందరినీ కసితీరా తిట్టి ఇల్లు చేరు కొంది సీత.

ఇంటి చుట్టుపక్కలవారుకూడా తనని చూసి గుసగుసలాడుకోవడం కని పెట్టిందామె

ఓ రోజు హఠాత్తుగా చలపతి వచ్చాడింటికి.

"జరిగిందంతా విన్నాను..." అన్నాడు ఆమెతో.

"సానుభూతి ఒలకబోయడానికొచ్చావా ?" అందామె తీవ్రంగా.

"కాదు ! నీ ధైర్యానికి అభినందనలు తెలుపడానికొచ్చాను! ఆడాళ్ళందరకూ నీకున్న ధైర్యంలో సగముంటే ఈనాడు మన దేశంలో స్త్రీ గతి ఇట్లా ఉండేది కాదు..." అన్నాడతను.

సీత అతనివంకే చూసింది పరీక్షగా ! అతని మాటల్లో నిజాయితీ ఉంది. తనని హేళన చేయడానికి అన్నమాటలు కావవి ! ఆ క్షణంలో అతను ఎంతో మహోన్నత భావాలుగల వ్యక్తిగా కనిపించాడామెకి.

"డెలివరీ ఎక్కడ ?" అడిగాడతను.

"ఇక్కడే, గవర్నమెంట్ హాస్పిటల్లో చేరదల్చుకొన్నాను. నాలాంటివారికి కొద్దో, గొప్పో ఆదరణ లభించేది అక్కడేగా."

"అవునవును."

మరికొద్దిసేపు ఏవేవో మాట్లాడాడతను.

"ఇంక నేను వెళ్తాను... నీకెప్పుడు ఏ సహాయం కావాలన్నా... నన్ను గుర్తుంచుకో..." అంటూ వెళ్ళిపోయాడు.

అతని మాటలు సీతకి మరింత ధైర్యాన్నిచ్చినయ్ ! నెలలు నిండగానే హాస్పిటల్‌లో చేరడానికి వెళ్ళిందామె. ఎడ్మిషన్ రూమ్‌దగ్గర అతను భర్త పేరడిగాడు.

"నాకు పెళ్ళికాలేదు" అంది సీత.

అతను ఆశ్చర్యపోయాడు "పెళ్ళికాలేదా ?" అనడిగాడు, ఆమెవంక వింతగా చూస్తూ.

"కాలేదని ఒకసారి చెప్పానుకదా... వినబడటంలేదా ?" కోపంగా అందామె

ఆమె కోపానికి భయపడ్డాడతను.

హాస్పిటల్లో ఎడ్మిటయిందామె.

అప్పటికప్పుడే ఆమెగురించి వింతగా చెప్పుకోవడం మొదలుపెట్టారు వార్డంతా !

వారంరోజుల్లోగానే మగపిల్లాడిని కన్నది సీత.

ఆ వారంరోజులూ ఆమె తల్లి సీతని కనిపెట్టుకొనే ఉంది. హాస్పిటల్‌నుంచి డిశ్చార్జి తీసుకొని ఇల్లు చేరుకుందామె. పిల్లాడు అచ్చం తన పోలికే ! అందుకు చాలా సంతృప్తికలిగిందామెకి. ఆ తరువాత ఎంతో ప్రయత్నంమీద చార్‌మినార్

దగ్గరున్న ఓ చిన్నపిల్లలస్కూల్లో టీచర్ ఉద్యోగం సంపాదించిందామె. కొద్ది రోజుల్లోనే తోటి 'టీచర్' శ్రీధర్‌తో పరిచయం ఏర్పడింది. ఆమె అందం అతన్ని విపరీతంగా ఆకర్షించింది. అతని ప్రవర్తన, మాటలు పెంచు కొంటోన్న చనువు ఇవన్నీ సీత గ్రహిస్తూనేఉంది. స్కూలుకి వేసవి ఆఖరి రోజు శెలవులిచ్చారు. స్కూలు వదిలాక ఆమెతోపాటు నడువసాగాడతను బస్ కోసం ఆగింది సీత.

"మీరిటు- ఎంతవరకూ వస్తున్నారు ?" అనడిగింది నవ్వుతూ.

"మీ ఇంటివరకూ..." నవ్వుతూనే జవాబిచ్చాడతను.

"ఎందుకు ?"

"ఊరికే- రావద్దంటారా ?" కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

నవ్వి చూపులు మరల్చుకొంది సీత. బహుశా అతనికీ తనవయసేఉంటుంది. లేదా కొద్దినెలలు చిన్నవాడేమో కూడా ! ఇంటి బాధ్యతలు మోయడానికి మెట్రిక్‌తో చదువాపి ఈ ఉద్యోగంలో చేరాడు. అందగాడు కాకపోయినా ఆకర్ష ణీయమైన మనిషి ! ఇంకా కుర్రతనం పూర్తిగా పోనట్లే ఉంటుందతని ముఖం! ఇంట్లో పరిస్థితులు, బాధ్యతలు అతనిని వయసుకి మించినవాడిని చేస్తున్నాయి.

"మీతో- ఇవాళ కాసేపు సరదాగా మాట్లాడాలనిపించింది..." చేతివేళ్ళ వంక చూసుకొంటూ అన్నాడతను. అలా అంటూన్నప్పుడు అతని గొంతు కొద్దిగా వణికింది.

సీతకు అర్థమయిపోయింది. తనను ప్రేమిస్తున్నానంటాడు. పెళ్ళిచేసుకొందా మంటాడు. "మాట్లాడండి మరి..." అతనివంక చూడకుండానే అంది సీత. రెండుబస్‌లు వచ్చి స్టాప్‌లో నుంచున్నవాళ్ళందరినీ ఎక్కించుకు వెళ్ళిపోయి నయ్! ఇద్దరే మిగిలిపోయారు.

"అలా... కాసేపు ఏ హోటల్లో నయినా కూర్చుందామా? భయంగానే అడిగా డతను.

సీతకు నవ్వొచ్చిందిగాని ఆపేసుకొంది.

"సరే... పదండి !" అంది.

ఇద్దరూ దగ్గర్లోఉన్న ఓ హోటల్‌కి వెళ్ళి ఫామిలీరూమ్‌లో కూర్చున్నారు

"మీరేమీ అనుకోనంటే ఒకవిషయం చెప్పాలనుకొంటున్నాను..." టేబుల్ మీద చేత్తో గీతలుగీస్తూ అన్నాడు.

"చెప్పండి ! నేనేమీ అనుకోను."

కొద్దిక్షణాలు ఏమీ మాట్లాడలేదతను. తరువాత ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఏదో ఉత్సాహం పొడుచుకొచ్చినట్లుగా మాట్లాడాడు.

"మీరు...నేను... మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీరు వప్పుకొంటే...మనం పెళ్ళిచేసుకొందాం !"

అతని కళ్లల్లోని ఆత్రత—భయం కనిపెడుతూనే ఉంది సీత.

"మీకు నాగురించి ఏమయినా తెలుసా ?" అడిగింది సీత.

"నాకేమీ తెలీదు. తెలుసుకోవాల్సిన అవసరంకూడా లేదు.చాలా రోజుల్నుంచీ మనం కలసి పనిచేస్తున్నాం! ఒకరినొకరు చూస్తూనే ఉన్నాం! ఈమాత్రం తెలుసుకొంటే చాలదూ ?"

"చాలదనుకొంటాను శ్రీధర్‌గారూ ! ఇదివరకు నా చరిత్ర ఏమిటి ? మీ చరిత్ర ఏమిటి ? ఇదంతా ఇద్దరం తెలుసుకొని— అయినా ఇష్టపడితే అప్పుడు వివాహం గురించి మాట్లాడుకోవచ్చు..." అతనివంక చూడకుండానే అంది సీత.

"మీరు తమాషాగా మాట్లాడుతున్నారు..." ఆమె పరిహాసమాడుతోందేమో అని అనుమానపడ్డాడతను.

"ఉహు ! అలా మాట్లాడ్డం ఎప్పుడో మర్చిపోయాను ! అలా మాట్లాడడం కూడా నాకిప్పుడు చేతకాదు!"

"సరే, మీరు నా చరిత్ర తెలుసుకోవాలని ఇలా మాట్లాడుతున్నా రనుకొంటాను ! నాకు తల్లీ తండ్రీ ఇద్దరు చెల్లాయిలూ ఇద్దరు తమ్ముళ్ళూ ఉన్నారు. మా ఇంట్లో తిండికికూడా సరిగ్గా గడవని పరిస్థితుల్లో నేను చదువు మాని ఈ ఉద్యోగంలో చేరాను. ఇంతకంటె 'చరిత్ర' నాకేమీలేదు సీతగారూ !"

సీత నవ్వింది.

"మీ 'చరిత్ర' నా కిదివరకే తెలుసు శ్రీధర్‌గారూ ! అయినా అదేమంత ముఖ్యంకాదనుకొంటాను ! మీరు నా చరిత్రకూడా తెలుసుకొంటే బావుంటుంది!"

"సరే- మీకంతగా చెప్పాలనుంటే చెప్పండి !"

"నేను కాలేజీలో చదివే రోజుల్లో— ఒకతన్ని ప్రేమించి మోసపోయాను ! ఫలితంగా తల్లినయాను! అంచేత మీరిప్పుడు నన్ను పెళ్ళాడటం అంటే— ఓ బిడ్డ తల్లిని పెళ్ళాడటం అన్నమాట ! మీతోపాటు కాపరానికి నా బాబునెత్తుకొనే వస్తాను ! ఇప్పుడు చెప్పండి ! ఇంకా నన్ను పెళ్ళిచేసుకోవాలన్న అభిప్రాయం మీకుందా ?"

అతను నిర్ఘాంతపోయాడు. చాలా సేపటివరకూ ఆ షాక్‌నుంచి కోలుకోలేక పోయాడు.

''మీరు మాట్లాడుతోందంతా నిజమేనా ?'' అన్నాడు ముఖానికిపట్టిన చెమటలు తుడుచుకొంటూ.

"అవును !- పదండి ! వెళ్దాం ! మీరు ఆలోచించుకోండి ! 'టీ'కప్పు ముందు పెట్టుకొని తాగేలోపల నిర్ణయం తీసుకొనే విషయం కాదిది !"

"అవసరంలేదు సీతగారూ ! నాకు మీరు కావాలి ! అంతే ! మీ చరిత్రతో నాకు పనిలేదు ! మీరేం చేయమన్నా చేస్తాను ! నా క్కావలసింది మనం ఒకటవటం—" ఉద్రేకంగా అన్నాడతను.

సీత ఆశ్చర్యపోయింది. అతనలా మాట్లాడతాడని బొత్తిగా ఊహించలేదామె. అంచేత ఆ పరిణామానికి తట్టుకోలేకపోతోంది. కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్.

"సీతగారూ ! మీరు చేయని తప్పుకు బాధ్యత మీదెలా అవుతుంది ? న్యాయంగా ఆలోచిస్తే మిమ్మల్ని మోసంచేసినవాడిని 'షూట్' చేయాలి ! ఎక్కడయినా చూడండి ! ఆడదానికే అన్యాయం జరుగుతుంది !- ఇదంతా ఇప్పుడెందుగ్గానీ- నేను మనస్ఫూర్తిగా మాట్లాడుతున్నా నిప్పుడు! మిమ్మల్ని ఉద్ధరించాలని గానీ-ఆడదాని పరిస్థితి మార్గాలనిగానీ నేను సంఘసంస్కర్తలాగా ఫోజుకొట్టటంలేదు. నాకు మీ అందం నచ్చింది, మీరు మనసుకి దగ్గరయారు. మిగతావన్నీ నాకనవసరం !..." ఆవేశం తగ్గలేదతన్లో !

సీత ఉక్కిరి బిక్కిరవుతోంది. ఇదేమిటి ఇంత విశాలమైన గుండెకలవారు కూడా ఉంటారా? ఏమో! విషం ఉన్నచోటే అమృతంకూడా ఉంటుంది. కిరాతకత్వం నిండిపోయింది ఈ మగజాతిలో. అక్కడక్కడ మానవత్వం ఉన్నవాళ్ళుకూడా ఉంటారు.

"మీరు ఆవేశంలో ఏం మాట్లాడుతున్నారో మీకు తెలీటం లేదనుకొంటాను! ఇది ఇలా నిమిషాలమీద నిర్ణయం తీసుకోవాల్సిన విషయం కాదు. దయచేసి తీరిగ్గా ఆలోచించి నిర్ణయం తీసుకోండి ! అప్పుడు మాట్లాడుకొందాం మిగతా విషయాలు..." అనేసి లేచి బయటికి నడిచిందామె. బిల్లు చెల్లించి అతనూ ఆమె వెంబడే నడిచాడు.

బస్ స్టాప్‌దగ్గర సిద్ధంగా ఉన్న బస్ ఎక్కేసింది సీత.

"ఓకే—వెళ్తాను..." అంది నెమ్మదిగా.

అతను చేయి ఊపాడు.

బస్ కదిలింది.

కిటికీలోనుంచి బయటకు చూడ సాగింది సీత. రోడ్డు కిరువేపులా ఉన్న రంగురంగుల లైట్ల మధ్యనుంచి వేగంగా పోతోంది బస్. ఎక్కడ చూసినా జంటలు జంటలుగా తిరుగుతున్న జనం- పిల్లల్ని ఎత్తుకొని నడుస్తోన్న తల్లులూ—

సీత గుండెల్లో బాధ నిండిపోయింది, తనూ...ఎప్పటికయినా అలా ఓ మగాడి నీడన నడవగలుగుతుందా ? కలలు మళ్ళీ ఆమెను వశంచేసుకొన సాగినయ్!



శ్రీధర్ నిజంగా తనని వివాహం చేసుకొంటాడా? చేసుకొంటే తన జీవితం ఎంత ఆనందదాయక మవుతుంది ? అతని సాన్నిధ్యంలో సర్వస్వం మర్చి పోగలదు తను. తన కిప్పుడు కావల సింది కేవలం అతని ప్రేమ, అతని సాన్నిధ్యం! అంతే! ఐశ్వర్యం—తన కవసరం లేదు. నిజానికి తనిప్పుడు ఐశ్వర్యాన్ని ద్వేషిస్తోంది. ఐశ్వర్యంమీద ఆశే తనకీ దుస్థితి తెచ్చిందీ రోజు. ఉత్సాహం— కొత్త ఆశలు ఆమెని ఊగించివేసినయ్. బస్ దిగి కూనిరాగం తీస్తూ ఇంటివేపు నడిచింది. అంత దూరాన్నుండగానే పాపాయి ఏడుపు విని పించిందామెకి ఇంచుమించుగా పరుగుతో ఇల్లు చేరుకొని తల్లి వళ్ళోనుంచి పాపాయిని అందుకొని ఆనందంగా గుండెలకు హత్తుకొంది.

* * *

స్కూలు సెలవులు అయిపోయినయ్, తిరిగి స్కూళ్ళు తెరిచారు. ఆ రోజు త్వరగా స్కూలుకి బయల్దేరింది సీత. శ్రీధర్‌ని కలుసుకోవాలి! అతనేం నిర్ణ యించుకొన్నాడో తెలుసుకోవాలి! అయినా ఇదంతా తన ఆత్రుతేగాని ఆ రోజే

అతను చెప్పాడతని నిర్ణయం కనుక తనక్కావలసింది నిజానికి వివాహం గురించి విషయాలు మాత్రమే! అతని తల్లి దండ్రులు ఈ విషయం విని ఏమన్నారు! వారు సుముఖంగా ఉన్నా లేకపోయినా అతనా నిర్ణయంమీదే నిల బడగలడా? ప్రేయర్ అయిపోయింది. క్లాస్‌లోకి నడిచింది సీత. శ్రీధర్ జాడ కనిపించలేదామెకి. శ్రీధరేమయ్యాడు ? ఎందుకని రాలేదు ? ఒకవేళ వంట్లో బావుండలేదేమో! లేక ఏదయినా ఊరు వెళ్ళాడా? సాయంత్రంవరకూ అన్య మనస్కంగానే గడిపింది సీత! స్కూల్ వదిలాక సరాసరి హెడ్‌మాస్టర్ గది లోకి నడిచింది.

"ఏంసీతా !" అడిగాడాయన ఆమెను చూడగానే.

"శ్రీధర్‌గారు రాలేదెందుకనా అని తెలుసుకొందామని..."

"అతను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు..."

"రాజీనామా ఇచ్చాడా ?" తెల్లబోతూ అంది సీత.

"అవును ! మరెక్కడో ఇంకా ఎక్కువజీతం ఇస్తామనుంటారు-నవ్వుతూ అన్నాడాయన. సీత వెనక్కుతిరిగి బస్‌స్టాప్‌కి నడిచింది. ఆమె మనసంతా గందరగోళంగా తయారయింది. కలలన్నీ చెదిరిపోయినయ్ ! ఆశలన్నీ నిరాశ లయిపోయినయ్ !

అయినా తను పిచ్చిదికాకపోతే తననెవరు పెళ్ళాడతారు ? అసలు ఎలా ఆశపడింది తను ? ఎంత తెలితక్కువగా ఆలోచించింది ? ఎలా సాధ్యమవు తుంది ! శ్రీధర్‌గానీ-మరెవరయినాగానీ-ఎవరూ చేయలేని పని అది ! అతనేదో ఉద్రేకంలో అలా అన్నాడు. తీరా ఇంటిదగ్గర తల్లిదండ్రులు చివాట్లేసేసరికి భయపడి ఊరకుండిపోయుంటాడు.

అతని మాటలు విని నవ్వి ఊరుకోక-వాటిని నిజాలని నమ్మి,కలలు కంటూ కూర్చుంది తను !

మరికొద్దిరోజుల్లో రిట్రించ్‌మెంట్ వచ్చింది స్కూల్లో, సీత ఉద్యోగం పోయింది.

మళ్ళీ మరోఉద్యోగంకోసం ప్రయత్నించసాగిందామె.తన బాబుకోసమయినా ఏదోఒక ఉద్యోగం చేయక తప్పదు. కొద్దిరోజులకి విసిగిపోయి చలపతికి ఉత్తరం రాసిందామె.

"త్వరగా ఏదోఒక ఉద్యోగంచూసి, వెంటనే ఉత్తరంరాయి ! ఇక్కడ ఏ వ్యాపకమూ లేకుండా గడపటం చాలా కష్టంగాఉంది..." అని.

ఆ సాయంత్రమే మార్కెట్‌లో సునీత వాళ్ళ అమ్మకనిపించింది సీతకి. సీత ఎత్తుకొన్న పాపాయినిచూసి "నీ పెళ్ళికి పిలువలేదేం ?" అంది నిష్ఠూరంగా !

"పెళ్ళి కాలేదు..." అంది సీత చిరునవ్వుతో.

"మరి బాబెవరు ?"

"నా బాబే..."

వింతగా చూసిందామె. "నాకేమీ అర్థంకావటంలేదు..." అంది ఆశ్చర్యంగా

''ఏముందీ ? నాకు పెళ్ళికాలేదు. కాని బిడ్డఉన్నాడు–అంతే !'' తేలిగ్గా నవ్వేస్తూ అంది సీత.

"ఓహో అలాగా! నువ్ చాలా ధైర్యవంతురాలివే...మా ఇంటికోసారి వెళ్ళివద్దాం, రాకూడదూ ?" అడిగిందామె.

సునీతను చూడాలన్న కోరిక ఎలాగూ ఉంది.

"పదండి ! సునీతతో గడిపి చాలారోజులయిపోయింది..." అంది ఆమెతో పాటు నడుస్తూ.

సీతను చూస్తూనే ఆనందపడిపోయింది సునీత.

సునీత చుట్టూ మూగిన ముగ్గురుపిల్లల్నిచూసి "నీ పిల్లలేనా ?" అనడిగింది సీత.

"అవును..." అంది సునీత నవ్వుతూ.

తర్వాత మాటల్లో చెప్పిందామె. రెండేళ్ళపాటు ఓ సినిమాహాల్ ప్రొప్రయిటర్‌తో ఉందిట. అతనివల్లే మొదటి ఇద్దరుపిల్లలు కలిగారట ! తరువాత అతను వదిలేయడం మూలాన మరొకరిని ఆశ్రయించాల్సివచ్చిందట. ఇప్పుడు ఇతనిద్వారా ఆఖరిపిల్ల.

"ఇంక ఇప్పుడు నాకేమీ ఫరవాలేదులే ! నా జీవితం సుఖంగా గడిచిపోడానికి ఏర్పాట్లుచేశారు వీళ్ళ నాన్నగారు..." అంది సంతోషం నిండిన కళ్ళతో.

సీత నమ్మలేకపోతోందామె మాటల్ని. క్లాసులో ఎప్పుడూ ఫస్ట్‌రాంక్ వచ్చే సునీత చివరకు ఈవిధంగా జీవిస్తోందన్నమాట !

''నీకూ్కడా జీవితం సుఖంగా గడచిపోవాలనుంటే నాతో చెప్పు ! కావలసిన ఏర్పాటు చేస్తాను! ఏ బాద రందీ ఉండదు. చేతినిండా డబ్బు ! ఇప్పుడు మనని వెలివేసినవాళ్ళే అప్పుడు మనని గౌరవంగా చూస్తారు..."

నవ్వింది సీత "ఐశ్వర్యంమీద ఆశే నన్ను పాడుచేసిందే! అంచేత ఆ కోరిక ఏనాడో చచ్చిపోయింది నాలో..."

మరి కాసేపు మాట్లాడాక ఇంటికి తిరిగి వచ్చేసిందామె.

చాలా రోజులతరువాత చలపతి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

"ఈ ఊళ్ళో చాలా ఆఫీసులున్నాయ్! కనుక వెంటనే బయల్దేరి వచ్చేయ్! ఇక్కడే ఉండి ప్రయత్నిస్తే ఏదోఒక ఉద్యోగం దొరక్కపోదు... ఎప్పుడు వస్తోందీ టెలిగ్రామిస్తే స్టేషన్ దగ్గరకొస్తాను..."

ఆ ఉత్తరం తిరిగి ఆలోచనలు రేకెత్తించింది. వెళ్ళడమా, మానడమా అనేది నిర్ణయించుకోలేకపోయింది. పోనీ కొద్దిరోజులు చలపతిదగ్గరే ఉండి ప్రయత్నిస్తే ఏమయినా దొరుకుతుందేమో. అంతకంటె తను చేయగలిగింది మాత్రం ఏముందీ? ఇంట్లో తనే భారమయిందనుకొంటూంటే-తనకోపాపాయి!

వారంరోజుల తరువాత చలపతికి తను బయల్దేరి వస్తున్నట్లు టెలిగ్రామిచ్చి రైలెక్కింది సీత. సాయంత్రం ఆరుగంటలకు చలపతి ఊరుచేరుకొంది రైలు ప్లాట్‌ఫారంమీద చలపతి కనిపించాడు.

పెద్ద ఇల్లది! అద్దె చాలా తక్కువట. చలపతికి చాలా సంతోషంగాఉంది, సీత తనింటికి రావడం! ఆమె కొడుకు ఇల్లంతా పాకుతుంటే ఎంతో ముద్దుగా ఉందతనికి. వదలాలనిపించటంలేదు. ముమ్మూర్తులా సీతపోలికే! ఆఫీస్ కెళ్ళేంతవరకూ, సాయంత్రం ఆఫీస్‌నుంచి వచ్చింతరువాతా వాడినే ముద్దు లాడుతూ కూర్చుంటాడు.

వంటపనంతా సీతే చూసుకోసాగింది.

రానురాను ఆమెకు అశాంతి పెరిగిపోతోంది.

"ఇంకెన్నాళ్ళు చలపతీ! ఉద్యోగం ఎప్పుడొస్తుంది?" అని అడగడం మొదలుపెట్టింది, అసహనంగా!

''తొందరపడితే ఎలా! ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాగా," అన్నాడతను. చివరకు ఓ చిన్న ప్రైవేట్ ఫరమ్‌లో ఉద్యోగం దొరికింది. కాని అదెంతో కాలం నిలవలేదు. ఓ రోజు ఆఫీస్ మేనేజరు ఆమెను తనగదిలోకి పిలిచి బలవంతం చేయబోయాడు. అతని చెంప పగలగొట్టి కేకలువేసింది.

"పెళ్ళికాకుండా పిల్లలుకన్నదానివి-నేనంటే అభ్యంతరం ఎందుకు?" అన్నాడతను కోపంగా. రోడ్డుమీద వెళ్తోన్న నలుగురయిదుగురు ఆమె కేకలు విని అక్కడ మూగిపోయారు.




"ఇది పెద్ద పతివ్రతేం కాదులే! ఎవడిద్వారానో పిల్లాడినికని ఇప్పుడు ఆ చలపతిగాడితో సంసారం చేస్తోంది..." అన్నారెవరో, అంతే! ఆ తరువాత మళ్ళీ ఆ ఉద్యోగానికి వెళ్ళలేదామె.

"ఈ మగవెధవలందరినీ హత్యచేయాలనుంది..." అంది చలపతితో.

"బావుంది! మగవాళ్ళందరినీ చంపి – మరి అప్పుడు ఆడాళ్ళేం చేస్తారుట?" నవ్వుతూ అడిగాడు చలపతి.

"హాయిగా ఉంటారు, ఏకష్టాలూ లేకుండా!" అందామె.

మరికొద్దిరోజులు గడిచిపోయినయ్. చలపతి ఎంత ప్రయత్నించినా ఆమెకు ఉద్యోగం ఇవ్వడానికి సుముఖత చూపడంలేదు.

ఓ రోజు ఉదయమే హఠాత్తుగా తిరిగి తన ఇంటికి బయల్దేరింది.

"ఎక్కడికి?" అడిగాడు చలపతి ఆశ్చర్యంగా.

"మా ఇంటికే."

"ఎందుకు?"

"ఇక్కడమాత్రం ఎందుకూ? ఈ ఉండడం మా ఇంటిదగ్గరే ఉంటాను.." అందామె దృఢంగా! ఆ సాయంత్రమే బయల్దేరింది సీత.

ఇంటిదగ్గర తనని పలుకరించేవారెవ్వరూలేరు. అంతా తననో దోషిగా పరిగణిస్తున్నారు.

అయినా అలాంటి వాతావరణానికి అలవాటుపడిపోయింది తను.

ఓరోజు మెయిన్‌రోడ్ మీదనుంచి పార్క్‌వేపు వెళ్తోంటే హైస్కూల్లో తనతో పాటు చదువుకొన్న అరుణ ఎదురయింది! ఆప్యాయంగా పలుకరించిందామె. తన భర్తనుకూడా సీతకు పరిచయం చేసింది. అతను బెంగుళూరులో ఏదో ఫ్యాక్టరీలో ఇంజనీరట!

"అక్కడ నాకేదయినా ఉద్యోగం ప్రయత్నించగలవా?" అడిగింది సీత.

"నీకా?" ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"అవును! చాలా అవసరం!" అంది సీత.

"కాని...అంతదూరంలోనా?"

"నాకు ఉద్యోగం అవసరం అరుణా! ఒకరిమీద ఆధారపడకుండా నా జీవితం నేను గడపాలి! అంతే నాక్కావలసింది..."

"అలాగే! తప్పక ప్రయత్నిస్తాను..." అంది అరుణ.

వాళ్ళు వెళ్ళిన నెలరోజుల్లోనే అరుణదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. అరుణ భర్త తనకోసం ఏదో ఉద్యోగం చూశాడట! అంచేత వెంటనే బయల్దేరి రమ్మని రాసింది.

తక్షణమే బయల్దేరింది సీత. స్టేషన్‌దగ్గర అరుణా, ఆమె భర్తా ఇద్దరూ రిసీవ్ చేసుకొన్నారు. కార్లో ఇల్లు చేరుకొన్నారందరూ!

"రేపే మీరు మా ఫాక్టరీలో జాయినవ్వాలి! నిజానికి మీదంత మంచి ఉద్యోగమేం కాదనుకోండి! కాని నేను ఆఫీసర్‌నడిగి నాదగ్గరే నియోగించుకోడానికి అనుమతి తీసుకొన్నాను. తరువాత అవకాశాన్ని బట్టి మంచి ఉద్యోగంలో చేరవచ్చు..." అన్నాడతను.

సీతకు చాలా సంతోషం కలిగింది.

"మా ఇంట్లోనే ఓ గది ఇస్తాను! ఇక్కడే ఉండు! నాకూ తోడున్నట్లుంటుంది..." అంది అరుణ.

సీత వేరే ఉంటానని ఎంత నచ్చచెప్పినా వినిపించుకోలేదామె. ఆమె భర్తకూడా అక్కడే ఉండమని బలవంతంచేశాడు. గత్యంతరంలేక ఊరుకుండిపోయింది సీత.

మర్నాడు తనతోపాటే ఫాక్టరీకి తీసుకెళ్ళి ఆమెకు చేయాల్సిన పనంతా నెమ్మదిగా వివరించి చూపాడతను.

ఆ సమయంలో అతను తనపాలిట దేవునిలా కనిపించాడు సీతకి. జీవిత




మంటే విరక్తి కలుగుతోన్న సమయంలో తనను ఆదుకొన్నాడు. ఇది సామాన్య మైన సహాయమేమీకాదు. తనలాంటి చరిత్రగలదానికి అసలు సహాయంచేయ డానికే ఎవరూ ఇష్టపడరు. అరుణకూడా ఎంతో గొప్ప మనసుకలది కాబట్టి తననింతగా అభిమానిస్తోంది. తన మిగతా స్నేహితురాండ్రెంతమందిలేరు? అందరూ తనని చూస్తూనే తప్పించుకొని, చూడనట్లు పోతుంటారు. మాట్లాడితేనే అపవిత్రత అంటుతున్నట్లు ప్రవర్తిస్తున్నారు.

కొద్దిరోజులు గడిచినయ్. రోజూ ఉదయం, సాయంత్రం అరుణతో కాల క్షేపం! అప్పుడప్పుడు ఆమె భర్తకూడా తమ సంభాషణల్లో పాల్గొంటూండే వాడు.

ఓరోజు ఫాక్టరీనుంచి ఇంటికొచ్చేసరికి ఇంట్లో అరుణ కనిపించలేదు సీతకి. ఆమె భర్త శ్రీహరి ఒక్కడే కూర్చుని కనిపించాడు.

"రా సీతా! కూర్చో" అన్నాడామెని"చూస్తూనే.

"అరుణ లేదా?" అడిగింది సీత వంటింటివేపు నడుస్తూ.

"ఉహూ ఉదయం టెలిగ్రాం వచ్చింది. ఆమె పినతల్లికి సీరియస్‌గా

ఉందిట! అందుకని నేను మధ్యాహ్నం ఫాక్టరీనుంచి వచ్చేసి ఆమెని బస్‌లో పంపించేశాను..."

వెనక్కి తిరిగి బయటకు నడువబోయింది సీత.

"అలా కూర్చో సీతా! నాకు ఒంటరిగా ఉంటే పిచ్చెక్కినట్లుంటుంది..." అన్నాడతను. అయిష్టంగానే కూర్చుంది సీత. అతని మాట కాదని అకస్మాత్తుగా వెళ్ళిపోవడం ఏమంత బావుండదనిపించిందామెకి.

"బాబు నిద్రపోతున్నాడా?" అడిగాడతను.

"అవును..."

కొద్దిసేపు నిశ్శబ్దంగా గడిచింది. చీకట్లు నెమ్మదిగా అలుముకోసాగినయ్.

అతను లేచి లైట్ స్విచ్ వేశాడు కాని లైట్లు వెలగలేదు.

"కరెంటు పోయినట్లుంది..." అన్నాడతను.

"నేను వెళ్తాను; బాబు నిద్ర లేస్తాడేమో..." లేచి నుంచుంటూ అంది సీత. అతనుకూడా లేచి ఆమె దగ్గరగా వచ్చాడు. అతని ముఖంలోకి చూసింది సీత. అతని ప్రవర్తనలో ఏదో తెలీని మార్పు కనబడుతూనే ఉంది. చటుక్కున ఆమెను కౌగలించుకొని పెదాలమీద ముద్దుపెట్టుకొన్నాడతను. బిత్తరపోయింది సీత.

ఆఖరికి...ఇతను కూడానా?-కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్యామెకి.

"శ్రీహరిగారూ..." వణుకుతున్న గొంతుతో అంది.

"దయచేసి కాదనకండి సీతగారూ! మిమ్మల్ని చూసిన మొదటిరోజునుంచే మిమ్మల్ని ఆరాధిస్తున్నాను. ఎంత ప్రయత్నించినా మీ రూపాన్ని నా గుండెల్లో నుంచి తొలగించలేకపోయాను. అరుణ మీగురించి చెప్పినదంతా విన్న తరువాత మీరు శాశ్వతంగా నాకు దక్కాలన్న కోరిక మొదలయింది. వివాహితుడు మరో స్త్రీని అంత గాఢంగా ఎలా ప్రేమించగలడా అని మీరనుకోవచ్చు! కాని ఇది నిజం సీతగారూ! అరుణ కేవలం తాళికట్టిన భార్య! కాని నా మనసుని సంపూర్తిగా వశపరచుకొంది మీరొక్కరే! మీరు ఉద్యోగంకోసం ప్రయత్నించమని చెప్పినప్పుడు మీకు సహాయం చేయాలనే తపనతోపాటు, మీరు శాశ్వతంగా నాకు దగ్గరవుతారన్న స్వార్థంకూడా అజ్ఞాతంగా తోడ్పడింది. ఇంత కాలానికి మీకు నా మనసు విప్పి మాట్లాడే అవకాశం లభించింది. ప్రామిస్ చేస్తున్నాను సీతా. మనం వివాహం చేసుకొందాం! అరుణతోపాటు మీరూ ఇదే

ఇంట్లో ఉండండి; ఇష్టంలేకపోతే మరో ఇంట్లో ఉండండి! ఇందుకు అరుణను కూడా వప్పించే బాధ్యత నాది!"

చిన్నపిల్లాడిలా తన గుండెలమీద తల ఉంచి కన్నీళ్ళతో మాట్లాడుతూన్న అతన్ని మౌనంగా చూస్తూండిపోయింది సీత! ఏం మాట్లాడాలో తోచడం లేదామెకి. మనసంతా అల్లకల్లోలంగా తయారయిపోయింది. మరికొద్ది సేపటికి బిగుసుకొంటున్న అతని కౌగిట్లో మంచులా కరిగిపోయింది.

వారం రోజుల తరువాత తిరిగి వచ్చింది అరుణ. సీత ఆమెను చూడ్డానికి భయపడుతోంది. తనేదో తప్పుచేసినట్లు అనిపించసాగింది. ఆ రాత్రి అరుణను తన కౌగిట్లోకి తీసుకొని తనకూ సీతకూ మధ్య జరిగిన సంభాష ణంతా చెప్పాడు శ్రీహరి. నువు అంగీకరిస్తే సీతకూడా మనింట్లోనే ఉంటుంది. నాకెందుకో సీతలేకుండా ఉండలేననిపిస్తోంది. ఆమెనుకూడా పెళ్ళిచేసు కోపడం మూలాన నీ కెలాంటి అన్యాయమూ జరగదని హామీ ఇస్తున్నాను. ఏమంటావ్?"

అరుణ కొద్దిసేపు భయభ్రాంతులతో కదిలిపోయింది. దుఃఖం, కోపం కట్టలు తెంచుకొన్నయ్. బిగ్గరగా ఏడ్చేయసాగింది. శ్రీహరి ఎంత సముదా యించినా వినిపించుకోలేదు. అతన్ని విదిలించికొట్టింది!

మర్నాడు ఉదయం త్వరత్వరగా పని ముగించుకొని ఫాక్టరీకి వెళ్ళి పోయాడతను. ఏం చేయాలో తెలీని పరిస్థితి ఏర్పడిపోయింది. అరుణ ఇంత కఠినంగా ఉండగలదని ఎప్పుడూ ఊహించలేకపోయాడు.

"సీతా" అంటూ పిలిచింది అరుణ.

సీత గుండెలు వేగంగా కొట్టుకోసాగినయ్.

"నీకేమయినా సిగ్గుందీ? నీతీ నియమం ఉందీ? అందరూ నీగురించి చెడుగా చెప్తోన్నా, నమ్మకుండా నిన్ను తీసుకొచ్చి ఇంట్లో ఉంచుకొన్నందుకు తగిన శాస్తే చేశావ్! ఇప్పుడు నువ్వు కూడా నాతో సమానంగా అర్హత పొందాలని కదూ, నీ కోరిక! అలాగేకానీ! నువ్వూ, ఆయనా, ఇద్దరూ కలసే ఉండండి! నా దారిన నేను పోతాను! మీకిద్దరకూ కావలసింది కూడా అదేగా!" అనేసి వేగంగా అక్కడినుంచి నడిచి వెళ్ళిపోయింది. తన గదిలోకి నడిచి తన బట్ట లన్నీ సర్దుకోసాగింది. కొద్దిసేపటి తర్వాత ఆమె తలెత్తి చూసేసరికి సీత గడపదగ్గరే నుంచుని కనిపించింది. ఆమె చంకలో బాబు-చేతిలో సూట్ కేస్ ఉన్నయ్.

"నన్ను క్షమించవే అరుణా! నిజంగా చెప్తున్నాను. తప్పు నాదికాదు. కావా లని నేనేమీ చేయలేదు. నీ సంసారం చెడగొట్టాలనిగానీ, మీ ఆయన్ని పొందా లనికానీ నేను ఆలోచన చేయలేదు. ఇప్పుడు నేనేం చెప్పినా నువ్వు నమ్మవ్! నేనే వెళ్ళిపోతున్నాను. ఇంకెప్పుడూ నీకుగానీ, ఆయనకుగానీ కనబడనని హామీ ఇస్తున్నాను..." దుఃఖం బిగబట్టుకుంటూ బయటకు నడిచింది సీత.

* * *

చలపతి ఆఫీసునుంచి ఇంటి కొచ్చేసరికి లోపల ఓ కవరు కింద పడివుంది. అందుకొని లోపలి ఉత్తరం బయటకు లాగాడు. సీత దసూరి కనబడుతూనే ఉంది.

"చలపతీ!

ఈ దిక్కుమాలిన దేశంలో ఆడది మగాడి బానిస! బానిస బ్రతు కెలాంటిదో నీకూ బాగా తెలుసు! మనం చిన్నప్పుడు చరిత్రలో చదువుకొన్నాం, గుర్తు లేదూ?

ఇక్కడ ఆశ్చర్యం ఏమిటంటే ఈ బానిస తన యజమానిని ప్రేమిస్తుంది. గౌరవిస్తుంది! నమ్ముతుంది! ఆరాధిస్తుంది!

అలా చేయని బానిసని యజమానే కాకుండా, తోటి బానిసలుకూడా చంపుతారు. నేను బెంగుళూరునుంచి తిరిగి వచ్చేశాను. ట్రైన్ దిగగానే వినోద్ కార్లో ఎదు రయ్యాడు. తను చేసిన తప్పు తెలుసుకొన్నాననీ-నేను ఇకనుంచీ తనదగ్గరే ఉండాలని బ్రతిమాలాడు. బాబుని ఎత్తుకొన్నాడు. ముద్దులాడాడు. అతని పశ్చాత్తాపం చూసి లొంగిపోయాను. అతని కారెక్కాను.

ఊరిబయట ఉందతని ఇల్లు! ఇంట్లో ఎవ్వరూ లేరు. నాకేదో అనుమానంగా ఉంది. రాత్రంతా అతను నన్ను అనుభవించాడు. ఎంతో ప్రేమగా మాట్లా డాడు. జీవితం ధన్యమైపోయిందని భావించాను. రెండురోజులు గడచిన తర్వాత అసలు విషయం నాకు తెలిసింది. అతనికి కుష్ఠురోగం! అందుకే అతని భార్య అతనిని వదిలేసింది. అతని బంధువులు, స్నేహితులు అందరూ అతనిని ఇలా ఊరికి దూరంగా ఉంచారు. ఒంటరితనమే అతనికి దేముడు విధించిన శిక్షలాగుంది. అతని క్కావలసింది కేవలం ఒక స్త్రీ శరీరం! అందు కని పశ్చాత్తాప పడుతున్నట్లు నాటకమాడి నన్ను తీసుకెళ్ళాడు. డబ్బిచ్చి కొనుక్కుందామన్నా అతనికి స్త్రీ లభించదు. అందుకే నామీద ప్రేమ నటిస్తు న్నాడు. అతను నిజంగా పశ్చాత్తాప పడినట్లయితే, కుష్ఠురోగమున్నా అతనినే




కనిపెట్టుకొని ఉండేదాన్ని. అన్నట్లు నేను సతీసుమతి సినిమా చూశాను కాని సుమతి కారెక్టర్ నాకు నచ్చలేదు.

కానీ అతనిది కేవలం శారీరిక ప్రేమే! అంతే! మనస్ఫూర్తిగా నాకు అన్యాయం చేశానన్న భావంతో నన్ను ఆహ్వానించలేదు. అందుకే అక్కడినుంచి బయటపడ్డాను. అతనిద్వారా నాకూ కుష్ఠురోగం అంటుతుందేమోననే భయం మొదలయింది. తర్వాత నవ్వు వచ్చింది. జీవితానికే కుష్ఠురోగం అలుముకొంది! ఇంక భయమెందుకు. ఎన్నో రోజులు ఆలోచనల్తో గడపలేకపోయాను. ఇంట్లో పరిస్థితులు బావుండలేదు. నన్ను చూసినప్పుడల్లా మా అమ్మకు గుండె నొప్పి! తమ్ముడికి కోపం! చెల్లాయికి అసహ్యం!

నిన్నరాత్రి ఓ మాంచి కల వచ్చింది. కలలో దేముడు కనిపించాడు. ఆ దేముడు అచ్చం మన పౌరాణిక సినిమాల్లో కనిపించే దేముడిలానే ఉన్నాడు.

"నా దగ్గరకొచ్చి ఉండకూడదూ?" అనగాడిడు.

అందుకని అక్కడికే వెళ్ళిపోదామని నిశ్చయించుకొన్నాను. తీరా వెళ్దామని ప్రయాణానికి అన్ని సన్నాహాలూ చేసుకొనేసరికి 'నా బాబు' సంగతి గుర్తుకొచ్చింది. వాడినెవరు చూస్తారు? అప్పుడు గుర్తుకొచ్చావ్ నువ్వు! వెంటనే నీకీ ఉత్తరం రాస్తున్నాను. జీవితం నాకు చాలా అలసట కలిగించింది చలపతీ!

అంచేత విశ్రాంతి కావాలి! వచ్చే జన్మలోనయినా నేను మగాడిగా పుట్టాలని కోరుకొంటున్నాను. ఈ మగాళ్ళందరూ అప్పుడు ఆడవాళ్ళుగా పుట్టాలి! నేను కసి తీర్చుకొంటాను.

నాకున్న ఒకే ఒక్క ఆప్తునిగా నిన్ను ఒకే ఒక్క కోరిక కోరుతున్నాను చలపతీ! నా బాబుని తీసుకెళ్ళు! వాడిని మనిషిలా పెంచు! మగాడిగా కాదు! వచ్చే జన్మలో నీ ఋణం తీర్చుకుంటాను—నీ సీత."

చలపతి హడావుడిగా ప్రయాణమయి బస్‌స్టాండ్‌కి చేరుకొన్నాడు. అతని మనసంతా అల్లకల్లోలంగా తయారయింది. సీత ఆత్మహత్య చేసుకొందా? చేసుకొనే లోపల తనక్కడికి చేరుకోగలడా? తన సీతని రక్షించుకోగలడా? కళ్లవెంబడి నీళ్ళు ఎంత ఆపినా ఆగటంలేదు.

రాత్రి పదకొండయింది సీత ఇల్లు చేరుకొనేసరికి.

"అక్క స్లీపింగ్ పిల్స్ మింగింది! ఆస్పత్రిలో చేర్చాము..." అందామె చెల్లి.

"ఏ హాస్పిటల్?"

"గాంధీ హాస్పిటల్! అమ్మా, నాన్నా అంతా అక్కడే ఉన్నారు..."

టాక్సీలో హాస్పిటల్ చేరుకొన్నాడు చలపతి. సీత తల్లి ఆమె మంచం దగ్గరే కూర్చుని ఏడుస్తోంది.

సీత మంచానికి అంటుకుపోయినట్లుంది. అయినా ఆమె ముఖంలో కాంతి తగ్గలేదు చలపతి దగ్గరగా కూర్చుని ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకొన్నాడు. నెమ్మదిగా కళ్ళు విప్పి అతన్ని చూసి మందహాసం చేసింది సీత. కానీ అంతలోనే కళ్ళు మూతలు పడిపోయినయ్.

"సీతా! నీకోసం వచ్చాను సీతా! నిన్నూ, బాబునీ నాతో తీసుకెళ్లడానికి వచ్చాను..." ఆమె చెవిలో గద్గదస్వరంతో అన్నాడతను.

కళ్ళు విప్పిందామె ఆనందంతో ఆమె కళ్ళు మెరిసినయ్.

"నీలాంటి మగాళ్ళుండబట్టే ఆడది యింకా ఈ వ్యవస్థని నమ్ముతోంది చలపతీ—నాకూ జీవితంమీద మళ్ళీ ఆశ కలుగుతుంది...కాని...అలస్యం అయిపోయింది..."

ఆమె శ్వాస ఆగిపోయింది.

చలపతి లేచి నుంచున్నాడు.

అతని దృష్టి సీత తండ్రి ఎత్తుకొన్న సీత కొడుకుమీద పడింది.

---

# దొంగ

వాహిని

రాజారావు అటునుంచి వస్తుంటే దారిలో నాగభూషణం ఇంటిముందు జనం గుంపుగా కన్పించారు. మధ్యలో వున్న నాగభూషణం పెద్ద పెద్ద కేకలు వేస్తున్నాడు.

అతను గుంపులోకి జొరబడి చూసే సరికి నాగభూషణం ముందు ఒక పదేళ్ళ కుర్రవాడు మాటా పలుకూ లేకుండా కళ్ళు ఒప్పగించి దిక్కు-ముఖం వేసుకుని నిల్చున్నాడు. శివమెత్తినవాడిలా ఎగురు రుతూ అరుస్తున్నాడు, నాగభూషణం.

విషయం ఏమిటో ఎవర్నీ అడక్కుండానే అర్థమైపోయింది రాజారావుకి.

నాగభూషణం ఇంటిముందు ఒక నారింజచెట్టువుంది. దాని కాయ ఒకటి ఆ కుర్రాడు దొంగతనంగా కోశాడు. అదీ సంగతి. దానికే ఆయనగారు పెద్ద పంచాయితీ పెట్టి రాద్ధాంతం చేస్తున్నాడు.

ఆ చెట్టుకు వందలకొద్దీ కాయలు విరగ్గాసి చూసేవారి నోళ్ళూరిస్తున్నాయి. ఆ రోడ్డుమీద వచ్చేపోయే ప్రతివారూ ఆ చెట్టువైపొకసారి చూసిగానీ వెళ్ళలేరు. అంతగా ఆకర్షిస్తుందా చెట్టు. అయినా ఏదో కుర్రవాడు. చిన్నతనం. ఒక కాయ కోస్తే కోసి వుండవచ్చు. దానికేనా ఏదో కొంపమునిగి పోయినట్లు గోలపెడుతున్నాడు. పరమ లోభిరా నాయనా ! అనుకున్నాడు రాజారావు,

ఆ కుర్రవాడి చేతిలో కాయ తీసేసుకున్నాడుగా ఇంకా ఎందుకు రచ్చ. రెండు దెబ్బలుగూడా వేసినట్లున్నాడు. పాపం వాడి కన్నీళ్లు బుగ్గలమీద కారుతున్నాయి. నోట మాటలు రాక వెక్కిళ్ళు వస్తున్నాయి.

నాగభూషణంమీద కోపం, ఆ కుర్రవాడిమీద జాలి కలిగాయి రాజారావుకి. అతన్ని అమాంతం చెరుగ్గద

నమిలినట్లు నమిలేయాలనిపించింది. కాని ఎల్లా ?

"ఏదో పుర్రవాడు లెండి. పోనీయ్యండి. ఒక్క కాయేగదా కోశాడు" అన్నాడు రాజారావు, నాగభూషణంతో.

''మీరలాగే చెప్తారండీ, మీదేం పోయింది. ఈ రోజు ఒక్కకాయ కోశాడని వూరుకుంటే రేపు వందకాయలు కోస్తాడు,'' అని గంయ్! మంటూ రాజారావుమీదకు లేచాడు నాగభూషణం.

రాజారావు కోపంతో ముక్కుపుటా లెగరేశాడు. ఇంతమంది జనం వినోదం చూస్తూ నిల్చున్నారుతప్ప 'పోనీ పాపం' అని ఒక్కరూ అనరే. ఏం మనుషులో గాని అనుకున్నాడు.

"అయితే ఇప్పుడేం చేస్తారు ?" అన్నాడు రాజారావు రంగంలోకి దిగుతూ.

"ఏంచేస్తానా ? ఏదైనా చేస్తాను. కాళ్ళూ, చేతులూ విరగ్గొడతాను," అన్నాడు నాగభూషణం కోపంతో వూగిపోతూ. మధ్యలో వీడెవడో ఆ దొంగ వెధవకి సపోర్టు చెయ్యటం అని అతనికి మహా చిరాకుగా వుంది.

''విరగ్గొడితే చూస్తూ వూరుకోడానికి ఇది వూరండీ బాబు. అడివికాదు. ఏదీ విరగ్గొట్టండి చూద్దాం,'' అన్నాడు రాజారావు సవాలు చేస్తూ.

అసలు గొడవపోయి ఇదేదో సరికొత్త గొడవ మొదలవుతూ వుండడం చూసి "పోనీయండి. ఇక ఇంట్లోకి రండి మీరు," అంది నాగభూషణం భార్య.

రాజారావు సవాలు వినేసరికి నాగభూషణానికి కొంచెం జంకు కలిగింది. పైకి మాత్రం బింకంగానే వున్నాడు.

"పోనీ గదా అని వూరుకుంటున్నాను. అసలు పట్టుదల వస్తే పోలీసులకు అప్పజెప్పి వీడి భరతం పట్టిస్తా. అయినా మీకెందుకండీ ఈ గొడవ. సొమ్ము నాది. ఈ కాయ ఖరీదు ఎంతో తెలుసా? కనీసం నలభై పైసలు. ఈ ఎండల్లో కాయ దొరక్క అల్లాడిపోతున్నారు" అంటూ నాగభూషణం పిడికిలి విప్పి కాయ అరచేతిలో పెట్టుకుని ప్రదర్శించాడు.

తీరా పరీక్షగా చూస్తే అది నారింజ కాయ కాదు. బత్తాయికాయ. రాజారావుకి జరిగినదంతా అర్థమైపోయింది. ఆ కుర్రవాడు బజార్లో బత్తాయికాయ కొనుక్కుని వస్తూ వుంటాడు. నాగభూషణం ఇంటి ముందుకు వచ్చేసరికి ఆ నారింజచెట్టు ఆకర్షణలో పడిపోయి అలా చూస్తూ నిల్చుండి వుంటాడు. ఇంతలో నాగభూషణం వచ్చి చూసి, ఆ కుర్రాడి చేతిలో బత్తాయిని నారింజ అనుకున్నాడు. ఇంకేముంది పట్టుకుని 'దొంగ, దొంగ' అని హడావుడి చేసేశాడు. అయితే ఆ విషయం ఎవరూ గమనించలేదు. కాయ నాగభూషణం



పిడికిట్లో వుండటంవల్ల సరిగా కన్పించ లేదు.

"మీ చెట్టువి ఏంకాయలు?"అన్నాడు రాజారావు.

"కళ్ళు కన్పించడంలేదూ ! నారింజ కాయలు," అన్నాడు నాగభూషణం వ్యంగ్య ధోరణిలో.

"అదే అడుగుతున్నాను. మీకు కళ్ళు వున్నాయా ? పోయాయా ? మీ చేతి లోది ఏంకాయ ?" అన్నాడు రాజారావు తీవ్రంగా.

నాగభూషణం పరీక్షగా కాయని అటూ, ఇటూ తిప్పిచూశాడు. అది బత్తాయి కాయ అని గ్రహించగానే అతని ముఖం వెలవెల పోయింది. కత్తివేటుకు నెత్తునుచుక్క లేదు. గమ్ అంటించేసి నట్టు నోరు మూసుకున్నాడు.

"బత్తాయి ... బత్తాయి..." అని జనం కేకలు పెట్టారు.




"అన్యాయంగా కుర్రవాడిని కొట్టాడు గదరా," అని ఒకళ్ళిద్దరు సానుభూతి పలికారు.

"ష్...ఆగండి," అని రాజారావు విజృంభించాడు.

ఆ కుర్రవాడిని కొట్టినందుకు నాగభూషణంపోలీస్ స్టేషన్‌కి రావాలన్నాడు. పోలీసుల మాట వినగానే అతను చలి జ్వరం వచ్చినవాడిలా గడగడ వణికి పోతూ రాజారావు కాళ్లూ, గడ్డాలు పట్టుకున్నాడు.

ఒక అరగంటసేపు నాగభూషణాన్ని కోతిని ఆడించినట్లు ఆడించాడు రాజారావు. గుంపులోవాళ్లు టిక్కెట్టు లేకుండా వినోదం చూశారు.

చివరికి కొట్టినందుకు నాగభూషణం చేత పదిరూపాయలు ఆ కుర్రవాడి ఇప్పించాడు రాజారావు.

అందరూ రాజారావుని ప్రశంసిస్తూ వెళ్ళిపోయారు. అతను ఆ కుర్రవాడి భుజంమీద చెయ్యివేసి తీసుకెళ్ళాడు.

కొంతదూరం పోయాక ఒక కిళ్ళీ కొట్టు దగ్గిర ఆపి పది కాగితం తీసుకుని చిల్లరమార్చి ! ఒక రూపాయి ఆ కుర్ర వాడి చేతిలో పెట్టి, మిగిలిన తొమ్మిది తన జేబులో పెట్టుకున్నాడు రాజారావు.

ఆ కుర్రవాడు తెల్లబోయి పెదవులు కదిలిస్తూ రాజారావు వంక చూశాడు. పాపం వాడికి మాటలు రావు.

# వెచ్చని

పోలంపల్లి శాంతాదేవి

టీచరుగా పనిచేస్తున్న శోభనాద్రికి రిటైర్‌మెంట్ ఇంకా ఓ పది సంవత్సరాలు ఉండగానే జీవితంనుండే రిటైర్ అయ్యాడు, ఓ దుర్ముహూర్తాన హార్ట్ ఎటాక్‌తో. అప్పటికి ఆయన మిగిల్చిన ఆస్తిఅంటూ ఏమీలేదు. అరడజను సంతానానికి తండ్రి అయ్యాడు. ఆయన పోయాక ఆయన భార్య కాంతమ్మకు ప్రావిడెంట్‌ఫండ్, పెన్షన్ అవీ ఇవీ కలిపి ఓ నాలుగైదు వేలదాకా వచ్చాయి. రెండు సంవత్సరాలు గడిచేసరికి ఆ డబ్బు నీళ్ళలో పంచదార కరిగిపోయినట్టుగా కరిగిపోయింది. ఆకలిమంటలు ప్రారంభమయ్యే సమయానికి చీకటిలో చిరుదీపంలా కాంతమ్మ రెండోకూతురు ఊర్మిళ బేసిక్ ట్రెయినింగ్ అయ్యి టీచరుగా అపాయింట్ అయింది. చనిపోయిన శోభనాద్రి మీది గౌరవంతో ఆయన మిగిల్చిపోయిన కుటుంబంమీది సానుభూతితో ఊరిపెద్దలు ఊర్మిళకు ఉన్నఊళ్లోనే ఉద్యోగం వేయించారు.

కాంతమ్మకి వచ్చే పెన్షన్‌డబ్బు, కూతురు జీతంకలిసి గంజినీళ్ళు త్రాగినట్టుగా రోజులు గడిచిపోయినాయి.

ఊర్మిళకు ఉద్యోగమయ్యాక మొదటిసంవత్సరం ఉత్సాహంగా, తను ఓ ఆడపిల్ల అయ్యి, తండ్రి అర్ధాంతరంగా వదిలిపోయిన కుటుంబాన్ని పోషిస్తున్నానన్న తృప్తితో గడిచిపోయింది. రెండో సంవత్సరంనుండి ప్రారంభమైంది బడినుండి అలసిపోయి రావడం, విసుగుపడడం.

"పిల్లల్ని సుఖపెట్టడం చేతకాని వాళ్ళు ఎందుకు కంటారో? ఇంత మందిని నా మెడకువేసి చచ్చాడు నాన్న. ఇప్పుడు నేను చస్తున్నాను ఇంత సంసారాన్ని ఈదలేక! నా ఈడు పిల్లలంతా చక్కగా చదువుకొంటూనో, పెళ్ళిచేసుకొనో హాయిగా ఉన్నారు. నాకువచ్చాయి ఈ తిప్పలు."

సంపాదిస్తున్న ఈ కూతురు ఇలా సణుగుతోంటే, ఉరిబిగుసుకొంటున్నట్టు

ఉక్కిరిబిక్కిరి అవుతుంది కాంతమ్మకు. 'నీ సంపాదన మాకేం అక్కరలేదమ్మా, అని చెబుదామంటే బ్రతికేదెట్లా? ఆ పిల్ల సణుగుళ్ళు వింటూంటే ఆ సంపాదన మింగలేక కక్కలేక అన్నట్టుగా ఉంది.

ఊర్మిళ ఆ విసుగువెనుక ఒక కథ ఉంది.

మనిషిలో స్వార్థం ప్రవేశించనంత సేపు ప్రపంచమంతా మంచిదిగా కనిపిస్తుంది. అది ప్రవేశించిందో అడుగడుగునా శత్రుత్వం ఏర్పడుతుంది?

ఊర్మిళ సహోధ్యాయుడు సుందర్ ఊర్మిళకంటే ముందునుండీ ఆ బడిలో పనిచేస్తున్నాడు. అతడి పరిచయం రాను రాను ప్రేమగా మారిపోయింది.కాని అతడు అన్యకులస్తుడు! ప్రేమ వెల్లడించి వివాహం చేసుకొనే ధైర్యంలేదు ఊర్మిళకు. తన మెడని ఓ సంసారం ఉంది. పైగా తనకో పెళ్ళికాని అక్క ఉంది.

ఆ అక్క పేరు కిరణ్మయి.

కిరణ్మయికి చదువంటలేదు. నాలుగో తరగతికే ఆమె చదువు సమాప్తమైపోయింది. తల్లీ చెల్లెలు పోరాడగా కత్తిరింపూ, కుట్టూ నేర్చుకోడానికి ఆరు నెలలు సెంటర్‌కి వెళ్ళింది కాని, ఆరు నెలలైనా కత్తెరపట్టుకోవడమైనా చేతకాలేదు. మొద్దుముఖానికేమీచేతకాదంటూ సెంటర్ మానిపించింది తల్లి.

"ఆ మిషన్ నేర్చుకొంటే కాస్త నా బరువు దింపేదానివికాదూ? అందరూ నామీద పడి తినేవాళ్ళు అయిపోయారు" అంటూ అక్కను దులుపుతుంది ఊర్మిళ. కిరణ్మయిని చూస్తే ఊర్మిళకు అసలు పడదు. ఆమె ఓ తిండి దండగమనిషిలా కనిపిస్తుంది. ఊర్మిళ తరువాత అందరూ చిన్నపిల్లలు. వాళ్ళు చదువుల్లో ఉన్నారు. వాళ్ళమీద ఏద్వేషం ఎలాగో తెలియదు. తన కసి అంతా అమ్మమీదా, అక్కమీదా చూపుతుంది ఊర్మిళ.

* * *

దినదిన గండంగా గడుపుతున్న వాళ్ళకి పిల్లల పెళ్ళిళ్ళు, ముద్దుముచ్చట్లు తీర్చాలన్న ధ్యాస ఉండడం అసంభవం.

"ఏవమీవి రాళ్ళలా ఇద్దరు ఆడ పిల్లల్ని పెట్టుకొని నీకు నిద్రెలా పడుతుందే, కాంతం. చూస్తూ చూస్తూ ఉంటే ఏదో ఓ సంబంధం తగులుతుంది. ఊరికే కూర్చుంటే పిల్లను వెదుక్కొంటూ సంబంధాలు వచ్చేరోజులా?" అంటూ ఏ ఇరుగుపొరుగమ్మో గుర్తుచేస్తే "ఓ! వాళ్ళకి పెళ్ళిళ్ళు చేయాలికదూ?" అని మాత్రం అనుకొంటుంది కాంతమ్మ.

ఎదురింటి అశ్వర్థమ్మ ఓనాడు ఓ సంబంధం తీసుకువచ్చింది.

పెళ్ళికొడుకు పేరు ఆంజనేయులు. వయసు అరవై లోపుమాత్రమే ఉంటుంది ఇద్దరు భార్యలు వైకుంఠానికి వేంచేయగా ముచ్చటగా మూడోపెళ్ళి చేసుకోబోతున్నాడు.

"మన కిరణ్మయినిస్తే ముద్దుగా చూచుకొంటాడు. ఓ వెయ్యిరూపాయలు ఎదురిచ్చి చేసుకొంటాడు. బాగా డబ్బు వస్తుంది ఉన్నవాడు కాబట్టి ఓ ఇద్దరు పిల్లల్ని తీసికెళ్ళి చదువు చెప్పించ గలడు" అని చెప్పింది.

అశ్వత్థమ్మ ఎన్ని ఆశలు చూపినా కన్నబిడ్డ జీవితంలో నిప్పులు పోయ డానికి అంగీకరించలేకపోయింది కాంతమ్మ. మళ్ళీ ఆ సంబంధం మాటె త్తకు అని కసిరికొట్టింది.

* * *

రావణాసురుడికి ఒక తలనరికితే పదితలలు మొలుచుకొచ్చే వరముందట. అలాగే 'కోరిక' అనేదానికికూడా ఉండాలి.

దాన్ని అణచివేస్తున్నకొద్దీ రెట్టింపు శక్తితో తలెత్తుంది. త్రుంచివేస్తున్న కొద్దీ పది తలలతో తలెత్తుతుంది.

వయసులో ఉండేవాళ్ళ కోరికలకిక పట్టపగ్గాలే ఉండవు.

అప్పుడే ఇరవై అయిదు సంవత్స రాలు వచ్చేశాయి కిరణ్మయికి. పైకి చదువూ సంధ్యా లేని మొద్దులా కనిపించే ఆమెలో అంతులేని ఊహలూ అణుచు కోలేని కోరికలూ !

తండ్రి ఉన్న కాలంలో తండ్రిదగ్గర ట్యూషన్ చదవడానికి వచ్చే రఫీపట్ల మొదట్లో ఏ ఊహలూ లేవు కిరణ్మయికి. ఆయన పోయాక కూడా రావడం మాన లేదు రఫీ. పిలుస్తున్నప్పుడల్లా వచ్చేవాడు. ఆ కుటుంబానికి చేతనైన సాయం చేసే వాడు. రఫీ తండ్రి ఊళ్లో పలుకుబడి, డబ్బూ ఉన్న మనిషి. రఫీ బి.ఇడి. చేస్తూనే, ఉన్న ఊళ్ళోనే ఉద్యోగం రావడానికి ఆయన పలుకుబడి ఎంతో ఉపయోగపడింది. ఉద్యోగ మయ్యాక కూడా రఫీ రాకపోకలు ఆగలేదు. ఒక ఆప్తుడిలా భావించి తన కష్టసుఖాలు వెళ్ళబోసుకొనేది కాంతమ్మ.

ఒక స్నేహితుడిలా ఉన్న రఫీపట్ల కిరణ్మయి ఊహలు మాత్రం చిత్రంగా పరుగుతీయసాగాయి. ప్రేమ మంది రంలో అతడి మూర్తిని ప్రతిష్ఠించి అర్చించడం ప్రారంభించింది కిరణ్మయి. ప్రేమ ప్రవాహంలో అతడు అన్య కులస్తుడన్న ధ్యాస కొట్టుకుపోయింది.

రఫీకూడా ఇంచుమించు అదే అవ స్థకు లోనయ్యాడు.

ఒకరోజు ధైర్యంచేసి, "కిరణ్మయీ! నేనంటే నీకిష్టమేకదూ ?" అని అడిగాడు.

"ఇష్టమా ? నువ్వు నా ప్రాణం !"

"నీ ప్రాణం నాదీ !"

కిలకిల నవ్వుకొన్నారు.

"మన పెళ్ళి నీకు అంగీకారమేనా?"

కిరణ్మయి సిగ్గుతో తలాడించింది.

"అమ్మను అడగనా ?"

రఫీ ప్రశ్నకు కిరణ్మయి అదిరి పడింది. "అలాంటి తెలివితక్కువ పని



మాత్రం చేయక ! పీకపిసికి నా శవాన్ని నూతిలోకి తోసేస్తుంది అమ్మ. నిన్ను మరి ఇంటిగడప త్రొక్కనివ్వదు. నిజాయితీగా ప్రవర్తించి మనం దూరం కావడం నాకిష్టంలేదు. ఎక్కడికైనా వెళ్ళి పెళ్ళిచేసుకొని వద్దాం ! తరువాత ఎవరెన్ని తిట్టినా, నేను పడడానికి సిద్ధమే. తిడతారుగానీ మనల్ని విడదీయలేరు కదా !"

ఒకరోజు హఠాత్తుగా మెడలో పూలదండలతో "ఆశీర్వదించమ్మా" అంటూ వచ్చిన కిరణ్మయినీ, రఫీనిచూచి పిడుగు పడ్డట్టుగా స్తంభించిపోయింది కాంతమ్మ.

"నీకిదేం పోయేకాలమే ? ఈ తురకాణ్ణి కట్టుకొనేందుకు నీ మనస్సెలా ఒప్పిందే? చచ్చి స్వర్గానఉన్న మీ నాన్న ఆత్మను రచ్చకీడ్చావుకదే ? కుటుంబానికి కడుక్కోలేని మచ్చ తెచ్చిపెట్టావుకదే ? ఒరే రఫీ ! మేకవన్నె పులీ! ఏదో మంచివాడివనుకొని ఇంటికిరానిస్తే నమ్మించి గొంతు కోశావుకదరా ? గోమాంసం తినే తురక వెధవా ! నా బిడ్డను పెళ్ళిచేసుకోడానికి నీకెన్ని గుండెలురా ?"

దేవుడిలా అతడు చేసిన సహాయాలన్నీ మరిచిపోయి తిట్లకు లంకించుకొంది కాంతమ్మ. ఆ కేకలకు ఇరుగు పొరుగులంతా గుమిగూడారు.

మెడలో పూలదండలతో నిలబడ్డ ఆ ఇద్దరినీ జోకర్లను చూసినంత చిత్రంగా చూడసాగారు.

ఎదురింటి అశ్వర్థమ్మ ఓ చిత్రమైన నవ్వునవ్వి, "ఎందుకు తిడతావే,కాంతం? కలియుగం మునగడానికి వచ్చింది. బ్రహ్మంగారు చెప్పింది ఒక్కటీ తప్పిపోవడంలేదు. కులమతాలు కూలిపోవాలి! వావి వరుస లేకుండా పోవాలి ! ఇప్పుడే ఏంచూశావ్ ? ముందుంది !" అంది వేదాంతసారం వడగట్టిన పోజులో.

"దాన్నేంచేయమంటావు ? పాతికేళ్ళు వచ్చాయి. ఒక్కనాడైనా దాని పెళ్ళి

గురించి ఆలోచించావా? అదిమాత్రం వయసును ఎన్నాళ్ళు మింగుతుంది? దాని దారేదో అది చూచుకొంది! ఇంతకీ నీకు తురక అల్లుడు రాసిపెట్టి ఉన్నాడు మొఖాన! అందుకే ఆంజనేయులుగారి సంబంధం నచ్చలేదు నీకు! అప్పుడు నా మాటకు అవునని ఉంటే నీ కీరోజు ఈ తిప్పలు ఉండేవి కావుగా?"

"నిజమేనమ్మా! ఈ ముండ నా కిలాంటి మచ్చ తెచ్చిపెడుతుందని తెలిసిఉంటే పీకపిసికి చంపేసి ఉందు నమ్మా! శోకాలుపెట్టింది కాంతమ్మ.

"ఇదేం పోయేకాలం? తల్లి పెళ్ళి చేయలేదని తురకాణ్ణి కట్టుకుంటుందా! పెళ్ళికాని ఆడపిల్లలంతా ఎవణ్ణో ఒకణ్ణి చూచుకొని పెళ్ళిఅయిందని చెప్పుకొంటే సరిపోతుందా? అయినా అప్పుడే ఏం వయసు మించిపోయిందమ్మా! పాతిక లోపేకదా? మా మహాలక్ష్మికి, ముప్ప య్యేళ్ళు వచ్చాయి. దానికి పెళ్ళిగురించి ధ్యాసేమైనా ఉందా? మగవాడి పొడం టేనే గిట్టదు దానికి! పైగా ప్రొద్దుటలేచి పదిమంది మగాళ్ళమధ్య పనిచేసే ఉద్యోగ మాయె!" పక్కింటి కామాక్షమ్మ అంది.



గుమిగూడిన జనంముఖాలలో ఓ హాసరేఖ తొంగిచూసింది.

కామాక్షమ్మ కూతురికి ముప్ప య్యేళ్ళు వచ్చాయి నిజమే. పెళ్ళికాలేదు నిజమే. పదిమంది మగవాళ్ళమధ్య పని చేసేదీ నిజమే. మగవాడి పొడ గిట్ట దంటే మాత్రం పొట్ట చెక్కలయ్యేలా నవ్వక తప్పదు! మహాలక్ష్మి ప్రణయ కథలు తెలియనివారు చాలా అరుదు! వాసన చూచినవాడిని మళ్ళీ చూడని

ప్రతంలాంటివి ఉండాలనుకొంటారు, ఆమె మగవాళ్ళను మార్చడం గురించి తెలిసినవాళ్ళు!

"కట్టుకోగానే అయిపోయిందా! ఇలాంటి కేసుల్ని నేను చాలా చూశాను. వీడు దాన్ని ఎన్నాళ్ళు ఏలుకొంటాడు? మోజు తీర్చుకొని ఎంగిలాకులా వీధి లోకి విసిరితే—అప్పుడు తెలుస్తుంది అమ్మాయిగారికి! కళ్ళపొరలు అప్పుడు తొలగిపోతాయి." ఓ అమ్మ అంది.

ఎవరెన్ని మాటలు అన్నా శాంతం చెదరని రఫీ ఈ మాటతో భగ్గుమన్నాడు. కొట్టబోయినంత పనిచేశాడు ఉవిణ్ణి.

"నీ ప్రతాపం మామీద ఏంచూపు తావుగాని దాన్ని సట్టేట్లో ముంచకోయ్! నిన్ను నమ్ముకొన్న ఆడది! ప్రతం వెధ్ధా ఫలం దక్కని చందం మాత్రం చేయకు!" ఓ ముసలాయన హితవు లోని వ్యంగ్యం.

"మీరు మా పెళ్లిమీద ఏ వ్యాఖ్యా నమూ చేయక్కరలేదు. మీకా హక్కు లేదు. ఓ తండ్రిలేని బిడ్డ పాతికేళ్ళు ఎదిగిపోయి ఇంట్లో కుమిలిపోతుంటే మీలో ఒక్కరైనా అయ్యో పాపం అన్నారా? ఆమెకు యోగ్యుడైన వరుడిని చూసి పెళ్లి చేయాలని ఒక్కరైనా ముందుకు వచ్చారా? అసలు ఓ ప్రాణి యిలా చీకటి కూపంలో కుమిలిపోతున్న దన్న సంగతి మీకు పట్టిందా?" రఫీ ఆవేశంగా అన్నాడు.

"అందుకే ఉద్ధరించావ్‌గా?"

"ఈ తురకాడు దానికి స్వర్గం చూపు తాడు."

ఈ దెబ్బలు, హేళనలు ముందుగానే ఊహించుకొన్న కిరణ్మయి చెక్కు చెదరలేదు. "పద, రఫీ!" అంది అతడి చెయ్యి పట్టుకొని.

కిరణ్మయి భుజాంచుట్టూ చేయి వేసి నడిపిస్తూ వెళ్ళిపోయాడు రఫీ.

కిరణ్మయి నిర్లజ్జతనూ, కండ కావ రాన్ని విమర్శిస్తూ, కాంతమ్మను ఓదా రుస్తూ చాలాసేపు ఉండిపోయారు జనం.

* * *

చీకటి కౌగిలించుకొన్నట్టుగా ఉన్న ఆ సందుగుండా ఒక స్త్రీ ఆకారం గబ గబా నడుస్తూన్నది. కొంగు ముఖం మీదికి బాగా లాక్కుంది. ఎవరో తరుముతూన్న దానిలా వెనక్కీ పక్క లకీ చూడకుండా సూటిగా ముందుకే చూస్తూ నడుస్తోంది. ఆ సందు దాటి మరో సందులోకి తిరిగి కొన్ని అడుగులు వేసి ఓ ఇంటి ముందు ఆగి తలుపు తట్టింది.

"ఎవరూ?"

"........." తలుపుమీద శబ్దం మాత్రం చేసింది.

రెండు నిమిషాల తరువాత తలుపులు తెరుచుకొన్నాయి.

తలుపు తీసిన యువతి ఆశ్చర్యపోయి తేరి

పార చూడకుండానే, "ఎమ్మా, నువ్వా?" అంది. ఆ కరం కంగారు సంతోషం సుళ్లు తిరుగుతున్నట్టుగా ధ్వనించింది.

''కిరణ్మా! అల్లుడున్నాడా?"

లోపలికి వచ్చి నిలబడుతూ అంది కాంతమ్మ.

"లేరమ్మా! సాయంత్రం బయటికి వెళ్ళారు ఇంకాస్సేపట్లో వస్తారు!"

పదిహేనురోజుల క్రితం ఎక్కడో దండలు మార్చుకొని, పెళ్ళిచేసుకొన్నామని రఫీతో వచ్చిన కూతుర్ని గడప దాటకుండానే నానా తిట్లూ, శాపనార్థాలూ పెట్టి పంపివేసిన తల్లి ఆమె ఈ రోజు అక్క పిలిస్తే ఇంటికి వెళ్ళామని, అక్క పెట్టిన లడ్డు తిని వచ్చామని చెప్పిన బుజ్జినీ, రాజినీ 'ఈ సారి ఆ ఇంటి గడప దాటుతారా! దానింట్లో తింటారా?' అని, వాళ్ళను గొడ్డులా బాది 'మళ్ళీ వెళ్ళమమ్మా' అని వాళ్ళచేత అనిపించిన తల్లి ఆమె.

కూతుర్నీ, కూతురి సంసారాన్నీ చూడాలనిపించింది. నాలుగు గదులనూ ఆత్రుతగా కలియదిరిగి చూసింది. ఒక హైందవ స్త్రీ సంసారంలా, కూతురు అభిరుచుల కనుకుణంగా అమర్చుకొన్నట్టుగా ఉంది సంసారం. ఎక్కడా తురక ఛాయలు కనిపించలేదు. కిరణ్మయి నుదుట కుంకుమబొట్టు చూశాక కాంతమ్మ హృదయంనుంచి పెద్ద బరువేదో తొలగిపోయినట్టుంది

"రఫీ తలిదండ్రులు నిన్ను ఇంట్లోకి రానివ్వలేదా? వేరే కాపురం పెట్టారు?"

"రానివ్వలేదు వాళ్ళ మతాచారంగా ఏదో తంతు జరగాలన్నారు. రఫీ వ్యతిరేకించాడు. ఈ పెళ్ళి వాళ్లు ఆమోదించలేదు అందుకే వేరు కాపురం పెట్టాల్సి వచ్చింది!"

''సుఖంగా వున్నావా, కిరణ్మా?"

''ఎందుకమ్మా, నీ కీ సందేహం?"

''అతడి పద్ధతులూ, మన పద్ధతులూ..."

"నేనే అతడి మనిషినైపోయాక నాకు నా పద్ధతులంటూ వేరే ఏముంటాయమ్మా?" కిరణ్మయి నిండుగా నవ్వింది

''ప్రేమలకు, పెళ్ళిళ్లకు అడ్డందాని కులమతాలు, ఆచార వ్యవహారాలు ఇద్దరు మనుషులు కలిసి జీవిస్తే వస్తాయమ్మా! అందుకే అడిగాను.''

"మా మతం మానవత్వం! మాకు మరో మతం లేదు, అమ్మా!" రఫీ ప్రవేశించాడు.

"బాబూ, నా మీద కోపం లేదా?"

"మీరు దీవించినా, కోపించినా మీరు నాకు గురుపత్ని అమ్మా! ఆ గౌరవానికి ఏనాడూ లోపం జరుగదు. అన్యమతస్థుడిని. సాహసించి మీ అమ్మాయిని పాణిగ్రహణం చేసుకొన్నాను.

మీ మనసుకు కష్టంవేసి నన్ను తిట్టారు. నాకేం బాధలేదు. కాలం అందర్నీ మారుస్తుందన్న నమ్మకం నాకుంది. ఈ రోజు మీరొచ్చారు! రేపు మా తలిదండ్రులూ వస్తారు! మనందరం ఏక కుటుంబంగా బ్రతికే తరుణం తప్పకుండా వస్తుంది." ఆత్మవిశ్వాసం వ్యక్తం చేస్తూ అన్నాడు రఫీ. "అమ్మా మీకు కోపం రాదంటే నేను ఒక మాట అడగనా?"

''ఏమిటి, బాబూ?"

"నేను సాహసించి కిరణ్మయిని వివాహం చేసుకోకపోతే మీరు జన్మలో ఆమెకు పెళ్లంటూ చేసేవాళ్ళా?"

అతడి మాట ఎత్తి పొడుపుగా, తననూ తన దరిద్రాన్నీ అవమానించే దిగా ఉన్నా ఆ మాటలోని వాస్తవం ఆమెను ఉద్రేకపడనివ్వలేదు.

'నిజమే! కిరణ్మయికి ఈ జన్మలో రఫీలాంటి అందగాడినీ, ఉత్తముడినీ, విద్యాధికుడినీ తీసుకువచ్చి చేయగలి గేదా! రఫీలాంటివాడు కాకపోయినా అసలు పెళ్ళంటూ చేయగలిగేదా? ఈ రఫీ తురకాడై పుట్టకుండా తమ కులంలో పుడితే ఎంత బాగుండేది!'

రఫీ ప్రశ్నకు జవాబుగా కాంతమ్మ నిష్ఠుర స్వరంతో అంది. "నువ్వు కిరణు ఒక్కదాని గురించి ఆలోచించి మాట్లాడకు. బాబూ! ఆమెను నువ్వు పెళ్ళాడి ఆమె ఒక్కతి జీవితాన్నే రక్షించావు. నన్నూ, నా మిగతా పిల్ల లనూ వీధిలోకి ఈడ్చావ్! మీ పెళ్లి మా కుటుంబానికి ఎంత మచ్చ తెచ్చిందో నువ్వు గ్రహించడంలేదు. జీవితంలో మేము కిరణ్మయి చేసుకొన్న పెళ్లివల్ల ఎన్ని అవహేళనలు, ఎన్ని అవమానాలు ఎదుర్కోవలసి వుంటుందో నువ్వు ఊహిస్తే నువ్వు చేసిన పని నీకంత సంతృప్తిగా అనిపించేది కాదను కొంటాను."

"ఎవరమ్మా హేళన చేసేది? కిర ణ్మయి ఏం తప్పు చేసింది? ప్రేమించిన వాడిని పెళ్ళాడి ధైర్యంగా అతడితో ఒంటరిగా పయనించింది. ఆమెలాంటి సాహసం ప్రతీ ఆడపిల్లా చేయగలిగితే ఏ ఆడపిల్ల పెళ్లికీ వరకట్నంగానీ, దరిద్రంగానీ అడ్డుకాలేవు!"

"ఈ సంఘం ఒప్పదు, బాబూ, నువ్వు సహజమైనదిగా, సమంజసమైన దిగా సమర్థిస్తున్న మీ పెళ్ళి?"

"ఆకలి అయినవాడికి విస్తరివేసి అన్నం పెట్టని ఈ సంఘం, తనంత తాను విస్తరి వేసుకొని వడ్డించుకొన్న వాడిని విమర్శించే హక్కు లేదమ్మా! కిరణ్మయి పెళ్ళి పెటాకులు లేక వయ సుతో. కోరికలతో పోరాడుతున్నవేళ ఎక్కడ ఉందిందీ సంఘం? ఇప్పుడు నేనున్నానని వెక్కిరించడానికీ, నువ్వు చేసింది తప్పని చెప్పడానికీ దానికేమీ హక్కులేదు''

"హక్కు ఉందో లేదోగాని మనిషి సంఘజీవి, బాబూ! సంఘాన్ని కాదని బ్రతకలేడు. సంఘాన్ని కాదని బయ టికి వచ్చేసిన మీకు మా బాధలు అర్థం కావు. సంఘం మాకు పెట్టిపోతలు జరపకపోయినా దాని సానుభూతి కరు వౌతే బ్రతకలేం. మాకు సంఘం కావాలి. సంఘం సానుభూతి కావాలి.

"అయితే, కిరణ్మయి చేసిన పని ఈ తల్లి మనసుకు తప్పుగా కనిపించ లేదు. నేను నా చేతులతో పెళ్ళి పేరం టాలు జరపకపోయినా అది ఒక తోడును వెదుక్కొంది. పెళ్లి చేసుకొని ఓ ఇంటిదైంది. దీనివల్ల దాని సమస్య తీర్చుకొందో, సమస్యలనే తలకెత్తు కొందో—భవిష్యత్తు చెబుతుంది. దాని కష్ట సుఖాలకు అదే బాధ్యురాలవుతుంది "

"మీకే డబ్బుంది, మీ కులంలోనే యోగ్యుడైన వరుడికి ఆమెనిస్తే ఆమె జీవితం అంతా సుఖమయ మయ్యేదని గ్యారంటీ ఇవ్వగలరా! ఆమెకు సమస్య లనేవి ఉండేవికావా?"

"అప్పుడు ఆమెకు సంఘం సాను భూతి, బంధువుల ఆదరణ లభించేది, బాబూ! ఇప్పుడు మీరు సంఘాన్ని శత్రువుగా మార్చుకొన్నారు. బంధు వులు లేరు. మీ కష్టాలు, సమస్యలు మీ రొక్కరే తలకెత్తుకొని సాగిపోవాలి! ఈ వేడిలో, ఈ వలపు తొలిలో మీకెవరి లెక్కా లేకపోయినా తరువాత తరువాత మీకీ సంఘం అవసరం, విలువ తెలిసి వస్తాయి!"

"పరస్పరం మాకు విశ్వాసం, ప్రేమ చెదరనంతవరకు మేమీ సంఘాన్ని ఎదిరించి సుఖంగా బ్రతక గలమమ్మా! మీ కిరణు గురించి మీరేమీ బెంగపడకండి. పువ్వుల్లోపెట్టి పూజ చేయకపోయినా ఆమెను సుఖపెట్టడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను!"

"పీటమీద కూర్చో, కిరణూ! ఇంట్లో గుడికి వెడుతున్నానని చెప్పి ఇక్కడికి వచ్చాను. ఈ పేదతల్లి ఇంతకంటే ఎక్కువ ఇవ్వలేదు!" కిరణ్మయిని కూర్చోబెట్టి తనతో తెచ్చిన రెండు రవిక గుడ్డలు, రెండు పళ్ళు ఆమె చేతిలో పెట్టింది కాంతమ్మ.

కిరణ్మయి తల్లి పాదాలంటి నమస్క రించింది. రఫీకూడా అత్తగారికి పాదాభివందనంచేసి భార్య ప్రక్కన నిల్చున్నాడు.

ప్రక్క ప్రక్కనే నిల్చున్న ఆ జంటను తనివితీరా చూచుకొంది కాంతమ్మ.

"కలకాలం సుఖంగా వర్ధిల్లండి!"

సెలవు తీసుకొని వెళ్ళిపోతున్న తల్లిని కన్నీటి పొరలనుండి చూచింది కిరణ్మయి.

* * *

సాయంత్రం బడినుండి వచ్చేస్తూ "సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో

శ్రీరాములు పార్క్‌లో మీకోసం వేచి ఉంటాను" అని వ్రాసిన చీటీని సుందర్ చేతిలో పెట్టి వచ్చిన ఊర్మిళ ఆ వేళకు అక్కడ అతడికోసం నిరీక్షిస్తూ కూర్చొంది.

సరిగా ఆరు అవుతూంటే వచ్చాడు సుందర్. ఊర్మిళను చూస్తూనే చిరునవ్వుతో విచ్చుకొనే సుందర్ మోము ఈ మధ్య వారం పది రోజులుగా సీరియస్‌ని పులుముకొంది. సరిగా ఆమె కేసి చూడడంకూడా లేదు సుందర్ వస్తూనే ఓ దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. "నీ ఈ ఆహ్వానం ఓ పదిహేను రోజులక్రితం అంది ఉంటే నేను చాలా చాలా సంతోషించేవాడిని, ఊర్మిళా!"

"ఇప్పుడేమైంది?" ఊర్మిళ లోగొంతుకతో అడిగింది

"నువ్వు నన్నిక్కడికి పిలిచి ఏం అడగదలుచుకున్నావో నేనూహించగలను. ఇప్పుడు నువ్వా ఛాన్స్ పోగొట్టుకొన్నావ్!"

"ఛాన్స్ పోగొట్టుకొన్నానా? అదెలా?"

"మీ అక్క ఆ తురకవాడిని చేసుకోకపోతే మా ఇంట్లోవాళ్ళని ఒప్పించి నిన్ను వివాహం చేసుకొనేవాడిని! కాని, ఇప్పుడు లాభంలేదు నాలాంటి పరువుగల వాళ్ళెవ్వరూ నిన్నూ నీ ఇద్దరు చెల్లెళ్ళనీ వివాహం చేసుకోడానికి ముందుకు రారు. వస్తే గిస్తే మీ అక్క కొత్త చుట్టాలే రావాలి!"

"మా అక్క నాప దాటి చూపిపోయింది, సుందర్! ఆమె చూపిన దారినే వచ్చి మిమ్మల్ని పెళ్ళిచేసుకొమ్మని కోరుతున్నాను!"

"లాభంలేదు, ఊర్మిళా! నిన్నంటే భరించగలను గాని నీ ద్వారా వచ్చే అవహేళనలు భరించే శక్తి నాకు లేదు!"

"మా అక్క చేసింది తప్పే అయితే, ఆ తప్పుకు నే నెంతవరకు బాధ్యురాలిని."

"ఆ అక్కకు చెల్లెలు కావడమే నీ తప్పు!"

"సుందర్, నువ్వింత సంస్కారివా?"

"సంస్కారిని అవునో కాదో నీ ముందు నేను చాటుకోదలచలేదు. నాకు తలిదండ్రులూ, పరువూ మర్యాదా అన్నీ ఉన్నాయి అవన్నీ వదులుకొని నిన్ను కట్టుకోలేను ఒక తురకవాడికి తోడల్లుడిని కావటానికి నా మనస్సెంత మాత్రం అంగీకరించదు! వస్తాను... చివరగా నా దొక సలహా. మీ అక్కకు కబురు చెయ్యి తన మొగుడులాంటివాడిని వెదికిపెట్టగలదేమో!"

సుందర్ చరచరా వెళ్ళిపోయాడు.

కాళ్ళు బరువుగా ఈడుస్తూ ఇంటికి వచ్చిన ఊర్మిళకు తల్లి శోకాలు వినిపించాయి.




ఆ జ్యేష్ఠముండ నా కడుపున చిచ్చు పెట్టి పోయిందమ్మా! నా ఇంటి పరువు మంట గలిసి పోయిందమ్మా! ఆయన వచ్చి స్వర్గాన హాయిగా ఉన్నాడు. నాకు వచ్చాయి కదమ్మా ఈ తిప్పలు! నలుగుట్లో ముఖమెత్తుకోలేకుండా అయిందమ్మా!..."

ఊర్మిళకు కిరణ్మయిని తలుచుకుంటే చెప్పలేని కసిగా అనిపించింది. తన సుఖం తను చూచుకొని ఎందరి జీవితాల్లో చిచ్చు రగిల్చిపోయింది! రాజీ, పెద్దయ్యాక ఇదే సమస్యను ఎదురుకొని కుమిలిపోవాలా? భగవాన్! తన దారిన తను వెళ్ళిపోయే ముందు మా కింత విషమిస్తే ఎంత బాగుండేది!

'అక్కా! నువ్వు నాకు దారి చూపావను కొన్నాను. కాని నరకం చూపావ్ నేనూ నీలాంటి ద్రోహమే చేయబోయాను అమ్మకూ, చెల్లెళ్ళకూ! సుందర్ నా కంటి పొరలు తొలగించాడు నువ్వు త్రొక్కిన మరో దారి ఆడపిల్ల త్రొక్కకుండా నీ వెనకే మూసుకుపోవాలి. అది మరో ఆడపిల్లను భ్రమలో ముంచి ఇంటికి మచ్చ తెచ్చేది కాకూడదు!"

ఊర్మిళలో ఆ రోజునుండి విసుగు, అలసట దూరమయ్యాయి.

మరునాడు బడిలో, నవ్యోత్సాహంతో వెలిగిపోతున్న ఊర్మిళ ముఖాన్ని అప్పుడే కొత్తగా చూస్తున్నంత ఇదిగా చూశాడు సుందర్.

# [illegible]

పి.వి.రమణ

ఆరు నెలల అనుబంధంతో వారు వీ రైపోతారనే సూక్తి నాకూ చలపతికీ సంబంధించినంతవరకు ప్రశ్నార్థకంగానే మిగిలిపోయింది. దాదాపు సంవత్సరం పైబడి ఒకేచోట సన్నిహితంగా మేం కల్సిమెల్సి వున్నా అతని స్వభావం నాపై ప్రభావం చూపకపోవటమటుంచి అసలు చలపతి ఆంతర్యమే అంతుపట్ట కుండా వుండిపోయింది నాకు ఆ కాలే జీలో అధ్యాపకుడిగా నేను చేరేనాటికే చలపతి అధ్యాపక జీవితం అక్కడ పునాదుల్తో నిల్చిపోవటమేగాక, ఊడ లతో సహా బలపడిపోయింది.

బ్రతుకుతెరువుకోసం, అవసరంకొద్దీ ఈ అధ్యాపక వృత్తికి చలపతి తలొ గ్గినా, మనసా వాచా మాత్రం ఈ చిన్న పరిధిలో ఇమిడిపోవటానికి అతని ఆలోచనలు నిత్యం పోరుపెడుతూనే వుంటాయి. అట్లా అవి పోరుపెట్టి నప్పుడల్లా అశాంతితో, చికాకుతో ఆక్రో శించిపోతాడు చలపతి. అతని లోలోన మరగి మరగి సలపట పెట్టే ఆవేదనకు ముందుగా ఎరయ్యేది విద్యార్థులు. ఆ తర్వాత గురయ్యేది సాటి అధ్యాపకుల మైన మేము

విడ్డూరమేమంటే తన ఆలోచనలలో గుట్టుసు బహిరంగంగా ఏనాడూ బయట పెట్టే సాదా మనిషిగాదు చలపతి. రోజులు గడిచినకొద్దీ చలపతిలో మరో చలపతి వున్న విషయం కొద్ది కొద్దిగా అవగాహన కాసాగింది నాకు దీన్ని మరికొంత విశ్లేషం చేయాలంటే, తనకు లేనిదీ, తనకు అందనిదీ వేరెవ్వరూ ఏ పరిస్థితుల్లోనూ పొందరాదన్నదే ఈ మరో చలపతి మహదాశయం తన కలవాటైన నినాదాల వినోదంతో, వాదనా చమత్కృతితో ఎదుటివాళ్ళను అయస్కాంతంలా ఆకట్టుకొని ఔరా అన్పించుకొంటాడు బయటికన్పించే చలపతి. తానెంతో ఉదారుడుగానో, ఉన్నత భావకుడుగానో అవతార మెత్తు తాడు.

తనకంటే ఏ ఒకింత సంపాదన సాటివాళ్ళలో అధికమైనా, చివరకు



సహాధ్యాపకుల్లోనైనా సరే, చలపతి మనసు రేగిన పుండే అవుతుంది. హృదయం ఆకలిగొన్న పులే అవుతుంది. వెంటనే సాగలాగిన సమానత్వ తారక మంత్రం చలపతి నోటినుండి నయాగరా జలపాతమంత వేగంతో బయటకు వెళ్లుకొస్తుంది ఈ హెచ్చు తగ్గులు నశించాలి ఈ ఆర్థిక హెచ్చు తగ్గుల వల్లే సమాజం సర్వం భ్రష్టంమైపోతుందంటూ నిప్పులు కక్కుతాడు చలపతి ఏ ఇంక్రిమెంట్ రూపంలోనో, మరే విధంగానో తృణమో, ఫణమో అధికంగా చలపతి కొచ్చిన్నాడు, ఈ మంత్రాలూ, ఈ భ్రష్టమైపోవటాలూ ఏవీ గుర్తుకురావు చలపతికి ఈ వాదనలూ, వాపోవటాలూ, స్మరణకే రావు చలపతికి ఆ క్షణంలో ఎంతో సాధువుగా దర్శన మిస్తాడు

అడపా దడపా పత్రికలకు కథలు వ్రాసే ముకుందరావు మా కాలేజీలో మాతో మరొకడుగా జాయినయ్యాడు. అతని ఖర్మగాలి అతను జేరిన వారం

రోజులకే, అతని కథ ప్రచురింపబడ్డ పత్రిక మా స్టాఫ్ రూం జేరింది మా అందరి అభినందనల్ని ముకుందరావు మందహాసంతో రిసీవ్ చేసుకొంటున్న తరుణంలోనే, చలపతి మనసులోని పుండు తిరిగి సలపట పెట్టింది ఆ బాధకు తలొగ్గలేక అతన్నోరు బావురు మంది ముఖంలో చీదరింపు కమ్ముకొచ్చింది

"నేడు ప్రతొక్కడూ రచయితే, ఉత్తరం రాయటంకన్నా కథ రాయటం తేలికైంది అయినా నిలుస్తాయా చస్తాయా ఇవి ఏదో ఇంత రాయాలనీ, ఏదో ఇంత పుచ్చుకోవాలని దూలా యావా తప్ప" చలపతి చండ ప్రచండుడే అయ్యాడు ఈ విషాదానుభవంతో పాపం ముకుందరావు ముఖం సిగ్గుతో చితికిపోయింది

ఇది జరిగిన నాలుగైదు రోజులకే చలపతి గూడా ఓ కథలాటిది వ్రాసి నా వద్దకు పట్టుకొచ్చాడు.

"ఏమిటీ! మీరుగూడా కథ వ్రాశారా?"

"ఏం వ్రాయగూడదా?"

నా తొందరపాటుకు నాలుకొర్కుర్కున్నాను.

"నా ఉద్దేశ్య మదిగాదు..." గొణిగాను

"నీ ఉద్దేశ్యమేదైనా, నా మాటొకటి విను ఈ ప్రపంచంలో ప్రయత్నిస్తే సాధ్యంగానిదేదీలేదు పెద్ద ముకుందరావే ఏదో పొడిచేసి పుట్టలే ఆ మాత్రం నేనూ నాలుగు మాటల్ని అల్లగలను నీకు ముకుందరావు బాగా మచ్చికైనాడు గదా. ఇదీ అతనికి చూపెట్టి కాస్త సరిజూడమను ఏదో పత్రికకు పంపుదాం నే వస్తా మరి" అది ఆజ్ఞో, అర్థింపో అర్థంగానంత హడావిడిగా చెప్పి, అంతకన్నా వేగంగా వెనుదిరిగాడు చలపతి

ఎదుటివాడి బాధలు, బాధ్యతలు చలపతికి పూచిక పుల్లల్తో సమానం. తన బాధలు, బాధ్యతలు మాత్రం ఎటుటివాడు సహనంతో, సానుభూతితో వినాలి వినటమేగాదు, వాటిని హిమాలయ మంతటివిగా తలపోయాలి తలపోస్తేనే చాలదు చలపతికి ఆ బరువుతో నడుము లొంగిపోయి చలపతి ముందు కన్పించాలి అట్లా జరగనినాడు ఇహ స్టాఫ్ రూం అంతా చలపతికి రణభూమే అవుతుంది

ఈ మధ్యకాలంలో చలపతి కొన్ని కథలు గట్రా రచించాడు ఆ రచనల్లో సాహిత్య జిజ్ఞాసకన్నా, అతని ఆంతర్యానికీ, ఆచరణకు పచ్చి వ్యతిరేకమైన నినాదాల అరుపులే విన్పిస్తాయి తానేదో అభ్యుదయ వాదిగానూ, ఇతరులంచరూ ప్రగతి నిరోధకులన్నట్లు గానూ ప్రచారం చేసుకోటం గూడా ప్రారంభించాడు చలపతి ఈ ప్రచారా




లకు కేంద్రస్థానాలు క్లాస్ రూంలు కావటంలో పెద్ద చిక్కునే ఎదుర్కోవల్సి వచ్చింది మేము విద్యార్థుల దృష్టిలో చలపతి సర్వ సమానత్వ ఆశయ పురోగామి వాదిగానూ, మేము సంకుచిత స్వార్థ భావవాదులంగానూ కన్పించసాగాం అట్లా కన్పించేట్లు చేయటంలో చలపతి కృతకృత్యు డయ్యాడనటం సమంజసం ఈ సిద్ధాంత రాద్ధాంతాలతో విద్యార్థుల్లోగూడా చీలికలు కల్పించసాగాడు చలపతి దీనితో విద్యార్థుల్లో అంతకాలంగా వున్న సిన్సియారిటీ, క్రమశిక్షణ మాయమై వాటి స్థానాల్లో సిద్ధాంతాలు, వాటి తాలూకు వాగ్యుద్ధాలు ఆరంభమైనాయి ఒక్కోసారి క్లాసును కంట్రోల్ చేయటమే మా శక్తికి మించిన పనయ్యేది

"విద్యార్థుల విషయంలో మీరు చేస్తున్న పని సవ్యమైనదేనా?" చలపతిని ప్రశ్నించాను

చలపతి చిరునవ్వు నవ్వాడు.

"జీవితమంటే అంతేనోయి ఏదో హడావిడి, మరేదో నటన."

"మీ ఆదర్శాలు, సిద్ధాంతాలు మీతోనే వుంచుకోవచ్చుగా?"

"అప్పుడు మననిగూర్చి చెప్పుకొనేవాడెవడు? మనం ఏం చేశామని గాదు, మనం ఏంచెప్పాం అనే యుగమిది అర్థం చేసుకో" అంటూ వెళ్ళిపోయాడు చలపతి.

రాను రాను చలపతితో సాహచర్యం దుర్భర మన్నంతగా అతని పోకడ తయారైంది. ఏదో లక్ష్యంకోసం, మరేదో ఆశయంకోసం చలపతి ఈ శీతల యుద్ధం ప్రారంభించాడని భావించటం పొరపాటే; కారణం అతని యదార్థ జీవితం నాకు తెల్సిందే గనుక. ఒకటి రెండుసార్లు చలపతి ఇంటికి వెళ్ళాల్సి వచ్చింది. ఆ ఇల్లు, ఆ వాతావరణం చూసిం తర్వాత నా అభిప్రాయంలో ఏమీ వక్రత లేదన్పించింది. సామాన్యుని ఆశలకలనిగాని ఖరీదైన అలంకరణలు; ఆహార వ్యవహారాలు; భార్య ఒంటినిండా నగలు; చలపతి విలాస జీవితం ఇవ్వన్నీ చలపతి గొంతు చించుకొనే సర్వ సమానత్వ నినాదాలను బలపర్చేవిగానే భావించాలా?

పాము తన రెండు పాయల నాలుకను పేవలకూ ఆవలకూ ఆడించటం మనసులోకొచ్చి, వణుకు పుట్టేది నాకు చలపతి కన్పించినపుడల్లా. తీగలతో అల్లుకొనిపోయిన చెట్ల గుబురుల మధ్య కొండచిలువను జూసినట్లు గగుర్పాటు కలిగేది. చలపతితో సహచర్యం నిద్రంగా వున్న కొండ పార్శ్వాన కునుకు తీయటంలాటిదే నన్న అనుభవం నన్ను హెచ్చరిస్తూ వుండేది.

చలపతి విశ్వరూప సాక్షాత్కారంలో కలికి తురాయిలాటి మరో ఉదాహరణను జతచేస్తే గాని ఆ రూపానికి పరిపూర్ణత సిద్ధించదు. రామనాథంగారు మా స్టాఫ్ మెంబరు. రిటైరయ్యే ముందే ఆయన అకస్మాత్తుగా కన్ను మూశారు. ఆయన కన్ను మూసింతర్వాత ఎగ్జామినర్‌గా ఎపాయింట్ అయినట్లు ఇంటిమేషన్ వచ్చింది. పెద్ద కుటుంబంతో తల్లడిల్లిపోయిన ఆయన తనదంటూ ఏమీ మిగల్చకుండానే వెళ్ళిపోవటంతో ఆ కుటుంబం దిక్కులేనిదైంది. మా స్టాఫ్ అంతా ఒక నిర్ణయాని కొచ్చాం. రామనాథంగారికి ఎలాట్ అయ్యే ఆన్సర్ స్క్రిప్ట్సును మేం వాల్యూవేసి, ఆ వచ్చే రెమ్యూనరేషన్‌ను ఆయన కుటుంబానికి సమర్పించుకోవాలని తీర్మానించుకొన్నాం. ఈ విషయంలో యూనివర్శిటీవారి అనుమతి లభించేట్లు ప్రయత్నించమని ప్రిన్సిపాల్‌ను అర్థించాం.

మా ప్రయత్నా లిట్లా వున్న తరుణంలోనే రామనాథంగారి ఎలాట్‌మెంట్ పేపర్సును చలపతి తన పేరుమీద మార్పించుకొన్నాడు. కరెక్షన్‌గూడా పూర్తిజేశాడు. మేమంతా ఉసూరుమన్నాం. చలపతి ధన దాహానికి జుగుప్సగూడా కల్గింది. ఆ తర్వాత చలపతి కన్పించినపు డడిగాను ఈ విషయం గూర్చి.

"నాకు మాత్రం డబ్బు చేదా?" చిరునవ్వుతో అన్నాడు చలపతి, మరో



సారి నాలుక పాయల్ని అటూ ఇటూ ఆడించే పాము మదిలో మెదిలి వణుకు పుట్టింది నాకు. అతిలౌక్యంతో, వినాదాల వినోదంతో ప్రజల అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని ఈ విధంగా ఎక్స్ప్లాయిడ్ చేసి కమర్షియల్ చేసికోటం మహా దారుణ మన్పించింది.

మనుషుల్ని తినే పులులను మట్టు పెట్టటానికి ప్రభుత్వం వేటగాండ్రని ఆహ్వానిస్తుంది. ఆ ప్రాంతంలో "పులి తిరుగుచోటు - హెచ్చరిక" అని బోర్డు కట్టిస్తుంది. ఇతరుల సహనాన్ని, సహృద్భావాన్ని నంజుకు తినే చలపతి లాటి వాళ్ళల్లో బయటక్కన్పించని మరో భయంకర రూపాన్ని పట్టుకునేందుకు తగిన సాధనాల్ని ఎంత త్వరగా కనిపెడితే అంత మంచిదేమో.

దాదాపు సంవత్సరం పైబడి మేం కల్సిమెల్సి వున్నా మా ఇద్దరి భావ స్వభావాలు పరస్పరం ఏ ఒక్కరిమీద ఏమాత్రం ప్రభావం చూపించకపోవటమే నా కిప్పటికీ కొంత ఆశ్చర్యాన్ని కల్గిస్తుంటుంది. ఆ వైరుధ్య మట్లా వుండిపోవటమే నా అదృష్టమేమో మరి.

---

# హక్కులకోసం పోరాడిన పార్వతి

(గల్పిక)

నన్ను గుర్తించలేదా? నేను "నేటి స్త్రీ" అనే సినిమాలో హీరోయిన్‌ను

సరిగా చెప్పారు. నేను ఆదర్శ మహిళకు ప్రతీకగా సృష్టి అయి, అంతర్జాతీయ మహిళాసంవత్సరానికి నా శక్తికొద్దీ న్యాయం చేశాను

సినిమా చూస్తే నా ఆశయాలు మీకు సరిగా అర్థం కాలేదా? చిత్రంగా ఉందే నా భర్త తాగుబోతు, వ్యభిచారి. స్త్రీలంటే చాలా తేలికభావం కలవాడు అతనిచేత మనిషిగా చూడబడాలన్నది నా ఆదర్శంగా పెట్టుకున్నాను బూటు కాలితో తంతే అతనికేసి ఆశ్చర్యంగా చూశాను అతను భోజనానికి ఇంటికి రాకపోతే, నా తక్కువతనం ఏమీ లేదని రుజువు చేసుకోవటానికి నేనూ తిండి మానేసి, వంటింట్లోనే కొంగు పరుచుకుని నిద్ర పోయాను. అతను సుష్టుగా తాగి, అంతకన్న సుష్టుగా తిని, రాత్రంతా అమ్మాయిలతో గడిపి నాకన్నా ఎంత హీనుడో రుజువుచేసుకున్నాడు

నాతో ఆయన ఒక్క దయగల మాట మాట్లాడితే అతనికి బానిసగా ఉండటానికి సిద్ధపడ్డట్టు కనిపించానా? అవును లేకపోతే అతను ఆ ఒక్క దయగల మాటకూడా ఆడటానికి సిద్ధంకాలేదని మీ ప్రేక్షకులకు ఎలా తెలిసేదండీ? చెప్పరేం?

ఆ చిత్రంలో మగవాడి హీనతా, ఆడదాని గొప్పతనమా, ఏది స్పష్టమయిందంటారు? చంపేశారు? అదే నాకు కూడా అనుమానంగా ఉంది సుమండీ!

**కొడవటిగంటి కుటుంబరావు**




మర్నాడు రాత్రి మంత్రికుమార్తె తిరిగి కథ ఇలా కొనసాగించింది.

ముసలిది హసన్‌కు స్పృహ తెప్పించి, "నీకేమయింది ?" అని అడిగింది.

"అల్లా, నేనేం చూశాను ! రాణి నా భార్య అయినా కావాలి, లేదా అచ్చగా ఆమెకు ప్రతిరూపమైనా కావాలి," అన్నాడు హసన్.

ఈ మాటలకు రాణి విరగబడి నవ్వి "ఇతనికి మతి చెడిపోయింది. నేను తన భార్య నంటున్నాడు ... చూడు, అబ్బీ! నాకూ, నీ భార్యకూ ఏం పోలిక కనిపెట్టావు?" అని అడిగింది.

"మహారాణీ, నీకూ నా భార్యకూ అన్నివిధాలా పోలిక ఉన్నది. అయితే మీ ఇద్దరి మధ్యా తేడా లేకపోలేదు. అది ప్రేమించినవాడి కంటికే తెలుస్తుంది. కాని ప్రేమించినవాడి నాలుక దాన్ని వివరించలేదు", అన్నాడు హసన్.

హసన్ తనను ప్రేమించాడని రాజకుమార్తె గ్రహించి, అతన్ని ద్వేషించ

సాగించింది. తన తండ్రి ఆజ్ఞను ఉల్లంఘించి, తన చెల్లెళ్ళలో ఒకతె ఇతన్ని పెళ్ళాడింది. అది ఎవరో తెలుసుకోవాలని ఆమె నిర్ణయించుకున్నది. ఆ తరవాత ఇద్దరిమీదా పగ తీర్చుకో వచ్చు.

ఆమె ముసలిదానితో, "నువు మిగిలిన ఆరు దీవులకూ వెళ్ళి, నా ఆరుగురు చెల్లెళ్ళనూ పిలుచుకురా. నేను వాళ్ళను చూసి రెండేళ్లు దాటింది. వాళ్ళకోసం తపించిపోతున్నానని చెప్పు. వాళ్ళను నువు దగ్గిర ఉండి వెంటపెట్టుకురా. ఇక్కడ జరిగినదేమీ వాళ్లకు చెప్పకు సుమా!" అన్నది.

ఆమె ఉద్దేశం తెలియని ముసలిది ఒక్కొక్క దీవికీ వెళ్ళి, ఒక్కొక్క రాజకుమార్తెనూ తన వెంట రావటానికి ఒప్పించింది. ఇలా అయిదుగురు రాజకుమార్తెలు ఒప్పుకున్నారు. కాని తన తండ్రివద్దనే ఉంటున్న ఆఖరు రాజకుమార్తె ఒకంతట ఒప్పుకోలేదు. దానికి కారణం మరెవరో కాదు, ఆమె తండ్రే. ఆమె ఆయనతో, "నేను పెద్దక్కను చూడబోతాను," అనగానే ఆయన, "అమ్మా నువు రాజభవనం దాటి వెళితే మళ్ళీ తిరిగి రావని నాకు భయంగా ఉంది. నాకు కిందటి రాత్రి ఒక భయంకరమైన కల వచ్చింది", అంటూ ఆ కల గురించి చెప్పాడు.

కలలో ఆయన తన సంపదను చూసి మురిసిపోతూంటే ఏడు మేలి రత్నాలు ఆయన దృష్టిని ఆకర్షించాయి. అన్నిటిలోకీ చిన్నది అన్నిటికన్నా అందంగానూ, ఆకర్షవంతంగానూ ఉన్నది. ఆయన దాన్ని తీసుకుని; తన రొమ్ముకు హత్తుకుని, కోశాగారం నుంచి అవతలికి వెళ్ళాడు. దాన్ని ఆయన ఎండలో చూసి ఆనందిస్తూండగా, ఒక వింతపక్షి వచ్చి ఆయన చేతిలోని మణిని తన్నుకుపోయింది. ఆయన ఏడుస్తూ నిద్రలేచాడు.

తరవాత స్వప్నఫలాలు చెప్పేవాడికి ఈ కలగురించి చెబితే, అతను, "మహారాజా, ఆ ఏడు మణులూ మీ కుమార్తెలు. అందరిలోకీ చిన్నది మీకు కాకుండా పోతుంది", అన్నాడు.

రోష్ని తన తండ్రితో, "వెళ్ళకపోవటం బాగుండదు నాన్నా. పెద్దక్క మాకోసం విందులూ, వినోదాలూ ఏర్పాటుచేసింది. ఆమెను చూడాలని రెండేళ్ళుగా అనుకుంటున్నాను. వెళ్లకపోతే అక్కకు కోపం వస్తుంది. నువు అనవసరంగా భయపడుతున్నావు. ఆ మధ్య నేను కొంతకాలం కనిపించకపోతే నేను పోయానని నువు బెంగపడ్డావు. కాని నేను తిరిగి వచ్చాను కానా. అప్పుడంటే నేను మన దీవులు దాటి వెళ్లాను గనక నువు భయపడడం కొంతవరకు సమంజసమే. ఇప్పుడు మన దీవుల

లోపల నాకేం ఆపద జరుగుతుంది?" అన్నది.

ఇంతగా చెప్పినాక, ఆమె కొద్ది రోజులలో తిరిగివచ్చే షరతుమీద తన చిన్నకూతురు వెళ్ళటానికి భూతాల రాజు ఒప్పుకున్నాడు. రోష్నీ తన తండ్రివద్ద సెలవు తీసుకుని, తన బిడ్డలు రహస్యంగా ఇద్దరు బానిసల సంరక్షణలో ఉంటున్న చోటికి వెళ్లి, వాళ్లను ముద్దుపెట్టుకుని, ముసలిదాని వెంట తన పెద్ద అక్క ఉండే దీవికి బయలుదేరింది.

తన చెల్లెళ్లు వచ్చే సమయానికి పెద్దక్క ఎర్రపట్టు దుస్తులు ధరించి, తనకున్న నగలన్నీ దిగవేసుకుని తన సింహాసనంమీద కూర్చున్నది. ఆమెకు ఎదురుగా హసన్ నిలబడి ఉన్నాడు. స్త్రీలు కత్తులుదూసీ, ఈటెలు పట్టుకునీ అతనికి కాపలా ఉన్నారు.

ఆమె ఆజ్ఞప్రకారం ముసలిది మొట్ట మొదటగా రెండో రాజకుమార్తెను ఆమె సన్నిధికి పంపింది. ఆమె తన పెద్ద చెల్లెలికి ఆదరంగా స్వాగతం చెప్పి తన పక్కన కూర్చోబెట్టుకుని, హసన్‌కేసి తిరిగి, 'మానవుడా నీ భార్య ఈమేనా? అని అడిగింది

హసన్ ఆమె సౌందర్యాన్ని కొని యాడుతూ కవిత్వం చెప్పి, 'ఈమెకూ, నా భార్యకూ ఉన్న తేడా నేను చెప్ప లేను, అన్నాడు

తరవాత మూడవ రాజకుమార్తె లోపలికి వచ్చింది ఆమె కూడా తన భార్య కాదని హసన్ స్పష్టంచేశాడు ఇలా ఒక్కొక్కరే లోపలికి వచ్చినప్పు డల్లా వారి అందచందాలను గురించి హసన్ ఆశుకవిత్వం చెప్పి, రాణీని ఆశ్చర్యపరిచాడు.

చిట్టచివరకు అందరికన్న ఆఖరుది, రోష్నీ లోపలికి వచ్చింది. ఆమెను చూస్తూనే హసన్ గట్టిగా అరిచి, స్పృహతప్పి పడిపోయాడు. రోష్నీ కూడా తన భర్త కంఠధ్వని వింటూనే తానుకూడా మూర్ఛపోయింది.

పెద్దరాజకుమార్తె తన ఈర్ష్యను ఇంకేమాత్రమూ నిగ్రహించుకోలేక, "ఆ మనిషిని పట్టుకుపోయి నగరం బయట పారెయ్యండి!" అని నౌకర్లను ఆజ్ఞాపించింది.

రోష్నీకి స్పృహ తెలియగానే ఆమెను ఆమె పెద్దక్క, "నీకూ, ఈ మనుష్య మాత్రుడికీ ఏమిటి సంబంధం? హీను రాలా, నీ తండ్రి అనుమతి లేకుండా పెళ్ళాడటం కాక, నీ భర్తను వదిలేసి తప్పుమీద తప్పు చేస్తావా? నీ జాతికి నువు చేసిన ద్రోహం రక్తంతోగాని శుద్ధి కాదు, అని నౌకర్లతో "ఈమెను నిచ్చెనకు జుట్టుతో అంటగట్టి, రక్తం కారేదాకా కొట్టండి! అన్నది

తరవాత ఆమె తన తండ్రికి ఒక ఉత్తరం రాస్తూ, అందులో తాను

హసన్‌కూ, తన కడగొట్టు చెల్లెలికీ ఇవ్వదలచిన శిక్షలను వివరించి, ఆయన నిర్ణయాన్ని వెంటనే తెలుపవలసిందిగా కోరుతూ, ఆ లేఖను క్షణాలమీద తండ్రికి పంపింది.

ఆ ఉత్తరం చదవగానే రాజుకు చీకట్లు కమ్మాయి. ఆ తప్పుకు ఎంత శిక్ష అయినా తేలికేననీ, మరణదండన ఏ విధంగా అమలుజరపాలో ఆమెనే నిర్ణయించుకోమనీ ఆయన జవాబు పంపాడు.

హసన్‌కు స్పృహ వచ్చేసరికి అతను సముద్రతీరాన ఉన్నాడు. తన దుస్థితి తలుచుకుని అతను దుఃఖించాడు. అతనికి ఏ ఆశా మిగలలేదు. ఈ దీవులనుంచి అతను తప్పించుకు పోలేడు.

అయినా అతనిలో ఆశ చావలేదు. తాను స్పృహతప్పి ఉన్న సమయంలో ఏం జరిగినదీ, తాను సముద్రతీరానికి ఎలా వచ్చినదీ తెలుసుకోవాలని అతనికి అనిపించింది. ఇలా అనుకుంటూ తీరాన పోతూండగా ఇద్దరు ఆడ సిపాయిలు ఒకచోట ఒక తోలు కుళాయి కోసం ఘర్షణపడుతూ కనిపించారు. వారి వయసు పన్నెండేళ్ళు.

హసన్ వారిని సమీపించి, విడదీసి, ఎందుకు పోట్లాడుకుంటున్నారని అడిగాడు ఆ కుళాయికోసమని వాళ్ళు చెప్పారు

నేను రాయి విసురుతాను. కుళాయి నా కియ్యండి. మీ ఇద్దరిలో ఆ రాయి ఎవరు తెస్తే వాళ్ళకు కుళాయి ఇస్తాను," అన్నాడు. వాళ్ళు సరేనన్నారు. అతను ఒకరాయి దూరంగా విసిరి, కుళాయి నెత్తిన పెట్టుకుని అక్కడే నిలబడ్డాడు. కొంచెంసేపటికి ఒక పిల్ల రాయితో తిరిగి వచ్చి, "నేనే గెలిచాను. మనిషీ, నువ్వెక్కడ ఉన్నావు?" అన్నది. ఇంతలో రెండో పిల్ల కూడా వచ్చింది. ఇద్దరూ హసన్ కోసం వెతకసాగారు.

"వాళ్ళకు కళ్ళున్నాయి గదా, నేను వాళ్ళ కెందుకు కనబడటంలేదు?" అనుకుని హసన్, "ఇక్కడే ఉన్నాను," అన్నాడు గట్టిగా. ఆ మాటలు వచ్చిన దిక్కుగా చూసి, ఏమీ కనబడక, ఆ పిల్లలిద్దరూ భయంతో ఏడవసాగారు.

హసన్ వాళ్ళ భుజాలు తట్టి, "నేనిక్కడే ఉన్నాను. మీ రెందు కేడుస్తున్నారు?" అన్నాడు. ఈ మాటలకు పిల్లలు మరింత హడలిపోయి పారిపోయారు.

ఆ కుళాయి తనను కనపడకుండా చేసినట్టు హసన్‌కు రూఢి అయింది. అతను తన భార్యను రహస్యంగా వెళ్ళి చూడవచ్చు ననుకున్నాడు. అతను నగరంలో ప్రవేశించి, రాజభవనంలో ముసలిదానికోసం వెతికాడు ఆమె ఒకచోట గొలుసులతో కట్టబడి ఉన్నది




ఆ గదిలోనే ఒక అరలో అనేక పింగాణీ జాడీలు ఉన్నాయి. హసన్ అందులో ఒకటి ఎత్తి నేలకేసి కొట్టి ఫటామని పగలగొట్టాడు. ముసలిది హడలిపోయి, "ఓ పిశాచమా, నువ్వు ఎవరు?" అని అరిచింది.

"నేను పిశాచాన్ని కాను. బస్రా నివాసి హసన్‌ను. నిన్ను విడిపించ టానికి వచ్చాను" అంటూ అతను తన నెత్తిమీదనుంచి కుళాయితీసి, ఆమె ఎదట ప్రత్యక్షమయాడు.

"అయ్యో, హసన్; రాణి నిన్ను చంపెయ్యనందుకు పశ్చాత్తాపపడి, నీ కోసం సిపాయిలను పంపింది. పారిపో! ఆలస్యం ఏమాత్రమూ చెయ్యకు," అని ముసలిది రోష్నీకి జరగనున్న శిక్ష గురించి కూడా చెప్పింది

"అల్లా ఆమెను కాపాడతాడు. మనం దరినీ కాపాడతాడు. ఈ మంత్రపు కుళాయితో అదృశ్యంగా ఎక్కడికైనా వెళ్ళగలను, అని హసన్ ముసలిదాన్ని బంధ విముక్తురాలిని చేసి, నెత్తిన కుళాయి పెట్టుకుని, ఆమె చెయ్యి పట్టు కున్నాడు. ఇద్దరూ కనపడకుండా పోయారు. ముసలిది అతనికి తోవ చూపుతూ, రోష్నీ నిచ్చెనకు కట్టి ఉండి, చిత్రవధకు గురికానున్న చోటికి తీసుకు పోయింది.

హసన్ ఆమెను సమీపించి, కుళాయి తీసేసి, ఆమెను ఆలింగనంచేసుకున్నాడు అతన్ని చూడగానే ఆమె అతని వక్షం మీద స్పృహతప్పి పడిపోయింది. అతను ఆమె బంధాలు విడగొట్టి, ఆమెకు శైత్యోపచారాలు చేశాడు

నువు ఎందుకు వచ్చావు? మా అక్క పరమ కర్కోటకురాలు," అన్నదామె తన భర్తతో.

"నిన్ను బాగ్దాదు తీసుకుపోవటానికి వచ్చాను. నువ్వూ, నేనూ, ఈ ముసలిదీ ఇక్కడినుంచి, ఈ మంత్రపు కుళాయితో తప్పించుకుపోబోతున్నాం," అన్నాడు హసన్.

రోష్నీకి ఆనందమూ, పశ్చాత్తాపమూ కూడా కలిగాయి. "నా మూలానే ఇన్ని పాట్లు కలిగాయి. నీతో చెప్పకుండా బాగ్దాదునుంచి వచ్చేశాను. భర్తకు భార్య చూపవలసిన మర్యాద నేను చూపలేదు," అన్నదామె.

"నిన్ను ఒంటరిగా బాగ్దాదులో వదలటం నాదే తప్పు. నిన్ను నా వెంట తీసుకుపోయి ఉండవలిసింది", అన్నాడు హసన్.

అతను తన భార్యను వీపుమీదికి ఎత్తుకుని, ముసలిదాని చెయ్యి పట్టుకుని కుళాయి నెత్తిన పెట్టుకున్నాడు ముగ్గురూ అదృశ్యమయారు వాళ్లు రాజభవనంనుంచి బయలుదేరి, ఏడో దీవికి వెళ్ళారు. నాసిర్, మన్సూర్‌లు అక్కడ రహస్యంగా ఉంటున్నారు. ముసలిది పిల్లల నిద్దరినీ ఎత్తుకున్నది. రోష్నీ మంత్రపు కుళాయి సహాయంతో మూడు ఈకల దుస్తులు సంగ్రహించి తెచ్చింది. ముగ్గురూ మూడు దుస్తులూ ధరించి, వక్–వక్ దీవులను శాశ్వతంగా వదిలిపెట్టేశారు. వాళ్లు చిన్న చిన్న అంచెలలో ఎగురుతూ చివరకు బాగ్దాదు చేరుకున్నారు. వాళ్లు హసన్ ఇంటి పై భాగాన దిగి, మెట్లమీదుగా హసన్ తల్లి శోకసముద్రంలో మునిగిఉన్న చోటికి చేరారు.

అంతటితో హసన్ కష్టాలు తీరిపోయాయి. అతను తన తల్లితోనూ, భార్యతోనూ, పిల్లలతోనూ, తనకు ఎంతో సహాయంచేసిన ముసలి సైనికురాలితోనూ సుఖంగా జీవించాడు.

(అయిపోయింది)



# అమృతం మరిచిన రాత్రి

— శర్వరి

అమృతను చూచినప్పుడల్లా నాకు ప్రేమకు నిర్వచనం దొరుకుతుంది. ఆమె కథ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా కళ్ళలో నీరుబికి, గుండె బరువెక్కుతుంది. "ఛీ... ప్రేమించపోతేనేం" అనిపిస్తుంది కాని అమృతలాంటి ఆడపిల్ల కనిపిస్తే, తటస్థపడితే ప్రేమించాలనిపిస్తుంది. ఈ లోకంలో అమృతలు చాలామంది ఉన్నారు. కానీ నేనెరిగిన అమృతం, ఆమెలోనే దొరుకుతుంది. ఆమె నాకు దొరుకుతుందో లేదో, ఆ అమృతం నేను అనుభవించగలనో లేనో ఎప్పటికీ చెప్పలేను.

ప్రేమకు పర్యాయపదం అమృతం.

ప్రేమకు నిర్వచనం అమృతం

ఆమెను నేను ప్రేమించలేదేమో !

కానీ ఆరాధించాను, ఇంకా, యింకా ఆరాధిస్తూనే వున్నాను. ఆమెను కాదు అమృత హృదయాన్ని.

ఆరాధించడం ప్రేమ అయితే నేను ఆమెను ప్రేమిస్తున్నట్లే అవుతుంది. అలా అని చెప్పుకోడానికి నేను సిగ్గుపడను. అమృతను చూసినవారు ఎవరూ సిగ్గుపడరు. ఆమెకోసం అన్వేషిస్తారు.

అమృత ఎవరంటారా ?

ఎవరని చెప్పను !

నా కథలలో కనిపించే ప్రేమకు అమృతత్వాన్ని ప్రసాదించిన జవ్వని అమృతం.

జలజను చూచినప్పుడల్లా అమృతం జ్ఞాపకం వస్తుంది.

అమృతం కన్నబిడ్డ జలజ.

పోతూ పోతూ స్నేహితురాలని, మా శ్రీమతికి కానుకగా యిచ్చి వెళ్ళింది. జలజకు ఇప్పుడు అయిదేళ్ళు... అమృత ఫొటో మా ఇంట్లో, రూపం నా హృదయంలో వుంది. మా అబ్బాయికి జలజ అంటే మహా యిష్టం. వాడికి పదేళ్లు... పసివాళ్ళకు ఇష్టాలేమిటని తీసివేయకండి.

అమృతం, మా శ్రీమతి బాల్య మిత్రులు. అయిదేళ్ళ అమృతం ఎంతో ముద్దుగా వుండేది. కుందనపు బొమ్మలా వుండేది. గౌను తొడుక్కొని, గిరగిరా తిరుగుతుండేది. తల్లిదండ్రులకు ఒక్కటే బిడ్డ కావడాన గారాబం మరీ ఎక్కువ.

ఆ రోజు అమృతం పుట్టినరోజు. పండుగ ఘనంగా ఏర్పాటైంది. సంపన్నులు కావడాన, ఇరుగు పొరుగు పిల్లల్ని, ఆడవారినీ పేరంటానికి పిలిచారు. ఖరీదైన పార్టీ ఏర్పాటు చేశారు. వచ్చినవారందరూ భాగ్యవంతులే! కార్లలో వచ్చినవారే! ఖరీదైన జీవితాన్ని అనుభవించేవారు. అందరిలోనూ సంతోషం ఉరకలువేస్తున్నది. వారిలో కలవనివాడు రాధాకృష్ణ. ఓ మూలగా, చివరగా బిక్కు బిక్కుమంటూ నిలబడ్డాడు. అంత డబ్బుగలవాడు కాదేమో, వారిలో ఏరినట్లు, బెరుగ్గావున్నాడు. తొమ్మిదేళ్ళు వుంటాయి.

"అమ్మగారు రాలేదా బాబూ?" అమృత అమ్మగారు అడిగారు.

"అమ్మకు జ్వరమండీ! రాలేనన్నది." సమాధానం చెప్పాడు.

"అమూ! బాబును తీసుకువెళ్ళు..." అంటూ ఆమె కూతుర్ని పిలిచి పరిచయం చేసింది.

అయిదేళ్ళ అమృతం అయిదునిముషాలు అతని కళ్ళలోకి నిదానించి చూసింది. తలదించుకుంది.

"రా! పోదాం" అతని చెయి పుచ్చుకుని లోపలకు దారితీసింది.

"నీపేరేంటి ?" తనే ప్రశ్నించింది.

"రాధ" అన్నాడు.

"ఛీ... ఆడపేరు" నవ్వింది. కిలకిలా, గలగలా నవ్వింది.

సిగ్గుపడిపోయాడు "రాధ కాదు..రాధాకృష్ణ...మా ఇంట్లో 'రాధా' అంటారు" అని సంజాయిషీ యిచ్చుకున్నాడు.

"అలా చెప్పవేం! 'కృష్ణ' పేరే బావుంది. నేను కృష్ణా అంటాను. నాపేరు 'అమృతం'. నువ్వు 'అమూ' అను చాలు" పరిచయం చేసుకుంది.

ఆ అమ్మాయివెంట నడవడం గర్వంగావుంది రాధాకృష్ణకు. ఏమిటో తనకు తెలియని గొప్పతనాన్ని ఆపాదించుకున్నాడు ఆ క్షణంలో.

ఆ రోజునుండి అమృతం కృష్ణకు తోడునీడైంది. అతను ఎక్కడుంటే అక్కడకు పరుగుతీసేది. అతను ప్రక్కన లేకపోతే అన్నం తినేదికాదు. రెండు కుటుంబాలకు మధ్య, పిల్లలు కారణంగా ఆత్మీయత ఎక్కువైంది. అలాగే రాధాకృష్ణకు ఎంతమంది మగపిల్లలు స్నేహితులున్నా, అమృతానికిచ్చిన ప్రాధాన్యత యిచ్చేవాడు కాదు. ఒక్కరోజు ఆ అమ్మాయిని చూడకపోతే, ఆమెతో మాట్లాడకపోతే పిచ్చి పట్టినట్లుండేది.

పసివయసులో పెనవేసుకున్న అను



బంధాలు అలాగేవుంటాయి
స్నేహంలో కల్మషం ఉండదు
ప్రేమలో మాలిన్యం ఉండదు. పసి
తనంలో ప్రేమలు పెంచుకున్నవారు,

ఆ పెద్దవారైనా, ఆ మమతల్ని చంపుకో
ఆ లేరు వారి జీవితాలే కథావస్తువులు
అవుతుంటాయి.
ఆ చిన్న వయసులో మగపిల్లలు

జట్టు, ఆడపిల్లలు జట్టుగా తిరుగుతారు ఏ ఆడపిల్ల, మగపిల్లవానితోగానీ, అబ్బాయి, అమ్మాయితోగాని స్నేహం చేయడం అంటూ జరిగితే అది విచిత్రమే అవుతుంది. అది చివరకు చిలవలు, పల వలు తొడుక్కుంటుంది. వయస్సుతో పాటు అమృత, కృష్ణల అనురాగం ముదిరింది. అది అతిసుందరంగా పెరిగి, దట్టంగా అల్లుకుపోయింది. వారి మైత్రికి హద్దులులేవు.

అమృతం స్కూల్‌ఫైనల్ చదువు తున్న సంవత్సరం అది. వయస్సు తెచ్చిన మార్పులు, పలపుల్ని రేపు తున్నది. ఒకనాడు కృష్ణ, అమృతం ఒంటరిగా గదిలోవున్నప్పుడు, చాపల్యం కొద్దీ, ఆమెను దగ్గరగా తీసుకుని కౌగ లించుకున్నాడు. అప్పుడు రాధాకృష్ణ బి.ఎ. చివరిసంవత్సరం చదువు తున్నాడు. అలాగ అమృతను కౌగ లించుకోవాలని ఎంతకాలంగానో కోరి కగా ఉంది. ఆ కోర్కెను అణచుకుంటూ వచ్చాడు. అవకాశం రాకకాదు, ధైర్యం చాలక. ఈసారి ధైర్యంచేశాడు. అమృతం ఏమీ అనదని ధీమా. కౌగి లించుకోవడంలో ఏదో ఆనందం వుందనీ, థ్రిల్‌వుందనీ అనుకున్నాడు. అమృత అతని కౌగిలిలో ఒదిగిపోయి. ప్రోత్సహించింది, ఆ క్షణంలో.

కొన్నిక్షణాలు ఇద్దరిలోనూ పర వశం కలిగింది. మత్తూ ఆవరించింది. ఏదో ఉద్వేగం ఇద్దరికీ ఒకే కోరిక ధైర్యం లేకపోయినా, దక్కవల సింది చేతికి అందకుండా పోతున్నదనే బాధ. మరొకసారి కృష్ణ, అమృతను కౌగిలించుకుని, గడ్డంక్రింద చేయిపెట్టి, మొహం పైకెత్తి పెదాలపై ముద్దుపెట్టు కున్నాడు. అతనికి చెమట్లుపోశాయి

అమృత నవ్వింది. చిలిపిగా,తియ్యగా నవ్వి, "పిరికి ! అంత భయమేం ! ఎవ రున్నారని" అని అతని భయం పోగొట్టి ముద్దుపెట్టుకోవడం ఎలాగో నేర్పింది అతని మెడమీద చేయివేసి, అతని చేతుల్ని తన న[illegible] తిప్పి, గట్టిగా పెనవేసుకుపో[illegible]లు పెదా లకు అందించి కళ్ళు మూసుకుంది.

ఆ కౌగిలిలో పరవశించిన కృష్ణ, అధరాల అమృతాన్ని రుచిచూచాడు శరీ రంలో విద్యుత్ ప్రవహించింది "అమృతం" తనదేననుకున్నాడు.

ఆ ఏడాది అమృత నాన్నగారికి బదిలీ అయింది. ఇద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. అమృత కాలేజీలో చేరింది. రాధాకృష్ణ ఎం.ఏ. లో చేరాడు. దూరం మనుషుల్ని, మమతల్ని దూరంచేసింది. క్రమంగా ఉత్తరాలు తగ్గాయి. అమృత, కృష్ణ విషయమే మరచిపోయింది. కానీ రాధాకృష్ణకు మాత్రం అమృత రూపం అలాగేవుంది ఆమెను మరచిపోలేకపోయాడు. ఎం ఎ అయినాక ఉద్యోగంలో చేరినా. అమృ తను మరచిపోలేక, పెళ్ళిచేసుకోలేదు.

అమృత బి.ఎ. చదువుతూ ప్రొఫె సర్ గోపీచంద్‌ని ప్రేమించింది అతను దూరపు బంధువు కావడంతో తలి దండ్రులు వెంటనే పెళ్ళిచేశారు పెళ్ళి అయిన సంవత్సరమే గోపీచంద్ ఉద్యో గానికి రాజీనామాచేసి, మామగారి వ్యాపారం చేజిక్కించుకున్నాడు. వారికి నాలుగేళ్ళ పాప! లోటు లేని సంసారం!

కాలం అలా సాగితే కథ జరగదు. అదృష్టవశాత్తు అమృతం జీవితంలో రాధా కృష్ణ ప్రవేశించాడు. ఒకనాడు హైదరా బాదులో నడుస్తున్న అమృతకు, తన ముందు వెళుతూన్న వ్యక్తి 'కృష్ణ' అనే అనుమానం కలిగింది.

'హలో' అని పలకరించింది.

రాధాకృష్ణ తన కళ్లను నమ్మలేక పోయాడు. "అమృతం! నువ్వా!" అన్నాడు ఆశ్చర్యంతో.

"హాయ్, కృష్ణా'' అని పరవశిం చింది అమృతం.

"వండర్‌ఫుల్, ఎన్నేళ్ళతర్వాత దేవి గారి దర్శనం! ఎక్కడ వుండడం?"

"ఇక్కడే విజయనగర్ కాలనీలో." అడ్రసు చెప్పింది. తన కథ చెప్పింది. ఆమె మాటలు వింటుంటే అతనికి మతి పోయింది. గోపీచంద్ మీద అసూయ కలిగింది, అమృతకు భర్త కాగలిగి నందుకు

మాటల సందర్భంలో తాను ఇంత కాలం బ్రహ్మచారిననీ, 'ఆమెకోసమే అవివాహితుడుగా ఉన్నానని, ఆమెకు పెళ్ళిఅయింది కనుక తను ఇంక పెళ్ళాడ' తానని' చెప్పాడు

"ఎవర్నీ, నన్ను కాదుగదా ?" నవ్వింది అమృతం, చిలిపిగా.

"ఏం నేను పనికిరానా మొగుడుగా ? అడిగాడు."

"ఛీ... పో... కొంటె" సిగ్గుపడ్డది

రాధాకృష్ణను తన కారులోనే తీసుకు వెళ్ళి డ్రాప్‌చేసింది.

ఆ సాయంత్రం వేయికళ్ళతో ఎదురు చూచింది అమృత, కృష్ణకోసం. ఆనం దంగా గడిపింది. కానీ ఏదో అనుమానం రాధాకృష్ణ వెనకటంత చనువుగాలేడు ఎంచేతనో! తనకు దూరంగా తప్పు కున్నాడు. తన స్పర్శ తగులుతుందేమో నని భయపడ్డాడు! ఏం! తన స్పర్శ భగ్గున కాల్చేస్తుందా! పెళ్ళి అయిన స్త్రీ అయినంత మాత్రాన అలా దూరంగా పోవాలా! ఒకప్పటి స్నేహితురాలినే గదా! ఎంత నిగ్రహం వచ్చింది.

అమృతం అంత ఆనందంగా,పరధ్యా నంగా ఉండడానికి కారణం ఏమిటా అని ఆలోచించాడు గోపీచంద్. ఇలాటి దేదో అయివుంటుందని ఊహించాడు. తను ఎంతమంది అమ్మాయిల్ని చూడ లేదు ప్రొఫెసర్‌గా వుండగా! అను మానం రోజు రోజుకీ ఎక్కువ కాసా గింది

* * *

గోపీచంద్ కాంప్‌కు వెళ్ళిన రోజున రాధాకృష్ణను కలుసుకుంది

"కృష్ణా! నిజంచెప్పు, ఇంకా నేనంటే నీకు యిష్టమే కదూ !...

"ఆ ప్రశ్న అనవసరం అమృతా" అన్నాడు.

"కాదు, చాలా అవసరం. నాకు పెళ్ళి కాలేదనుకో. ఇప్పుడు మనం కలుసుకున్నాం. నన్ను పెళ్ళిచేసుకోవాలని నీకు అనిపిస్తుందా, లేదా చెప్పు."

"అనిపించవచ్చు అమృతా ! నీకు పెళ్ళి అయిందిగా, కాకపోతే, అమాంతం నిన్ను ఎత్తుకుపోయివుండేవాణ్ణి."

అమృత కళ్లు మూసుకుంది, తృప్తిగా. ఆ కళ్లు ఆనందంతో వర్షించాయి. గద్గద స్వరంతో అన్నది.

"కృష్ణా! నేను జీవితంలో చాలా పోగొట్టుకున్నానని ఇప్పుడు తెలుసుకున్నాను. ఇంతకాలం, ఏమిటోలే. నన్ను నేను మోసంచేసుకున్నానేమో కదూ ! ఇంత ఆలస్యంగా కన్పించి, నాకు అన్యాయం చేశావు నువ్వు."

బొలబొల ఏడ్చింది. ఆమె కన్నీరు తుడవక తప్పలేదు కృష్ణకు.

"విచారించకు అమృతా ! ఇప్పుడు నీకేంతక్కువైందని."

"ప్రామిస్‌చెయ్యి కృష్ణా." అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది. ఆమె కళ్ళలో కొత్తకాంతి.

* * *

పదిగంటలకు ఆఫీసుకెళ్ళిన గోపీచంద్, రాత్రి ప్రొద్దుపోయికానీ రాడు పాప పదిగంటలకు కిండర్‌గార్టెన్ స్కూలుకు వెళుతుంది తను ఎక్కడికైనా వెళ్ళాలన్నా చిన్నకారు వుంది తనే డ్రైవ్‌చేసుకోగలదు. మనస్సు చీకాకుగావుండి, ఒకరోజున కృష్ణకు ఫోన్‌చేసింది, వెంటనే రమ్మని. అంతకాలం కృష్ణను దూరంచేసుకున్నందుకు క్షమాపణ అన్నట్లు తనను సమర్పించుకున్నది. మొదటిసారిగా జీవితానికి సుఖానికి అర్థంగ్రహించింది. ప్రేమకు నిర్వచనం తెలుసుకున్నది. తర్వాత తరచుగా రాధాకృష్ణ అమృతం పిలిచినప్పుడల్లా వస్తూనేవున్నాడు. ఆమెలో కనిపిస్తున్న తృప్తి గోపీచంద్‌ను కాల్చివేసింది.

ఆ వ్యక్తి ఎవరో కనిపెట్టాడు. తనకు తెలిసినవాడే, తనకు స్నేహితుడే. చాలా మంచివాడు. అమృత తన భార్య అని తెలియదేమో! ఏమైనా అమృతకు కావలసింది, తన దగ్గర లేనిది, అతని దగ్గర వున్నది. లేకపోతే అతనిని ఎందుకు వాంఛిస్తుంది.

ఒకరోజున మధ్యాహ్నం, చికాకుగా వుండి గోపీచంద్ ఇంటికి వచ్చాడు. తన పడకగదిలో అమృత, రాధాకృష్ణ. గోపీచంద్ షాక్‌తిన్నవాడిలా వెనుదిరిగి డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు. అమృతకు చివరి ఉత్తరం రాశాడు !

"అమృతా !

నాకు అంతా తెలుసు కళ్ళారా చూశాను పాపకోసం, నీ బ్రతుకును అల్లరిపాలు చేయదలచలేదు నేను వెళ్ళిపోతు

న్నాను ఎక్కడికని అడగకు తిరిగి రానంత దూరం... ఆడది కనిపించని ప్రదేశాలకు వెళ్ళిపోతున్నాను. రాధాకృష్ణ మంచివాడు, యోగ్యుడు, ఉత్తముడు.

సెలవు.

భర్తవచ్చిన సంగతి తెలియని అమృతం, సాయంత్రం చూచింది ఆ ఉత్తరం. ఆత్రంగా చదివింది. చదివి నవ్వుకున్నది. పిచ్చిగా నవ్వింది. "పూర్ ఫెలో" అనుకున్నది. అద్దంలో తన అందాన్ని చూచుకున్నది. తన అందం తనకే ముద్దు వచ్చింది.

"హాయ్ కృష్ణా" అనుకున్నది, మత్తుగా...

మర్నాడు రాత్రి రాధాకృష్ణను రమ్మని ఫోన్‌చేసింది... ఇంక, ఏ అభ్యంతరం ఉండదు. దొంగచాటుగా కలుసుకోవలసిన కక్కుర్తి లేదు. హాయిగా రాధాకృష్ణని పెళ్ళిచేసుకో వచ్చు... కసిగా గోపీచంద్ రాసిన ఉత్తరం ముక్కలుగా చించివేసింది. ఎంత ప్రయత్నించినా ఏడుపురాలేదు. తాను విలువైనది పోగొట్టుకుంటే ఏడ వాలి కానీ తాను విలువైనదాన్ని పొంద గలుగుతున్నది!

"బ్లెస్సింగ్ ఇన్ డిస్‌గైజ్"

మర్నాడు సాయంత్రం రాధాకృష్ణ కోసం అపూర్వంగా అలంకరించుకుంది. పడకగదిని పూల సరాలతో నింపింది. అగరువత్తులు వెలిగించింది. మంచి గంధపు అత్తరు పూసుకుంది మనిషిని చూడగానే మత్తెక్కేలావుంది. శోభనపు పెళ్ళికూతురిలా తయారైంది.

రాధాకృష్ణ కారు వచ్చింది. సిగ్గుతో ఎదురువెళ్ళలేకపోయింది. తనే వచ్చి, తనను కౌగిలించుకుని ఉక్కిరిబిక్కిరి చేస్తాడని, అప్పుడు బెట్టుచేసి, శుభవార్త చెప్పాలనీ, ఇంక తమకు అడ్డులేదని చెప్పాలని అనుకుంది.

రాధాకృష్ణ ప్రక్కన మరొకరున్నట్లు పసిగట్టి చివ్వున తలెత్తి చూచింది.

"ఎవరామె?"

"ఈమె సుశీల. నా వైఫ్. ఇవ్వాళే రిజిస్టర్ మారేజ్ చేసుకున్నాం" అన్నాడు కృష్ణ సుశీలను అమృతానికి పరిచయం చేస్తూ.

అమృతకు తల తిరిగిపోతున్నది. పాతాళానికి కృంగిపోతున్నది.

"మా బాస్ కూతురు. ఎం.ఎ. చది వింది. లక్షలకు వారసురాలు" అంటు న్నాడు కృష్ణ.

నిన్న ప్రయత్నించినా ఏడుపు రాలేదు. ఇప్పుడు అప్రయత్నంగా ఏడు పొచ్చింది. కుప్పకూలి భోరున విల పించింది. గుండెపగిలేటట్లు రోదించింది.

ఆరాత్రి అమృతం కురిసేవేళ, రాధా కృష్ణ కౌగిలిలో సుశీల పరవశిస్తున్నవేళ, అమృతం మూర్తీభవించిన శోకదేవతలా మా ఇంటికొచ్చింది. చిన్నారి జలజను మా శ్రీమతికి అప్పగించి, తాను చీకటిలోకి జారిపోయింది.




విద్యావతిని సాదరంగా ఆహ్వానించి పలకరించాడు బట్టలదుకాణం యజమాని

"కులాసానా అమ్మా? మా మీద సీతకన్ను వేసారు కొత్తిగా"

"కులాసా ఎలావుంది మీ వ్యాపారం





కొత్తచీరలేమైనా వచ్చాయా ?" చిరునవ్వుతో అన్నది, విద్యావతి ఎదురుగా కౌంటర్ మీదవున్న ఓ సినిమాపత్రికని అప్రయత్నంగా అందుకొంటూ.

బట్టలదుకాణం యజమాని కుర్రాడిని కోకాకోలా పట్టుకురమ్మని పంపించాడు. విద్యావతికి గాలి చక్కగా తగిలేలా ఫేన్‌ని ఎడ్జెస్ట్ చేశాడు.

"ఫారిన్ నైలెక్స్ కొత్తవేమయినా వచ్చాయా ?" అడిగింది విద్యావతి.

"ఉన్నాయి. మాదగ్గర అద్భుతమయిన చీరవుంది. షిఫాన్ అనుకోండి. అది మీలాంటి రెగ్యులర్ కస్టమర్స్‌కే అమ్మాలని దాచివుంచాను."

"షిఫాన్‌లో అద్భుతమయిన చీరలుంటాయని నాకు తెలియదే" అన్నది విద్యావతి పకపకా నవ్వి.

"ఉండవు. కాని మాదగ్గరది మాత్రం నిజంగా అద్భుతమయినదే. ఆ సినిమా పుస్తకం ఇటివ్వండి చెప్తాను" అని ఆయన ఆ సినిమా మేగ్జిన్ అందుకుని, గబగబా పేజీలు తిప్పి, ఓ హీరోయిన్ బొమ్మని చూపించాడు విద్యావతికి. రంగుల్లోవున్న ఆ బొమ్మలో హీరోయిన్ కట్టుకున్న చీర నెమలికంఠం రంగుచీర-అందంగా వుంది.

"అచ్చం ఇలాంటి చీరే మావద్దవుంది. నిజానికి ఈ చీరే మాదగ్గర వుంది."

"ఈ చీరా?" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును. ఇదే ఇంకా ఈ సినిమా విడుదలవలేదు "

అద్దాల షోకేస్‌లోంచి ఓ చీర తీసి కౌంటర్‌మీద పరిచాడు. విద్యావతి ఆ చీరని బొమ్మలోవున్న చీరతో పోల్చి చూసింది. రెండూ ఒకటే రంగు డిజైన్‌లో వున్నాయి.

"ఈ హీరోయిన్ నా అభిమాన తార. ఈ చీర ఖరీదెంత?" అడిగింది ఆత్రంగా.

ధర చెప్పాడు ఆయన. కుర్రాడు అందించిన కోకాకోలా తాగాక అన్నది విద్యావతి హేండ్‌బేగ్ తెరుస్తూ...

"పేక్ చేయించండి."

నెల తర్వాత ఆ సినిమా విడుదలయింది. విద్యావతి ముందరే భర్తతో చెప్పి ఆ సినిమాకి మొదటిఆటకి రెండు టికెట్స్ రిజర్వ్ చేయించింది. ఆ నెమలి కంఠం రంగు షిఫాన్‌చీర కట్టుకునే వెళ్ళింది సినిమాకి భర్తతో హుందాగా. సినిమా నడుస్తున్నంత సేపూ తను కట్టుకున్న తరహాచీర హీరోయిన్ ఏ ఏ దృశ్యాలలో కట్టుకుందో గమనించి భర్తకు చెప్పసాగింది విద్యావతి. ప్రక్కవాళ్ళుకూడా ఆసక్తిగా వింటున్నారు

దృశ్యం మారింది. రేప్‌సీన్ అది. విలన్ హీరోయిన్‌ని రేప్‌చేస్తున్న దృశ్యం అది

తెరమీద, "వద్దు నీచుడా, నన్ను వదిలిపెట్టు" అన్న హీరోయిన్ కేకలతో పాటు, తెరముందు నేల తరగతి ప్రేక్షకుల ఈలలు, అరుపులు, చప్పట్లతో కొద్ది నిముషాలు ఆ సినిమాహాలు ప్రతిధ్వనించింది.

అకస్మాత్తుగా ముందు మూడో వరసలోంచి ఆ బట్టలదుకాణం యజమాని కంఠం ఆ దంపతులిద్దరికీ వినిపించింది. ఎవరితోనో చెప్తున్నాడు ఆయన.

"మనవూళ్ళోనే జరిగింది ఈ దృశ్యం షూటింగ్. ఇప్పుడు హీరోయిన్ కట్టుకున్న లాంటిచీర మద్రాస్‌లో మర్చిపోయారట వచ్చేటప్పుడు. ప్రొడక్షన్ మేనేజర్ మా షాపులోంచి ఇప్పుడు హీరోయిన్ కట్టుకున్న చీరని అద్దెకుతీసుకెళ్ళాడు. తర్వాత ఓ ఖాతాదారుకి ఆ చీరని అమ్మేసామనుకోండి."

తెరమీద ఆ హీరోయిన్ వంటిమీద చీర అప్పటికే ముప్పాతిక భాగం వూడిపోయింది!



# మారని విలువలు

సి. విశ్వేశ్వర రావు

ప్రొద్దుటనుంచీ రోగులను పరీక్షచేయటంతో విసుగెత్తిపోయిన డాక్టర్ నిరంజన్, పేషంట్ల రద్దీ తగ్గి, కాస్త ఊపిరి పీల్చుకోవడానికి అవకాశం దొరకగానే హాస్పిటలు వరండాలో నిల్చుని సిగరెట్టు కాలుస్తున్నాడు.

దూరాన బారులు తీరిన సిపాయిల్లాగా వున్న చౌకచెట్లూ, చెట్ల కావల సూర్యకాంతిలో బంగారు రేణువుల్లాగా మెరిసిపోతూన్న యిసుక తిన్నెలూ కనులకు మనోజ్ఞంగా కనిపిస్తున్నాయి.

హాస్పిటలు విసిరేసినట్లుగా ఊరికి చివరగా వుంది-జనసమ్మర్దానికి చాలా దూరంగా వుంటంవల్ల, అక్కడ వాతావరణము చాలా ప్రశాంతంగా వుంది-మనసుకు వుల్లాసం కలిగించే ఆ సుప్రశాంత, నిర్మల వాతావరణము డాక్టర్ నిరంజన్‌కు బాగా నచ్చింది.

డాక్టర్ నిరంజన్ హాస్పిటల్ చార్జి తీసుకొని వారంరోజులే అయింది. వచ్చిన వారంరోజులలోనే ఆ వూరి రాజకీయాలు, ఆ హాస్పిటలు సిబ్బంది మనస్తత్వాలు పూర్తిగా అవగాహన చేసుకోగలిగాడు. వస్తుతహా కొన్ని ఆశయాలు, ఆదర్శాలుగల డాక్టర్ నిరంజన్‌కు కల్మషపూరితమయిన ఆ వూరి ముఠా రాజకీయాలన్నా, వైషమ్యాలన్నా సరిపడలేదు. తమ స్వలాభాలకోసం, నాలుగు డబ్బులకు కక్కుర్తిపడి ఎంతటి నైచ్యానికయినా దిగజారే హాస్పిటలు సిబ్బంది ప్రవర్తనన్నా ఏవగింపు కలిగింది.

దాదాపు ఒక దశాబ్దంగా, స్థానిక రాజకీయ నాయకుల అండచూసుకొని ఆ వూళ్ళోనే తిష్ఠవేసి, వచ్చిన డాక్టర్లను తన చేతి కీలుబొమ్మలుగా చేసుకొని,

హాస్పిటలు వ్యవహారాలను తన గుప్పి టలో వుంచుకొన్న కంపౌండరు సింహా చలమంటే మొదటి పరిచయంలోనే డాక్టర్ నిరంజన్‌కు దురభిప్రాయం కలిగింది. పీలగా, బక్కపల్చగా, ఎము కలమీద చర్మం సాగదీసినట్లుండే సింహాచలాన్ని చూసినపుడు, ఎవరి కయినా గుంటనక్క గుర్తుకొస్తుంది— తన మాటల చాతుర్యంతో, తెచ్చిపెట్టు కొన్న అతి వినయంతో, క్షణంలో ఎదుటివాళ్ళను బుట్టలో వేసుకోగల చాకచక్యముంది.

ఒయ్యారా లొలకపోస్తూ, వలపులు కుమ్మరిస్తూ వచ్చిన డాక్టరు నల్లా తన వలలో వేసుకొని, యింతకాలం యథే చ్ఛగా తన ఆటలు సాగించుకొంటూంది నర్సు మాణిక్యం. అందగత్తె కాక పోయినా అనాకారిమాత్రంకాదు. చీరలో కన్నా, తెల్లటి యూనిఫారంలో యింకా ఆకర్షణీయంగా కనిపిస్తుంది—అలంకరణ విషయంలో ప్రత్యేకమయిన శ్రద్ధతీసు కొని, అంగుళం దళసరిన పౌడరు కోటింగుకొట్టి, కనురెప్పల కొసలను సన్నగా కాటుకతో తీర్చిదిద్దుతుంది. కుడిబుగ్గమీద కాటుకతో బ్యూటీ స్పాట్ దిద్దుతుంది. తల దువ్వటంలో కూడా ఓ వింత సోయగముంది. అందరిలా వెంట్రు కలను అణిచి దువ్వకుండా, ఒత్తుగా వుండేట్లు దువ్వి, జడకొసను అలాగే వదిలేస్తుంది - ఆమె బాహ్యసౌందర్యానికి ముగ్ధులయ్యారు, యింతకుక్రితం పని చేసిన అందరు డాక్టర్లు, ఒకరిద్దరు మినహా. కానీ డాక్టర్ నిరంజన్‌కు మాత్రం ఆమె అలంకరణ, ఆమె తీసు క్నొనే చొరవా చాలా ఎబ్బెట్టుగా కనిపిం చేవి. అందుకే డాక్టర్ నిరంజన్‌కు ఆమంటే సదభిప్రాయంలేదు.

వచ్చిన డాక్టరుకల్లా బుడ్డీలందిస్తూ, పిల్లల్ని తారుస్తూ, వాళ్ళ అభిమానాన్ని చూరగొని, హాస్పిటలుకు వచ్చే పేషం ట్లను జలగలాగా పీల్చి పిప్పిచేసి డబ్బులు గుంజుకోవటంలో ఆరితేరిన చెయ్యి వార్డుబాయ్ మునయ్య. అలా అక్రమంగా పేషంట్లను పీడించి సంపా యించిన డబ్బుతో, వడ్డీలకు మారుస్తూ, క్రమేణ అయిదారు వేలదాకా వెనకేయ గలిగాడు. ఇటీవలే భార్యపేరట ఆ వూళ్ళో ఓ కిరాణా కొట్టు ప్రారంభించాడు.

ఆ హాస్పిటలుకు డైట్ కంట్రా క్టరుగా, సర్జికల్ వగైరా సామాన్లు సరఫరాచేసే కంపెనీ ప్రొప్రయిటరుగా, చెలామణి అయ్యే వెంకోజి, ఆ హాస్పి టలు సిబ్బంది పాలిట కల్పవృక్షమని చెప్పాలి—డాక్టరు మొదలు, వార్డుబాయ్ వరకు వారి వారి తాహతునుబట్టి అవస రాలకు డబ్బిస్తూ, తన పనులను సునా యాసంగా నెరవేర్చుకొనే అఖండ ప్రజ్ఞా ప్రావీణ్యుడు వెంకోజి - బజారులో పది రూపాయలు కిమ్మత్తుచేసే వస్తువుకు

వందరూపాయలవరకూ బిల్లులు సృష్టించడంవల్లనైతేనేమి, రోగుల నోళ్ళు కొట్టి పుచ్చి, పురుగులుపట్టిన నాసిరకం సరకు హాస్పిటలు కిచెన్‌కు సరఫరాచేయటం వల్లనైతేనేమి, గడిచిన రెండేళ్ళలో రెండు లకారాలవరకూ సంపాయించాడని ప్రతీతి. వచ్చిన డాక్టరునల్లా ఆకట్టుకొని, వాళ్ళతో లాలూచీపడి ఇలాంటి అక్రమ వ్యాపారాలకు వాళ్ళను పావులుగా వాడుకొంటూ వాళ్ళ ఎదాన కొంత వాటా కొట్టేవాడని హాస్పిటలు సిబ్బంది నెవర్ని కదిలించినా చెప్తారు.

కానీ వెంకోజీకి డాక్టర్ నిరంజన్ ఒక కొరకరాని కొయ్యలా తయారయ్యాడు. డాక్టరుకు ఎలాంటి వ్యసనాలూ లేవు. మందు పుచ్చుకోడు. పరస్త్రీ వ్యామోహం లేదు. డబ్బుకు లొంగే రకం కాదు. అన్నిటికీ అతీతుడై కూర్చున్న శుకమహర్షిలాంటి డాక్టర్ని ఎలా లొంగతీసుకోవాలో తెలీక తికమక పడుతున్నాడు వెంకోజీ. చార్జి తీసుకొన్న క్రొత్తల్లో ఒకసారి డాక్టరుతో అని చూసాడు వెంకోజి "చూడండి ! డాక్టర్, మీకు హైదరాబాదులో ఏ పని కావాలన్నా చిటికలో చేసిపెట్టగల్ను- డైరెక్టరు మనవాడే ! మనమాట కాదని పోడు. ఒకమారు ఏమయిందను కొన్నారు. నేను హెల్త్ సెక్రటరీ ఛేంబర్స్‌లో వున్నాను. ఎ.యస్. సంతకాలకోసం ఏదో ఫైలు పట్టుకొచ్చాడు తీరా అది చూడబోతే, మనకు అతి సన్నిహితుడైన జిల్లా అధికారిమీద మోపిన అభియోగం గురించిన ఫైలు- ఆ మీదట నేను కలుగజేసుకొని ఆ అధికారి మనకు చాలా ముఖ్య స్నేహితుడనీ, కావాల్సినవాడనీ, తప్పకుండా సహాయం చేయాలనీ చెప్పాను. అంతే. మన మాటకు తిరుగులేదనుకోండి— అయినా యిదంతా మీకెందుకు చెబుతున్నానంటారు — హైదరాబాదులో ఉద్యోగరీత్యా మీకేదయినా నావల్ల సాయం కావల్సివస్తే చిటికెలో చేసి పెట్టగల్ను."

వెంకోజి మాటలకు డాక్టర్ నిరంజన్ ఓ పొడి నవ్వు నవ్వి-

"మీ మాటసహాయానికి చాలా థాంక్స్. నా కలాంటి అవసరాలు రాక పోవచ్చు-అథవా, వచ్చినా నేనన్నిటికీ సిద్ధంగా వున్నాను-ట్రాన్స్‌ఫరంటారా ! ఈ వూరుకాకుంటే మరో వూరు వేస్తారు- అంతేకదా ! నేను దానికీ తయారుగా వున్నాను" అన్నాడు.

కొరడాతో కొట్టినట్లుగావున్న డాక్టర్ నిరంజన్ సమాధానానికి వెంకోజి మొహం, అట్లపెనంలా నల్లబడింది.

డాక్టర్ నిరంజన్ బెదిరింపులకు కూడా భయపడేరకం కాదని తేలి పోయింది.

"సార్" అంటూ డాక్టరు వెనుక

నిల్చుని నసిగాడు కంపౌండరు సింహాచలం

డాక్టర్ నిరంజన్ ఓమారు ఓరకంట సింహాచలం వంకచూసి, 'ఏం' అన్న ట్లుగా ముఖంపెట్టాడు భ్రూకుటి ముడి వేశాడు డాక్టర్ మొహంలోని తీవ్రతని గమనించిన సింహాచలం కాస్త జంకాడు అయినా సింహాచలమే భయపడుతూ అన్నాడు 'తవర్ని ఓమారు ప్రెసిడెంటుగారు వారింటికి రమ్మన్నారు సార్ !"

'ఎందుకట ?' మాటల్లో కారిన్యం ధ్వనించింది

"క్రొత్తగా వచ్చిన డాక్టర్లకు వారింట్లో ఆతిథ్యం యివ్వటం ఆన వాయితీ' అన్నాడు సింహాచలం జంకుతూనే

"అలాంటి ఆతిథ్యాలు తీసుకోవటం నాకు గిట్టదని ప్రెసిడెంటుగారితో చెప్పండి" అన్నాడు డాక్టర్

ఆ పయిన సంభాషణ కొనసాగించ టానికి అవకాశం యివ్వలేదు డాక్టర్ నిరంజన్ మళ్ళీ డాక్టరే మొదలెట్టాడు

"చూడు సింహాచలం ! మీరీ హాస్పి టల్‌లో ఎన్నేళ్ళుగా వుంటున్నారు?"

ఆ ప్రశ్న ఎందుకడిగారో అర్థంకాక అందులోని ఆంతర్యం తెలియక తికమక పడుతూన్న సింహాచలం–

దాదాపుగా పదేళ్ళుగా వుంటున్నాను సార్' అన్నాడు

అంటే మీకీ హాస్పిటలు వ్యవహా రాలన్నీ కొట్టిన పిండన్నమాట

"అదేంలేదు సార్ ! కాకుంటే హాస్పిటలు వ్యవహారాలలో డాక్టర్లకి కాస్త చేదోడువాదోడుగా వుండేవాణ్ణి' అంటూ నీళ్ళ నమిలాడు సింహాచలం

'అదేనయ్యా నేను చెప్పేదీను ఈ హాస్పిటలులో యింతకుక్రితం జరిగిన అవకతవకలు మీకు పూర్తిగా తెలుసుం డాలి అవునా" అన్నాడు డాక్టర్ నిరంజన్ సింహాచలంవంక నిశితంగా చూస్తూ

'తమరు మరీ అంత నిలదీసి అడిగితే, నేనేం చెప్పేది సార్ ! తమకు ముందున్న డాక్టర్లు నాలుగు డబ్బులు వెనకేసుకోవాలనే బాపతు అలాంటి అభిప్రాయం వుండాల్నే కానీ, అవ కాశాల కేంతక్కువ సార్ ! పై అధి కారులను 'ఇదేమ''ని అడిగే ధైర్యంలేక సర్వీసులోవున్న పాపానికి చూసీ చూడ నట్లు పోయేవాణ్ణి – అంతకుమించి నేనేం పాపం ఎరగను సార్'

'చూడండి సింహాచలంగారూ! మీరు వయసులో, సర్వీసులో నాకన్నా పెద్ద వారు, అనుభవజ్ఞులు – మీకు నేను చెప్పాల్సినంతటి వాణ్ణికాను కానీ యిక్కడున్న పరిస్థితులనుబట్టీ, దొరికిన రికార్డునుబట్టీ చూస్తే, ప్రభుత్వాన్ని ఒక్కసారిగా కొల్లగొట్టాలన్న ప్రయ త్నాలు జరిగినట్లు అర్థమవుతోంది –



కాకుంటే యిదేమిటి చెప్పండి" అంటూ డాక్టర్ నిరంజన్ సర్రున డ్రాయరు సొరుగు లాగి సర్జికల్ బ్లేడ్సు, సిజర్సు, ఆపరేషనుకు సంబంధించిన మరికొన్ని పనిముట్లు, ఒక ఫైలు తీసి టేబిలుమీద పడేశాడు.

కంపౌండర్ సింహాచలం బిక్క మొహంవేసుకొని వాటివంక చూస్తూ నిల్చున్నాడు.

"ఒక్కమారు ఈ సర్జికల్ బ్లేడ్సు, సిజర్సు చూడండి ! వీటిని మనకు సప్లయిచేసి, సరిగా మూణ్ణెళ్ళయినా కాలేదు-కానీ యివి తుప్పుపట్టి ఎందుకూ పనికిరాకుండా వున్నాయి. వీటితో మీ ఆత్మీయుల కెవరికయినా ఆపరేషన్ చేయటమంటూ జరిగిందనుకోండి - అప్పుడేమవుతుందో తెలుసా ! సెప్టిక్ అయి పేషంటు ఆపరేషను టేబిలు మీదనే చచ్చి ఊరుకొంటాడు. ఇలా ఎందుకు జరుగుతుందంటారు-పదిరూపా యలకోసం కక్కుర్తిపడి, ఓ బేవార్సు కంపెనీని పేట్రనయిజ్ చేయటంవల్ల జరుగుతూంది – ఆ కంపెనీవాడు, పై అధికారి మొదలూ, వార్డుబాయ్‌వరకూ పర్సంటేజ్ యిచ్చుకోవాలి కాబట్టి, అసలైన స్టీలు పనిముట్లు సరఫరాచేస్తే

తనకు గిట్టుబాటుకాదు కాబట్టి యినుప రేకులకు స్టీలు క్రోటింగువేసి మనకు తగలగడుతున్నాడు. దీనివల్ల నష్టపడే దెవరు ? మీరూ, నేనూ, యింకా మన లాంటి సామాన్య ప్రజలు. పైగా ప్రభుత్వ ధనం దుర్వినియోగమవు తోంది-అంతేకాదు సింహాచలంగారూ ! ఒక్కమారు మీరిలా నాతో రండి... మీకో విచిత్రం చూపిస్తాను. మనమెంత అమానుషంగా, పైశాచికంగా ప్రవర్తి స్తున్నామో మీకే బోధపడుతుంది" అంటూ డాక్టర్ నిరంజన్ హాస్పిటలు కిచెన్‌వేపు దారితీశాడు. సింహాచలం డాక్టర్ని మౌనంగా అనుసరించాడు.

అప్పుడే కంట్రాక్టరు తాలూకు ఏజెంటు ఆ రోజుకు కావాల్సిన వంట సామగ్రి తెచ్చిపెట్టాడు - డాక్టర్ డబ్బా లోని బియ్యం గుప్పెడు చేతిలోకి తీసు కొని సింహాచలానికి చూపిస్తూ "పుచ్చి పురుగులు పట్టిన ఈ బియ్యంతో వండిన భోజనం రోగులకు పెడుతున్నాం - ఎండి కొరుకుడు పడని ఈ బ్రెడ్‌ను సరఫరా చేస్తున్నాం - పాలకంటే నీళ్ళ శాతం ఎక్కువగా వుండే పాలనబడే ద్రవపదార్థాన్ని రోగులకు సప్లయి చేస్తున్నాం — ఇలాంటి ఆహారం తిని పేషంట్సు తమ ఆరోగ్యం కోలుకోగల రంటారా ! మానవమాత్రుడయినవాడు యిలాంటి భోజనంచేసు పదికాలాల బాటు జీవించగలడంటారా !

ఇదంతా ఎందుకు జరుగుతూం దంటారు ? నీతికీ, నిజాయితికీ స్థానం లేకపోవడంవల్ల. మీరూ, నేనూ, యింకా మనలాంటి అధికారులు, నాలుగు డబ్బుల కోసం కంట్రాక్టర్లతో లాలూచీపడటం వల్ల జరుగుతుందంటాను.

మరో విషయం — నేను పాత ఫైళ్ళు తిరగేశాను. గత నాలుగేళ్ళుగా, అవస రానికి మించి, మన హాస్పిటలుకు సర్జికల్ సామాన్లు కొన్నారు. ప్రాణావ సరమయిన మందులకూ, ఇంజక్షన్లకూ దిక్కూ దివాణంలేకుండా వుండీ, మనకు కేటాయించిన బడ్జెటునంతా సర్జికల్ సామాన్లకోసం వినియోగించారు. ఇంత శ్రమపడి యిదంతా మీకెందుకు చెబు తున్నానంటారు ? ఇకముందు యిలాంటి అవకతవకలు జరగకూడదని. పాత విషయాలు త్రవ్వి, మిమ్మల్ని చిక్కుల్లో పెట్టడం నా అభిమతంకాదు— మీ రీవరకే నన్నర్థంచేసుకొని వుంటా రనుకొంటాను. నాకు డ్యూటీ ముఖ్యం— కర్తవ్య నిర్వహణలో ఏమాత్రం లోప మున్నా, నేను సహించను. అవసర మయితే పై అధికారులకు రాసి మిమ్మల్ని బదిలీ చేయించటానికి నా కెంతోసేపుపట్టదు— అందుకే మిమ్మల్ని ముందుగా హెచ్చరిస్తున్నాను — మీ పనులు మీరు సక్రమంగా నెరవేరుస్తూ న్నంతకాలం మీ జోలికి నేను రాను— అలాకాక మీ రేమాత్రం తోకాడించాలని

ప్రయత్నించినా, ఆ తోక నెలా తెగ్గో యాలో నాకూ తెలుసు అంటూ చరచరా నడిచి తన గదిలోకి వెళ్ళి పోయాడు.

అంతవరకూ డాక్టరు చెబుతూన్నది వింటూ దిగాలుపడి నిల్చున్న సింహాచలం చుట్టూ, వార్డుబాయ్ మునయ్యా, నర్సు మాణిక్యం చేరి "ఏమిటి క్రొత్త డాక్టరేదో తెగవాగిపోతున్నాడు" అన్నారు.

"ఆఁ ... ఏముంది నా బొంద ! మనం మన పనుల్ని సక్రమంగా చేయక పోతే పైకి రాసి మనల్ని వూరినుంచి బదిలీ చేయిస్తాడట" అన్నాడు సింహాచలం ఈసడింపుగా.

"ఏడవలేకపోయాడు" మునయ్యా, మాణిక్యం ఒకేసారి అన్నారు.

"అసలితగాడికి ఈ సింహాచలం తడాఖా అంటే తెలిసొచ్చినట్లులేదు– మనం ఒక్కపట్టు పట్టాల్నేగాని మిడిసిపడే కుర్రకారు డాక్టర్లను మూడు చెరువుల నీళ్ళు త్రాగించగలం–ఇతగాడి సర్వీసంతా కలిసి నా క్యాజువల్ లీవంత లేదు. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్లు, నన్ను బెదిరిస్తున్నాడు" అంటూ బింకంగా సింహాచలం డిస్పెన్సింగు రూమువేపు నడిచాడు–

పైకేదో మేకపోతు గాంభీర్యంగా అన్నాడే కాని సింహాచలానికి లోలోపల బెదురు లేకపోలేదు

ఇంచుమించు ఒక దశాబ్దంగా తనీ వూళ్లో పాతుకపోయాడు – స్థానికంగా కాస్తో కూస్తో పలుకుబడి సంపాయించు కోగలిగాడు – ఇంతకుక్రితం యిలాగే డాక్టర్లతో గొడవలుపడి ట్రాన్స్‌ఫర్లువస్తే ప్రెసిడెంటుగారి సాయంతో రద్దు చేయించుకోగలిగాడు. పైగా ఆ డాక్టర్లకే వుద్వాసన చెప్పగలిగాడు.

కానీ ఈ క్రొత్త డాక్టర్ను చూస్తే అఖండుడిలాగే వున్నట్లనిపిస్తున్నాడు– కొద్దో గొప్పో సింహాచలం ఊళ్లో తనూ ఓ డాక్టరుగా పేరుతెచ్చుకొని, ప్రాక్టీసు వృద్ధిచేసుకోగలిగాడు – నాలుగు రాళ్లు సంపాయించుకో గలుగుతున్నాడు – అలాంటిది యిప్పుడీ క్రొత్త డాక్టరు ఈ వూళ్లో వుండటమంటూ జరిగితే తన నోట్లో మట్టే ననిపించింది. ఎలాగయినా ఈయనగారికి ఈ వూరినుంచీ వుద్వాసన చెప్పాలి – దానికో పథకం వెయ్యాలి– సింహాచలం బుర్ర ఈ విషయం గురించి చురుగ్గా పనిచేయసాగింది.

డాక్టర్ నిరంజన్ అంటే గ్రామస్తులలో మంచి పేరొచ్చింది – నీతీ, నిజాయితీ వున్న వ్యక్తిగా, రోగులన శ్రద్ధగా పరీక్షచేసే డాక్టరుగా పేర తెచ్చుకొన్నాడు. కానీ ఆ ప్రెసిడెంట వర్గీయులకు, డాక్టరుకు సరిపడలేదు దానికి కారణం లేకపోలేదు ఆ ఊళ్లో ప్రెసిడెంటుకు మున్సబుకు పార్టీలు పార్టీకక్షలవల్ల ప్రెసిడెంటువర్గాన్ని

పడగొట్టాలని మున్సబువర్గమూ, మున్సబువర్గాన్ని చిత్తుచేయాలని ప్రెసిడెంటువర్గమూ ఎత్తుకు పైఎత్తులు వేస్తున్నారు

ఓమారు ప్రెసిడెంటు డాక్టరు దగ్గరకు వచ్చి, తన తాలూకు మనిషి మీద మున్సబు పార్టీవాళ్లు దొమ్మీచేసి కొట్టినట్లు, తీవ్రమయిన గాయాలయి నట్లు, సర్టిఫికేటు యివ్వమన్నాడు— దొంగసర్టిఫికేట్లు యివ్వడం తన వృత్తి ధర్మానికి విరుద్ధమనీ, అలా యివ్వ డానికి వీల్లేదని ఖండితంగా చెప్పాడు డాక్టర్ నిరంజన్ - డబ్బాస చూపిం చాడు-బెదిరించాడు కానీ డాక్టరుమాత్రం వేటికీ లొంగలేదు.

దాంతోటి ప్రెసిడెంటు డాక్టరుమీద పగ సాధించాలని పట్టుపట్టాడు - చాటు మాటుగా కంపౌండరు సింహాచలం, బాహాటంగా కంట్రాక్టరు వెంకోజి ప్రెసి డెంటు పక్షమయ్యారు - అయాచితంగా సలహా లివ్వడం మొదలెట్టారు - డాక్టరు మీద కుట్రలు పన్నారు.

తత్ఫలితంగా వారం తిరక్క-ముందే డాక్టర్ నిరంజన్‌మీద పై అధికారులకు పిటిషన్లమీద పిటిషన్లు వెళ్ళాయి. డాక్టర్ లంచగొండనీ, త్రాగుబోతనీ, నర్సుతో అక్రమ సంబంధం ఏర్పరుచు కొన్నాడనీ, డబ్బివ్వనిదే రోగులను పరీక్షచేయడనీ యింకా యిలాంటి అభూత కల్పనలతో పిటిషన్లు పెట్టారు.

జిల్లా వైద్యాధికారి ఎంక్వయిరీకి వచ్చాడు దిగడానికి జిల్లా వైద్యాధికారి గెస్ట్ హౌస్‌లో దిగినా, ఆయనగు కావాల్సిన ఆతిధ్యమంతా ప్రెసిడెంటే ఏర్పాటుచేశాడు.

డి.యం.వో. డాక్టర్‌మీద వచ్చిన పిటిషన్లమీద విచారణ జరిపాడు- సాక్షులుగా వచ్చిన వాళ్ళంతా ప్రెసి డెంటు వర్గం వాళ్లవటంవల్ల, సాక్ష్య మంతా డాక్టర్‌కు వ్యతిరేకంగా వుంది.

డి.యం.వో. నర్సు మాణిక్యాన్ని పిలిచాడు.

"ఏవమ్మా ! డాక్టరుకూ, నీకూ అక్రమసంబంధం వుందని పిటిషన్లో రాసుంది-దీనికి నీ సంజాయిషీ ఏమిటి?" అన్నాడు. దానికి మాణిక్యం ఒళ్లంతా కులికిస్తూ, తెచ్చికోలు సిగ్గునభినయిస్తూ, "మరేనండి, ఓ రోజు అర్జెంటు కేసుం దని రాత్రి డ్యూటీకి రావాలని వార్డ్ బాయ్ మునయ్యచేత మా యింటికి డాక్టరుగారు కబురు పెట్టారండి-డాక్టరు గారి మాటకాదనే ధైర్యంలేక నైట్ డ్యూటీకి వెళ్ళానండి—మరేనండి డాక్టరు గారు తన గదిలోకి రమ్మన్నారండి- నేనేమో వెళ్లానండి - డాక్టరుగారు నా చెయ్యి పట్టుకొన్నారండి - అంతేనండి జరిగింది - అప్పణ్ణుంచీ రోజు మార్చి రోజు నాకు డాక్టరుగారు నైట్ డ్యూటీ వేస్తున్నారండి - నేనేమో వెడుతున్నా నండి" అంది వంచిన తలయెత్తకుండా.




ఇంతవరకూ కక్షగట్టినట్లు తనమీద చెబుతూన్న అబద్ధపు సాక్షాలు వింటూన్న డాక్టర్ నిరంజన్, నర్సు సాక్ష్యం వినడంతోనే అతడిలోని ఓపిక చచ్చిపోయింది – ఒళ్లంతా కుతకుత వుడికిపోతూన్నట్లుంది. పనిగట్టుకొని తనమీద అబద్ధపు సాక్షాలు చెబుతూన్న వాళ్లగొంతు నులిమేయాలన్నంత కోపం వచ్చింది–కానీ అది సంస్కారవంతుల లక్షణంకాదని ఆగిపోయాడు. కానీ అక్రోషం పట్టలేక "అబద్ధం ! ఇదంతా పచ్చి అబద్ధం–కావాలని నా మీదెవరో కక్షసాధించాలని నా మీద పిటిషన్లు పెట్టారు. నా స్టాఫ్చేతనే నా మీద వ్యతిరేక సాక్ష్యం చెప్పిస్తున్నారు సార్ ! వీళ్లమాటలు నమ్మకండి సార్ !" అని అక్రోశించాడు.

"బి క్వయట్ డాక్టర్ ! మీరలా ఎక్సైటెట్ అవకండి" అంటూ డి.యం.వో. అందర్నీ బయటకు పంపేశాడు. గదిలో డాక్టర్, డి.యం.వో. మాత్రమే మిగిలారు. క్షణకాలం వారిద్దరిమధ్యా నిశ్శబ్దం తాండవించింది – డి.యం.వో. సిగరెట్టు ముట్టించి, గట్టిగా దమ్ములాగి తాపీగా పొగవొదుల్తూ,

"యు, సీ, డాక్టర్ ! యు ఆర్ ఏన్ యంగ్ డాక్టర్ ! ఇంకా నీలో వుడుకురక్తం చల్లారలేదు. మనం చదువుకొనేరోజుల్లో ఏర్పరుచుకొన్న ఆదర్శాలూ, ఆశయాలూ, సర్వీసులో చేరగానే ఆచరణలో పెట్టాలన్న తాపత్రయం నీలాంటి కుర్రకారు డాక్టర్లకు వుంటం సహజం–కానీ ఆశయాలు, ఆదర్శాలు వేరు – నిజజీవితం వేరు–నిజజీవి

తంలో నీ ఆశయాలకూ, ఆదర్శాలకూ ఎక్కడా పొంతన కుదరదు-ప్రెసిడెంటు పైవర్గాలలో పలుకుబడి వున్నవ్యక్తి- ఆతను తల్చుకొంటే ఏమయినా చెయ్య గలడు-అతన్ని కాదని ఈ వూళ్ళో ఏ డాక్టరూ మనలేడు – అలాంటప్పుడు - మన ఆదర్శాలకు తిలోదకాలు వొదిలి, లోకంతీరు తెలుసుకొని, అంతరాత్మకు విరుద్ధమయిన పనులు చేయటానికి ఆల వాటుపడటం వివేకవంతుల లక్షణం— అలా కాదని మూర్ఖంగా ప్రవర్తిస్తే, దాని పరిణామా లెలావుంటాయో నీకీ వరకే అర్థమయ్యుండాలి - ఇహపోతే, కంట్రాక్టరు వెంకోజి అవసరానికి పని కొచ్చే మనిషి—బతకనేర్చినవాడు- తను తినటమేకాక, నలుగురికీ తినిపించగల స్తోమత, చాకచక్యం వున్న వ్యక్తి- అలాంటివాళ్లతో లౌక్యంగా మెలగటం నేర్చుకోవాలిగానీ పగలు పెంచుకో కూడదు—దీపం వుండగానే యిల్లు చక్క బెట్టుకోవటం ఎలాగో యిప్పటికయినా తెలుసుకోవాలి డాక్టర్ !

సాక్ష్యాధారాలనుబట్టి, పిటిషన్లలో నీ మీద మోపబడిన అభియోగాలు రుజు వవుతున్నాయ్—ఇందులో నే చేయగలిగిం దేమీలేదు - కాకుంటే, ఒకవిధంగా లీనియంట్ యాటిట్యూడ్ తీసుకొని, రెండు యింక్రిమెంట్లు ఆపుచేయాల్సిం దిగా డైరెక్టరుకు రెకమెండ్ చేయ గలను" అంటూ ముగించాడు.

ఈ వింత చూడటానికి హాస్పిటలు ముందు గుంపులు గుంపులుగా జనం పోగయ్యారు. అక్కడచేరిన జనంలో ప్రతివాడికీ డాక్టరంటే సదభి ప్రాయమూ, గౌరవమూ వున్నాయి. కానీ డాక్టరు పక్షంగా సాక్ష్యం చెప్ప డానికి ఎవరూ సాహసించడంలేదు – వాళ్ళకి బాగా తెలుసు – అధవా, ఎవ డయినా ప్రెసిడెంటు మాటకాదని ముందుకొస్తే, మరుసటిరోజు వుద యానికి వాడి తలకాయ వూళ్ళో కనిపించదని.

ఆ రాత్రంతా డాక్టర్ నిరంజన్‌కు సరిగా నిద్రపట్టలేదు – అన్యాయంగా, అక్రమంగా తనమీద మోపబడిన ఆరో పణలకు అతని అంతరాత్మ ఘోషిం చింది– నీతిగా నిజాయితీగా బతుకుతూ,- వైద్యవృత్తికి ఒక విశిష్ట స్థానాన్ని కల్పించాలనుకొన్న తనమీదనే లేనిపోని అభియోగాలు చేశారని తెలుసుకొన్న పుడు అతడి గుండె బ్రద్దలయింది - నీతికీ, నిజాయితీకీ సంఘంలో స్థానం లేదనిపించింది. అవినీతినీ, అన్యా యాలను ఎదుర్కోవాలనుకొన్నందుకు తనకు దక్కిన ప్రతిఫలమేమిటి ? కర్తవ్య నిర్వహణలో తను చూపిన శ్రద్ధాసక్తులకు గుర్తింపుగా ప్రభుత్వం తనకు రెండు యింక్రిమెంట్లు ఆపుచేయ బోతోంది - అతనిలో అంతర్యుద్ధం చెల రేగింది—నీతికీ, అవినీతికీ, న్యాయానికీ,

అన్యాయానికి సంకులసమరం సాగింది- "దీపం వుండగానే యిల్లు ఎలా చక్క-బెట్టుకోవాలో తెల్సుకోవాలి డాక్టర్" అన్న డి. యం. వో. మాటలు కర్ణ పుటాల్లో ప్రతిధ్వనిస్తున్నాయ్-అనుభవం మీద చెప్పిన ఆయన మాటల్లో ఎంతో నిగూఢ సత్యం వుందనిపించింది—చిన్న బడిపంతులుగా జీవితం గడుపుతూ చాలీచాలని జీతంతో నానా యాతనలు పడుతూ, తన తండ్రి తనని మెడిసిన్ చదివించడానికి పడ్డశ్రమ ఒక్క-సారి కళ్ళముందు మెదిలింది. తనకోసం తన బాగుకోసం తన తండ్రి పడ్డ కష్టాలు గుర్తొచ్చినపుడు డాక్టర్ కళ్ళు చెమ ర్చాయి. గడచిన ఐదేళ్ళ సర్వీసులో తను వెనకేసుకొన్నది ఏమీలేదు - తన తోటి డాక్టర్లలాగా తనకు కార్లు లేవు, స్కూ-టర్లు లేవు — కనీసం బ్యాంకు బాలెన్సు లేదు — ఉండటానికి తనదీ అంటూ ఒక యిల్లు కూడా ఏర్పరుచు కోలేకపోయాడు — ఒక్క- క్షణం ఆలో చించాడు. అంతరాత్మ "వద్దు! దిగజారి పోవద్దు" అని పదే పదే ఘోషిస్తూన్నా, డాక్టర్ నిరంజన్ ఒక నిర్ణయానికి వచ్చాడు. నీతికీ, అవినీతికీ, న్యాయా నికీ, అన్యాయానికీ యింతవరకూ తనలో చెలరేగిన అంతర్యుద్ధంలో అవి నీతే జయించింది. తను తీసుకొన్న నిర్ణ యానికి సంతృప్తిగా ఒక నిట్టూర్పు వదిలి, భవిష్యత్తును గూర్చి బంగారు కలలుకంటూ పడకమీద వాలిపోయాడు

రాత్రి తీసుకొన్న నిర్ణయం ప్రకారం డాక్టర్ నిరంజన్ ఆ రోజు వచ్చే మొదటి కేసు దగ్గర ఫీజు తీసుకోందే కేసు చేపట్టకూడదనుకొన్నాడు. ఆ నిర్ణ యంతో హాస్పిటలుకు వెళ్ళాడు. తను హాస్పిటలుకు వెళ్లేసరికి నిన్న జరిగిన ఎంక్వయిరీని గురించి స్టాఫంతా గుసగుసలాడుకొంటున్నారు. డాక్టర్ను చూడగానే ఎవరి స్థానాలలోకి వాళ్ళు ఏమీ తెలియని నంగనాచుల్లాగా చేరు కొన్నారు.

ఇంతలో హడావుడిగా పదిమంది గ్రామస్తులు డాక్టరు గదిలో ప్రవేశిం చారు. వాళ్ళ మొహాల్లో ఏదో ఆదుర్దా, కలవరపాటు ప్రస్ఫుటంగా కనిపిస్తు న్నాయి. వచ్చినవాళ్ళలో కొన్ని క్రొత్త మొహాలు కూడా వున్నాయి.

"సార్ ! మెయిన్‌రోడ్డుమీద ఓ టూరిస్టు బస్సు చెట్టును ఢీకొని పెద్ద యాక్సిడెంటు అయింది — బస్సు బోల్తా పడి ప్రక్క-కాలువలో పడిపోయింది— చాలామందికి తీవ్రమయిన గాయాలు తగిలాయి — కొందరు ప్రాణాపాయ స్థితిలో వున్నారు. మీరు వెంటనే బయల్దేరి రావాలి డాక్టర్" అంటూ ప్రాధేయపడసాగారు.

"మీరంతా యిలా కట్టకట్టుకొనివచ్చి మెయిన్‌రోడ్డుమీద బస్సు యాక్సిడెంట్ అయిందని చెబుతున్నారు— కొంతమంది

ప్రయాణీకులు ప్రాణాపాయస్థితిలో వున్నారని చెబుతున్నారు — బాగానే వుంది-కానీ యిప్పుడు హాస్పిటలు పని చేయాల్సిన టైము - ఈ సమయంలో నేను హాస్పిటలు విడిచి రావడానికి వీల్లేదు" అన్నాడు డాక్టర్ నిరంజన్ నిర్మోహమాటంగా.

"మీరలా అనకండి డాక్టర్ ! మీరు రావటం ఏమాత్రం ఆలస్యంచేసినా, కొన్ని ప్రాణాలు ఎగిరిపోవచ్చు — మీరు వెంటనే బయల్దేరండి డాక్టర్" అన్నారు బతిమాలుతూ.

"ఆల్ రైట్ ! అలాగే వస్తాను — కానీ ఈ సమయంలో హాస్పిటలు విడిచి రావడానికి నా ఫీజు వందరూపాయలు. ఫీజు యివ్వడానికి మీరు 'ఊ' అంటే అలాగే వస్తాను."

"డాక్టర్! మీరు...మీరుకూడా..." అన్నారు ఆ వూరి గ్రామస్తులు నివ్వెరపోతూ.

"ఏం ! ఆశ్చర్యంగా వుందా ?"

"అదికాదు డాక్టర్ ! మామూలుగా ఇంకే యితర డాక్టరు అడిగినా మేమంత ఆశ్చర్యపోయేవాళ్ళం కాము — కానీ, నీతికీ, నిజాయితీకి కట్టుబడిన మీరు కూడా అడుగుతున్నారంటే, మా చెవులను మేం నమ్మలేక పోతున్నాం "

"మీరన్నదీ నిజమే — నిన్నటిదాకా నేను నీతికీ, నిజాయితీకి కట్టుబడి వుండాలనుకొన్నాను — కాని మీ వూరి ప్రజలే నాలోని మానవత్వాన్ని చంపేశారు. నన్నీస్థితికి దిగజార్చారు."

"అయితే మీ నిర్ణయం మారదా డాక్టర్?"

"మారదు — నాకు ఫీజు యివ్వనిదే ఏ కేసూ తీసుకోదలచుకోలేదు."

డాక్టరు నిర్ణయాన్ని తెలుసుకొన్న గ్రామస్తులు "పదండిరా! ఈ డాక్టరుతో ఏంటి ? ఎండ్లబండికట్టి వాళ్ళను పెద్దాసుపత్రికి పంపుదాం" అంటూ వెళ్ళిపోయారు.

గ్రామస్తులు వెళ్ళిన కొద్దిక్షణాల వరకూ డాక్టర్ నిరంజన్ వాళ్ళు వెళ్ళిన వేపు నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

అంతరాంతరాళాల్లో ఎక్కడో మనసు తనకు చెబుతూంది. నువ్వు చేస్తూన్న పని ఘోరాతి ఘోరమని.గుండెలోతుల్లో ఎక్కడో తనలో దాగిన కారుణ్యం హీనస్వరంతో మూలుగుతోంది — ఒక ప్రక్క తనలో మొలకెత్తిన 'స్వార్థం' తాలూకు రాక్షసత్వం, తనలోని మానవత్వపు పీకనులిమేస్తూంది. ఇన్నాళ్లూ తనలో ప్రోదిచేసి పెంపొందించుకొన్న ఆదర్శాలనూ, ఆశయాలనూ ఒక్కసారిగా తుడిచి పెట్టివేయలేకపోతు




న్నాడు – క్షణికావేశంలో తనలో మొలకెత్తిన స్వార్థపూరితమయిన వాంఛ కోసం, తను నీతిబాహ్యమయిన పెడ త్రోవ తొక్కలేకపోతున్నాడు.

డాక్టర్ కోట్నీస్, సర్ రనాల్డ్‌రాస్, ఫ్లారెన్సు నైటింగేలులాంటి మహనీయుల చరిత్ర తన దృక్పథంలో మెదిలింది— మానవసేవకోసం, తమ జీవితాలనే అంకితంచేసిన వారి చరిత్ర డాక్టర్ నిరంజన్‌కు కనువిప్పు కలిగించింది.

ఇహ ఆగలేకపోయాడు – తనలోని స్వార్థాన్ని జయించగలిగాడు.

"సింహాచలం ! ఫస్ట్ ఎయిడ్ బాక్స్ సిద్ధంచేయి – మనం వెంటనే యాక్సిడెంటు జరిగిన స్థలానికి వెళ్ళాలి" అని కేకపెట్టాడు.

ఇంతలో కొందరు మంచంమీద ఓ వ్యక్తిని హాస్పిటలుకు తీసుకొచ్చారు.

"డాక్టరుగారూ ! మిగతావాళ్ళనెలాగో ఎడ్లబండిమీద జిల్లా ఆసుపత్రికి పంపగలిగాం – కానీ ఈ ముసలావిడ ఆసుపత్రి చేరేదాకా బతుకుతుందన్న నమ్మకంలేదు. చావు బ్రతుకుల్లో వుంది. అందుకే యిక్కడికి తీసుకొచ్చాం— కనీసం ఈ ముసలావిడకయినా వెంటనే చికిత్సచేసి బతికించండి డాక్టర్ ! మీరు కోరిన వందరూపాయల ఫీజు కూడా తీసుకొచ్చాం" అంటూ ఓ పచ్చ కాగితాన్ని డాక్టరు టేబిలుమీద వుంచారు.

డాక్టరు వారి మాటలు వినే స్థితిలో లేదు – హడావుడిగా మంచం సమీపిం

చాడు — ఆమె చెయ్యి అందుకొని పల్సు చూశాడు. పల్సు అందడంలేదు— తల మీద తీవ్రమయిన గాయం అవడంవల్ల, నెత్తురుకారి ముఖంమీద చారికలు కట్టాయి. ఆమె కొద్దిక్షణాల క్రితమే చనిపోయింది — డాక్టర్ లాభంలేదన్నట్లుగా పెదవి విరిచాడు.

"ఎవరో పాపం! ఒంటరిగా యాత్రకు బయల్దేరినట్లుంది — చివరికీ వూళ్ళో ఆమె చావు రాసిపెట్టుంది కాబోలు" అన్నారెవరో వచ్చిన జనంలో నుంచి.

"ఆమె తాలూకు ఈ సూట్‌కేసు, ఆఖరి క్షణాలలో ఆమె పిడికిట్లో బిగించి పట్టుకొన్న వుత్తరం వున్నాయి డాక్టర్" అంటూ సూట్‌కేసు వారగా పెట్టి వుత్తరాన్ని డాక్టరుకు అందించాడు.

ఉత్తరాన్ని డాక్టర్ నిరంజన్ చేతికి తీసుకొని చదవసాగాడు. అది తను తల్లికి రాసిన వుత్తరం — ఒక్కసారి మంచంమీద ముసలావిడ ముఖంకేసి పరీక్షగా చూశాడు. జాబులోని అక్షరాలు మసక మసకలై కనిపించసాగాయి. అంతే. "అమ్మా" అంటూ డాక్టర్ నిరంజన్ కుప్పకూలిపోయాడు. తనను తొమ్మిది నెలలు మోసి, కని, పెంచి పెద్దచేసిన, తన పాలిటిదైవాన్ని, తన మాతృమూర్తిని ఈనాడిలాంటి స్థితిలో చూస్తానని కలలో కూడా వూహించని డాక్టర్ నిరంజన్ తల్లి శవంమీదపడి ఏడవసాగాడు.

తిరుపతి యాత్రకు వెడుతూ యిలా అర్ధాంతరంగా తన తల్లి దిక్కులేని చావు చస్తుందని వూహించని డాక్టర్ నిరంజన్ ఆవేదనకు అంతులేకపోయింది. టేబిలుమీది పచ్చకాగితం తనను వెక్కిరిస్తూన్నట్లుగా గాలికి రెపరెపలాడుతూంది. డాక్టర్ నిరంజన్ ఒక్క శుష్కహాసంచేసి ఆ నోటును ముక్కలు ముక్కలుగా చింపి గాలికి విసిరేశాడు. అవే! గాలిలో తేలిపోతూన్న ఆ పచ్చకాగితం ముక్కలే తన తల్లిని తనకు దూరంచేశాయి.



# కేర్వారప్పు బొమ్మ

ఎ. ఎన్. జగన్నాథ శర్మ

చిన్నగా జల్లు కురుస్తోంది.

ఆ డాబా ఇంటికి కొంచెం దూరంగా పొలాలుదాటి చీకటిలో కలిసిపోయిన చర్చి నుండి ఏ లోయల్లోనో దారి తప్పిన బాటసారి భయానికి భయంగా వేసుకునే కేకల్లా-విషాదంలో కీచుపోయిన స్త్రీ కంఠంలా, రాత్రి పన్నెండును తెలియ జేస్తూ గంటలు మ్రోగాయి.

ఆ ఇల్లు చర్చికి కొంచెం దూరంగా, పొలాలు దాటి ఇవతల రోడ్డువార దీపపు కాంతిలో వెల్ల వేయించని ఇల్లులా వెల వెలాపోతోంది.

అక్కడి కాంతికి అలవాటుపడ్డ కళ్లు జాగ్రత్తగా ఆ ఇంటిని చూస్తే లేత నీలం రంగు పెయింట్ వేసిన ఓ కిటికీ, దాని వూచలూ కన్పిస్తాయి. తర్వాత ఇటు ద్వారం - తర్వాత ఆ ఇంటిని కప్పేస్తూ ప్రక్కిల్లు.

వూచలున్న కిటికీ గదిలో ఎప్పుడూ ఓ మనిషి ఏదో ఒకటి రాస్తూ, గది మధ్య చాపమీద మేళ్కొని వుంటాడు.

అతను ఇప్పుడు ఏదో రాస్తూ వున్నాడు. రాస్తూ రాస్తూ పెన్ను మూడిచి కిటికీ దగ్గరగా వచ్చి నిలబడ్డాడు. మెత్తగా కురుస్తున్న జల్లునీ-మసగ్గా వున్న వీధి దీపాన్నీ, చీకట్లో తడుస్తూ నిల్చున్న వీధి ముంగిటి తాటిచెట్టునూ చూస్తు న్నాడు.

తాటిచెట్టుదగ్గర అస్పష్టంగా ఏవో ఆకారాలు కదిలాయి. అతను కళ్ళు పెద్దవిగా చేసుకుని చూసాడు. కదిలి, కదిలి ఆ ఆకారాలు మసక కాంతిలోనికి వచ్చాయి.

తెల్లని చీరకొంగు తలమీదుగా ముసుగేసుకుని, కొంగు చివర్ని పండ్ల మధ్య నొక్కిపెట్టినట్లుగా వుండి-కుడి చేతిని తొమ్మిది పదేళ్ళ పాప మెడ మీదుగా చుట్టి - ఎడమచేతితో పెద్దది కాని లెదర్ బాగును పూపుకుంటూ ముందు ముందుకు నడచి వస్తోంగో యువతి.

తలొంచుకున్న ఆమె ముఖం అతనికి

కన్పించటంలేదు. కాని ప్రక్కనున్న పాప ముఖంలో కళ్ళు పెద్దవని అతను గ్రహించాడు.

సుతారంగా తలుపులు చప్పుడయ్యాయి. క్షణంలో అతను తేరుకున్నాడు. శబ్దం చేస్తున్న తలుపులు తనింటివేనని యోచించి గాభరాగా ద్వారాన్ని తెరిచాడు.

పాప లంగాని ఎత్తి పట్టుకుని చొరపగా ఇంట్లోనికి ప్రవేశించింది. ఆమె మాత్రం ద్వారం అవతలే నిలబడి అతని కళ్ళల్లోకి చూస్తోంది.

"ఎవరు!? కమలా!?" అన్నాడతను ఆశ్చర్యపోతూ.

నవ్విందామె.

"రా, రా లోపలికి." అతని కంఠం మెత్తగా వుంది.

ముఖాన్ని చేత్తో తుడుచుకుంటూ లోనికి ప్రవేశించిందామె. తలుపులు మూసి ఆమె వెనుక అయోమయంగా నడిచాడతను.

గదిలో హరికెన్ దీపపు వెలుతురు ఎదురుగా వున్న చీడీ మీదకు, అలా నట్టింటికీ ప్రాకుతోంది. నట్టింటి మధ్యగా రెండు మంచాలున్నాయి. ఒక దానిమీద ఒత్తిగిలి పడుకుంది అతని భార్య. ఇంకోదానిమీద ముడుచుకు పడుకున్నారు అతని పిల్లలిద్దరూ.

ఆమె ఇంటినంతా పరికించి చూసింది.

"అటు పద గదిలోనికి" అన్నాడతను.

మౌనంగా నడిచిందామె.

హరికెన్ దీపం దగ్గర గొంతిగిల్లా కూర్చొని, అక్కడున్న కాగితాల్ని యేరుతూ ఆ వెల్తురులో చదువుతోంది పాప.

"ఎవరీ పాప?" అడిగాడతను.

"నా కూతురు సీత" ఆమె కంఠం బొంగారుగా వుంది.

"సరే" అంటూ చీడీమీదకు వెళ్ళి దండెంమీదుగా వ్రేలాడుతున్న తుండు గుడ్డను తెచ్చి ఆమెకు అందించాడు.

ఒత్తుగా వున్న జుత్తును ముందుకు లాక్కొని చివరల్ని తుడుచుకుందామె.

"ఆకలేస్తోంది, అన్నం పెడతావా." మెడను తుడుచుకుంటూ అడిగింది.

ఆ మాటకి సీత ఇటు చూసింది. "ఊఁ" అంటూ నట్టింట్లోకి వెళ్ళాడతను. భార్యని లేపాడు. ఆవిడ బద్ధకాన్నొదిలి శ్రద్ధగా విస్తుపోతూ వింది-అతని మాటలు.

"కమలా-పిల్లా వచ్చారు. వాళ్ళకి ఆకలిగా వుందట. లేచి అన్నం వండగలవా"?

విస్మయంగా అడిగిందావిడ— "ఎవరండీ?"

"అదంతా తర్వాత చెప్తాను. ముందు అన్నం వండి, చారు పెట్టు." ముందు గదిలోనికి వచ్చి నిల్చున్నాడు.

"ఏమండీ" నట్టింట్లోంచి పిలిచింది పతి భార్య.

"లెండి భోజనాలు చేద్దురుగాని" అన్నాడు పతి.

* * *

"నీ భార్య పేరు?" గదిలోనికి వచ్చి, కొంగుతో పెదాల్ని అద్దుకుని కను బొమ్మల్ని చేత్తో రాసుకుంటో అడిగింది కమల, చాపమీద కాగితాల్ని దొంతి పెడ్తున్న పతిని.

"శాంతి"

"పాపం! శాంతిలో కల్లోలం రేగింది కాబోలు-బెంబేలు పడ్తూ భయంగా చూస్తూ వడ్డించింది."

"అది నా భార్యగా."

"అబ్బ! వుక్క-పోస్తోందీ డాబా గదిలో. జల్లు పడటం లేదుగా అలా గట్టంబట నడిచొద్దామా?"

"ఇది రాత్రి. ఒంటిగంట



అయ్యింది జల్లుకూడ పడింది గట్లు తడి తడిగా వుంటాయి పాములూ అవీ వుంటాయి పొలాలకు ఆవతల వైపు శ్మశానాలు కూడ వున్నాయి. దెయ్యాలంటే నాకు భయమని నీకు తెల్సుగా" చాపను దులుపుతూ అన్నాడు పతి

"నేను నీ ప్రక్కనే వుంటాగా" అందామె

అందుకే నను రాకూడదు '

"పతీ!" బొంగురుగొంతు మృదువుగా సుళ్లు తిరుగుతున్నట్టుంది ఆమె వైపు చూసాడు పతి

సన్నటి చీర కట్టుకుంది ఎమిటి మీగి ముంగురులు అంటుకొనున్నాయి కాటుకిలేసి కళ్ళు కిడిగినట్టున్నాయి. గులాబీరంగు పెదవులు వణుకుతున్న



ట్టున్నాయి. సన్నని కంఠనాళాలు అదురుతున్నాయి. మనిషి బాగా చిక్కిపోయినట్టుంది. రంగు పేలిపోయిన కర్రబొమ్మలా వుంది.

భారంగా కళ్లు మూసుకుందామె.

"కమల" అనుకున్నాడతను ఏ భావమూ లేకుండా మనసులో.

"సరే వేగంగా వచ్చేద్దాం" గొంతును నొక్కుకున్నట్లుగా అన్నాడు పతి.

కడిగిన ముత్యాలులా ఆమె కళ్లు మెరిసాయి. హరికెన్ లాంతరు చేత్తో పట్టుకొని 'పద' అన్నట్టుగా ముందు నడిచాడతను.

దులిపిన చాపమీద బొమ్మల్లా పడుకుంది సీత. నిద్రపోతోంది. కమల కూతురి దగ్గరగా వెళ్లింది. ఆప్యాయంగా కూతురి తలను నిమిరి కంఠం వెనుక భాగాన్ని ముద్దుపెట్టుకుంది. లేచి, గది తలుపులు దగ్గరగా లాగి, నిలబడిందక్కడే.

నట్టింట్లో—లాంతర్ని ముఖం మీదుగా ఎత్తి పట్టుకుని ఏదో మాట్లాడుతున్నాడు పతి భార్యతో.

శాంతి ఆ వెలుగులో ముఖాన్ని ముద్ద చేసుకుని మాట్లాడుతోంది.

"పద కమలా!" వస్తూ అన్నాడు పతి.

పొలాలు గట్లు గరికతో పచ్చగా—చల్లగా—తడి తడిగా వున్నాయి. ప్రక్క పొలాలలో ఇంతకుముందు వర్షంనీరు మడుగుకట్టి వుంది. 'గొల్లు' మన్నట్లు గట్లమీంచి కప్పలు మడుగులోనికి గెంతుతున్నాయి. కమల ముందునుంచీ ఏదో ప్రాకుతూ పోతోంది. దూరంగా వున్న పొలాలలో చీకటి కురుస్తున్నట్టుగా వుంది. ఆ ట్టే దూరంలేని ప్రక్క పొలంనుంచీ పొగ చుట్టుకుంటూ లేస్తోంది. ఆకాశం గాఢంగా మబ్బు పట్టి వుంది. పొలాలకు ఇవతలి వైపున్న శ్మశానాల వైపు చూస్తూ నడుస్తున్నాడు పతి. చీరె కుచ్చెల్లను ఎత్తి పట్టుకుని నడుస్తోంది కమల. గరికలేని, తడి లేకుండా కన్పించే మట్టిగట్టుమీద కూర్చుంది కమల. పతి దీపాన్ని పట్టుకుని నిలబడ్డాడు. 'కూర్చో' మన్నట్లుగా అతని ఎడమచేతి చూపుడు వ్రేలును లాగిందామె చతికిలబడ్డాడతను ఇబ్బందిగా, లాంతర్ని ప్రక్కగా పెట్టుకుంటూ.

"పొలాలకు ఇంత దగ్గరగా ఇల్లుండటం చాలా బాగుంది కదూ?" అడిగింది కమల. ఆమె వైపు చూసాడు పతి.

"పతీ, నువ్వు చాలా అదృష్టవంతుడివి."

"ఏం అలా అన్నావ్?"

"కాకపోతే ఇంతో అంతో యస్సెల్సీ పాసయ్యావు. అంతా తుడుచుకుపోయినా ఓ పదెకరాల భూమంటూ వుందనుకుంటాను. తగ్గ భార్య.

ముద్దుగా ఇద్దరు పిల్లలు. ఒద్దికగా ఓ డాబా ఇల్లు...—"

"అయితే."

మెళ్లో వున్న పూసల గొలుసును చేత్తో రాసుకుంటూ కూర్చుందామె. లాంతరుచుట్టూ మూగుతున్న పురుగుల్ని చూస్తున్నాడు పతి.

ఏదో నిర్ణయానికి వచ్చినట్లుగా అడిగింది కమల— "పతీ! నామీదో కథ రాయకూడదూ!"

నవ్వాడతను.

"కాదు పతీ! ప్లాట్ నేనిస్తాను. కథ నువ్వు వ్రాయి."

చలిగాలి వీస్తోంది. కమల చొరవగా అతని ఒడిలో వాలింది. అతని కంఠాన్ని చూస్తోంది. ఆమె కుడిచేతిని అతని మెడమీదుగా పోనిచ్చి నిమరసాగింది. లేచి, వొత్తిగిల్లి అతని గుండెను ముద్దు పెట్టుకుంది.

"ఏమిటిది?" పతి ప్రశ్న.

"నా కోరిక" కమల జవాబు.

"పతీ! కథ చెప్పనా?"

"లేచి చెప్పు."

"ఊహుఁ, ఇలాగే వుండి చెప్తాను. ఎందుకో తెల్సా? కథ చెప్తున్నప్పుడు మరచిపోలేని అనుభూతి నాక్కావాలి."

"ఆహఁ"

పూసల గొలుసును చేత్తో రాస్తో— అతని ముఖంలోకి చూస్తూ— "నాకు సిక్స్టీలో పెళ్ళయింది'' అంది కమల.

"కథ చెప్తానన్నావ్" జల్దుకున్నాడతను.

"అదే చెప్తున్నాను, శ్రద్ధగా విను. నాకు సిక్స్టీలో పెళ్ళయింది. ఫైళ్లి కొడుకు నాకు బాగా పరిచయస్థుడు. తెల్లగా వుంటాడు. జుత్తు కళ్ళల్లోకి పడుతూ వుంటుంది. ఎప్పుడూ తెల్లని బట్టలే తొడుక్కుంటూ వుంటాడు. నేనంటే అతనికి అభిమానమని చెప్పలేను. నామీద అతనికి సానుభూతి ఎక్కువ. మా ఇంటిప్రక్కనే ఆ పుణ్యమూర్తి వుంటుండేవాడు. ఏదో పల్లెటూళ్లో అతనికి పాడీ పంటా వుందని, చదువురీత్యా ఇక్కడుంటున్నాడని తెలుసుకున్నాను. ఏదో ఫర్డ్ ఫామ్‌తో చదువు నే నాపేయడంవల్ల ఆ రోజుల్లో ఏ పుస్తకాలైనా తెగ చదివే దాన్ని. అతని దగ్గరకు పుస్తకాలకంటూ వెళ్ళి పరిచయాన్ని వృద్ధిచేసుకున్నాను. అతను నన్ను బాగా అంచనా వేసుకున్నాడు. మా అమ్మా నాన్నతో నన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పేట్ట. ఆ రోజు రాత్రి మా అమ్మా నాన్నా నన్ను బ్రతిమలాడారు. ఒకవిధంగా నన్ను అర్థించారు. సరే అన్నాను. పెళ్ళయింది."

పతి ఆకాశాన్ని చూస్తున్నాడు.

"పతీ!"

"ఆఁ చెప్పు......"

"ఆ రోజు మా మొదటిరోజు.

అతను ముస్తాబై నన్ను ముస్తాబు చేస్తున్న గదిలోనికి వచ్చి నిలబడ్డాడు. వెళ్లి అతన్ని ముద్దుపెట్టుకోవాలన్పిం చింది. అతను నా వైపు చూసి నవ్వు తున్నాడని నాకు తెల్సు. ఇంతలో నా బాయ్ ఫ్రెండ్స్ చొరబడ్డారు గదిలోనికి. అమ్మా నాన్నా ఆందోళనగా తిరుగు తున్నారు. నా గుండెలు వేగంగా కొట్టు కుంటున్నాయా అన్పించింది. వాళ్లు అతన్ని చూసారు. నా దగ్గరగా వచ్చి చుట్టుముట్టి మాటలతో నానా హంగామా చేసారు. అంతే! అతను గదినుంచి చర చరా వెళ్ళిపోయాడు. వాకిట్లో అతని తల్లిదండ్రులు మా అమ్మా నాన్న మీద ఎగిరిపడ్తున్నారు. చుట్టాలు ఆశ్చర్య పోతున్నారు. బాయ్ ఫ్రెండ్స్ చలాకీగా మాట్లాడుతూ అల్లరిచేస్తూనే వున్నారు. పెద్ద గలాటా జరిగింది. వాళ్ళంతా వాళ్ల పల్లెటూరు వెళ్ళిపోయారు.

బంధం తెగిపోయిందనుకున్నాను. కాని, అతను మాత్రం వారం వారం మావూరొస్తూ నన్ను కలుసుకునేవాడు. నా ప్రవర్తన మార్చుకొనమనేవారు. నేను మాత్రం అతన్ని పురుగుని చూసినట్టు చూసేదాన్ని. కారణం? నా గురించి అతనికి 'అన్నీ' తెలుసు. మా పరి చయాలు అంత గాఢమైనవి. కేవలం నన్ను ఫూల్ని చెయ్యడానికే ఈ వివాహ తతంగం జరిపించా డనిపించింది. అతనిమీద విపరీతమైన కసి అప్పట్లో. అఫ్‌కోర్స్. నేను మాత్రం జాలీగానే వుండేదాన్ని. ఎప్పట్లా నేను మా ఇంటికి రాత్రి పదింటికే వస్తూ వుండే దాన్ని. అమ్మ నెత్తీ నోరూ బాదు కునేది. నాన్న అయోమయంగా ఇంటి గుమ్మం ముందు కూర్చునేవారు. ఆ ఇంట్లో నా గురించి ఆశగా ఎదురు చూసేది నా ఆఖరి చెల్లి 'రమ' ఒక్కత్తే. దానికి అయిదేళ్ళు. రాత్రి నేనొస్తున్న ప్పుడు దానికి మిఠాయి తెస్తుండేదాన్ని. వీధిలోవాళ్లూ- వూర్లోవాళ్లూ- ఎక్కువగా ఆడవాళ్ళు నాకు నీతులు చెప్తుండేవారు. వాళ్ళు నన్నసహ్యించుకునేవారు. నేను మాత్రం వాళ్ళని అసహ్యించు కోనూ!

ఒకరోజు నాకు తెల్సింది నా ఫ్రెండ్ మధుగాడి విషయం. వాడో వుత్త ఫూల్. మంచి డబ్బున్నవాడు. నన్ను ప్రేమించాట్ట. కాదు. నన్ను ఆరాధించేవాడు. వాడు—నాకు పెళ్ళ యిందని తెలిసి—నేను ఒకరి సొంతం కాబోతున్నానని తెలిసి భయపడి—ఆ రోజు ఆ బాయ్ ఫ్రెండ్సుని పంపిచాట్ట అని చెప్పి, తర్వాత తనేదో కంపెనీ వ్యవహారంమీద బొంబాయి వెళ్తున్నా నని, నన్నుకూడ రమ్మనమని ప్రాధేయ పడ్డాడు. నే వాడితో వెళ్ళిపోయాను.

"కాదు. వాడితో లేచిపోయావు" గర్జించింది పతి కంఠం.

నవ్వింది కమల — "అబ్బ! ఈర్ష్య!"

వాళ్ళకి దగ్గరగా ఎవరో ముసుగు కప్పుకుని ఒక చేత్తో టార్చి - ఇంకో చేత్తో కఱ్ఱా పట్టుకుని వస్తున్నారు.

"ఎవులు! పంతులు బావూ" అడిగాడా వ్యక్తి.

"నేనేనోయ్" అన్నాడు పతి.

"ఇదేటి బావూ ఇంత రాతిరేల ఈ గిట్లంట కూకోడం!"

"వూరకనే నిద్ర పట్టక........"

"ఇగో సిన్న సినుకులు వొడు తున్నాయి. వానొచ్చేత్తాది బావూ."

"నువ్వెక్కడికి వెళ్తున్నావు?"

"దోస ఏసినానుగదా పొలంలో- నోఁపలు ఎవులూ పొట్టికెలిపోకుండా కాపలా! మీరెయ్యనేదేటి బావూ ఈ సాలు?"

"లేదోయ్."

"వత్తా బావూ."

ఆ మనిషి దూరం అయిపోయేవరకూ మాట్లాడలేదు కమల. పతి స్థిరంగా కూర్చోలేకపోతున్నాడు. కమల కళ్ళు మూసుకుని చెప్ప నారంభించింది—" ఇప్పటికి తెలుసుకుని వుంటాడా పెళ్ళి కొడుకు. ఒక ఆడదాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడం కష్టం అని. కాని ఇప్ప టికీ ఒక ప్రశ్న అతన్ని వేదిస్తూనే వుంటుంది. సామాన్యురాలు కమలకి ఈ ఆడంబరం లాంటి తెగింపు ఎందు కంటూ, అని."

క్షణం ఆగింది కమల.

"చిన్నప్పట్నించీ నా ప్రవర్తనే అంత. జ్ఞానం తెలియక ముందే మొగ్గ విడని మల్లెలా అందంగా ఉండేదాన్ని- తర్వాత ఎనిమిదేళ్ళకు బాగా విచ్చుకుని పరిమళాన్ని పోగొట్టుకున్న మల్లెలా అసహ్యంగా తయారయ్యాను. అప్ప ట్నించీ నా ఆటలు ఎలాంటివంటే మొగుడూ—పెళ్ళాం ఆటలు ఆడేదాన్ని. కడుపు— పురుడు — కానుపు — కేకలు— పిల్లాడు పుట్టాడంటూ ఓ రుబ్బురు పొత్రాన్ని గుండెలకు హత్తుకోవటం— ఇవన్నీ నాకు బాగా తెలుసు. అలాంటి వాతావరణంలో పెరిగాను. మా నాన్న పెద్ద బ్రతుకు బతికి చితికిపోయి రైస్ మిల్లులో ఎకౌంటెంట్‌గా పనిచేసేవాడు. నేను వాళ్ళసంతతికి నాగోలుదాన్ని. నా మీదో ముగ్గురు ఆడపిల్లలు. క్రిందో ముగ్గురు ఆడపిల్లలు. అందరికన్నా పెద్ద దాన్ని ఎలాగోలా పెళ్ళి చేసాడు నాన్న. తర్వాత ముగ్గురం గుఱ్ఱాల్లా ఎదిగి కూర్చున్నాం.

నాన్న మమ్మల్ని పట్టించుకునేవాడు కాదు. ఎప్పుడూ డీలగా ఇంటికి వచ్చే వాడు—పడుకునేవాడు—వెళ్లేవాడు. ఇదీ అతని పరిస్థితి. ఎలాగోలా నన్నొక్క దాన్నీ ఎనిమిదో తరగతివరకూ చదివించగలిగారు! అదీ నా పోరు పడక. ఆ రోజుల్లో నా పరిస్థితి—అందర్లా నాకూ మంచి బట్టలు కట్టుకోవాలని వుండేది.

అప్పటి ఫాషన్లమీద తెగ మోజు వుండేది వాటిని తీర్చుకుందికి నా దగ్గర డబ్బులు వుండేవికావు. అందుకని నాన్నగారి జేబులో అయిదూ — పది దొంగిలించేదాన్ని. వాటితో రిబ్బన్లు— ఫేస్‌పౌడర్లు — కాటుక — తిలకం — సిని మాలు......వీలున్నప్పుడు హోటల్స్ కంటూ వెళ్లేదాన్ని. ఆ కారణంగా నాకో ఇద్దరు ముగ్గురు డబ్బున్న ఆడ పిల్లలు స్నేహితులుగా ఏర్పడ్డారు. వాళ్ళతో తిరుగుతూ — వాళ్ళతో మస ల్టానికి యింకా డబ్బు అవసర మయ్యేది. డబ్బుకోసం బాయ్ ఫ్రెండ్సును ఏర్ప రచుకున్నాను. వాళ్ళని పదీ పాతికా నవ్వుతూ అడిగేదాన్ని. వాళ్లు మురిసి పోతూ ఇచ్చేవాళ్ళు.

నా సినిమాలు—నా ఖరీదైన వస్తు వులూ చూసి నాన్నా — అమ్మా భయ పడేవాళ్ళు. కాని, నాన్న నన్నెప్పుడూ గద్దించి అడగలేదు అమ్మ మాత్రం నా ప్రవర్తన — నాన్న మౌనతనం చూస్తూ ఏడుస్తూ వుండేది.

ఒక రోజు నాకు బాగా జ్ఞాపకం. నేను అద్దంముందు నిల్చుని నుదుటి ముంగురులు సర్దుకుంటూ — ముఖాన్ని ఎత్తయిన గుండెనూ చూసుకుంటో — ఎక్కడ్నించో ఎరువు తెచ్చిన లిప్‌స్టిక్‌ను నా పెదాలకు రాసుకుంటూ వుండటం అమ్మ చూసింది. 'సాని రంకు ముండ' అని నన్ను తిట్టి కొట్టింది నాతో గింజు కోవటంలో బాటిల్ క్రిందపడి బ్రద్ద లైంది. నాకు వెర్రికోపం వచ్చింది. అమ్మ జుత్తు పట్టుకు గుంజి విసురుగా నేలమీదకు తోసేసాను. అమ్మ మూతీ మోకాలూ రక్కుకున్నాయి. ఆ రాత్రి అమ్మ నాన్నతో అంతా విడమరచి చెప్పినట్టుంది. నేనొచ్చేసరికి నాన్న గారు వుగ్ర నరసింహులై వున్నారు. నన్ను చావబాదారు. వెయ్యాలనే పెద్దగా కేకలు వేస్తూ ఏడ్చాను. చుట్టు ప్రక్కల వాళ్ళంతా వచ్చి మూగారు. వాళ్ళంతా నాన్నని సముదాయిస్తుంటే నే నేడుస్తూ నాన్నని 'కనడం అంటే పెళ్ళాంతో కులుకుతూ కన్నావు కాని, పెంచడ తెలీని వెర్రి ముఖం' అన్నాను కర్కశంగా. నాన్న రెచ్చిపోలేదు. బుర్ర దించుకుని వెళ్ళిపోయి రాత్రంతా ఎక్కడో తిరిగి తిరిగి ఇంటికొచ్చి అమ్మ పడుకున్న గదిలోనికి వెళ్ళ బోతుంటే — 'తిండి లేకపోతే వుండ గలడు కాని, అది లేకపోతే వుండలేడు' అన్న నా మాటలకి తెల్లవార్లూ నాన్న ఏడ్వటం నాకు బాగా తెలుసు. ఆ రోజు నుంచీ నాన్నగారు నా వూసు ఎత్తడం మానేసారు. నేను స్వేచ్ఛగా తిరిగే దాన్ని. వేళకి ఇంత అన్నం మాత్రం పడేస్తూ వుండేవాళ్ళు వాళ్ల ధర్మమా అని. అప్పట్లోనే నాకు ఆ పెళ్ళికొడు కుతో పరిచయం కావటం—పెళ్ళీ ఇవన్నీ జరిగాయి " ఆగింది కమల.





విసురుగా తన వొడినుంచి ఆమెను లేపాడు పతి. అమాయకంగా అతన్ని చూసింది కమల.

"శాంతి, డాబామీంచి మన ఇద్దర్నీ చూస్తోంది" అంటూ అటు చూపాడు పతి.

కమల చూస్తూ అంది—"ఇంకా నిద్ర పోలేదేమో!"

"అదీ ఆడదేగా" అన్నాడతను.

జల్లు పుంజుకుంది.

"తడిసిపోతున్నాం, ఇంటికి పోదామా?"

''వద్దు పతీ! చెప్పేను కదూ, నాకు మరచిపోలేని అనుభూతి కావాలని. నేనున్న ఈ మూడు గంటలూ - ఈ జల్లు ఇలా పడ్తూనే వుండాలి. ఈ చలి గాలి ఇలా వీస్తూనే వుండాలి. నేనిలా నీ ఒడిలో పడుకుని కథ చెప్తూనే వుండాలి" అంటూ అతని ఒడిలో వాలి పోయింది కమల.

''అండర్‌స్టాండ్ మై డియర్ బుల్లి పతీ! అదీ నే పుట్టి పెరిగిన వాతావరణం. అవీ నా కోర్కెలు. అదీ నా ప్రవర్తన. కేవలం బొంబాయి చూస్తా నన్న కోర్కెతోనే కాదు. ఆ పెళ్ళి కొడుకుమీది కసితోకూడ మధుగాడితో నేను పారిపోయాను. నువ్వు జీవితాన్ని ప్రేమించి నన్నాదులుకున్నావు. నేను జీవితాన్ని ఓఎడ్వెంచర్‌గా తీసుకుని...'' తన కంఠం వొణుకుతున్నట్టనిపించింది కమలకి. తమాయించుకుంది. "ఎక్కడికి వచ్చాం మనం?" అడిగింది.

''ఆఁ బొంబాయి వెళ్ళాం. బొంబాయంతా మేమేఁ అయినట్టుగా తిరిగాం. ఓ నెలరోజులు జీవితం ఓ వెలుగు వెలిగి నట్టయింది మధు డబ్బు బాగా

ఖర్చు చేస్తున్నాడు. సినిమాలంటాడు. షికార్లంటాడు. క్లబ్బంటాడు. ఏదో కంపెనీ వ్యవహారంమీద వచ్చిన మధు మూడు మాసాలుండి తర్వాత వెళ్ళి పోదాం అన్నాడు. 'ఎక్కడికి?' అన్న ప్రశ్న నే దిగమింగుకోపడం, నేను జీవితంలో అనుభవించిన యమ బాధ. మధుతో మారాంచేసి అక్కడే వుండి పోదాం అన్నాను. మధు ఇబ్బందిగా మరో మూడు మాసాలు గడిపాడు. ఈ లోపున అతనికి ఇంటినుంచి అనేక ఉత్తరాలు వస్తూ వుండేవి, బొంబాయిలో అన్నాళ్ళు వుండడానికి కారణం ఏమిటంటూ. మా మొదటి రోజుల్లో ఏదో సాకుతో వాటికి జవాబులు రాసే వాడు, ఆ విషయమై. తర్వాత తర్వాత ఉత్తరాలనిండా నా వల్ల తనెంతో బాధ అనుభవిస్తున్నట్టు రాసే వాడు కామోసు! తిరుగు టపాలో వాళ్ళింటినుండి నాకు తిట్ల వర్షం కురి పిస్తూండేవి, 'ఆ లంజ — ఆ బాపన ముండ' అని. మధు స్నేహితులు మా రూమ్‌కి వస్తూ వుండేవాళ్ళు. వాళ్ళతో నేను ఫ్రీగా మాట్లాడుతుండేదాన్ని. మగాడిగా మధుకది ఇష్టం వుండేది కాదు.

రోజూ రాత్రిపూట నన్ను వేదించుకు తినేవాడు, 'ఎంగిలి విస్తరలో భోం చేస్తున్నానని' అంటూ. నాకూ ఆత్మ గౌరవం వుంటుంది కదు పతీ! నేను వాడ్ని తిట్టేదాన్ని, ఒకొక్కప్పుడు రక్కేసేదాన్ని కూడ.

ఓ రోజు నేను లేచేసరికి నా పక్క మీద మూడువేల రూపాయలూ ఓ చీటీ కన్పించాయి. అందుకొని ఆ చీటీ చది వాను. 'నేను మా వూరు వెళ్ళిపోతు న్నాను. ఇక ఈ డబ్బుతో నీ ఇష్టం. నీ మధు' అని వ్రాసి వుంది. నవ్వు కున్నాను. మూడు వేలు పెట్టుకుని మధు ఫ్రెండ్స్‌కు మధు వస్తాడని చెప్తూ మూడు నెలలు గడిపాను. దినాలు గడిచి పోతున్నాయి. బ్రతుకుమీద ఓ మోస్త రుగా భయంలాంటిదేదో కల్గింది. మా వూరు వెళ్దాం అంటే అక్కడ నాకు బ్రతుకు వుండదని తెలుసు. అందుకే బొంబాయిలో స్థిరంగా వుండిపోదలి చాను. ఆ నిశ్చయం నా శీలాన్ని బలి కోరింది. కాలపు హోరులో నిశ్శబ్దంగా ఆరు సంవత్సరాలు గడిచి పోయాయి. తర్వాత నేను గర్భ వతిని.........'

మొదట్లో గర్భాన్ని పోగొట్టుకుందికి ఏవో మందులు వాడుదాం అనుకున్నాను, కాని, నాతో విధి గెలవటం నాకు ఇష్టం లేదు. నేను వోడిపోకూడదు అని అనుకుంటూ ఓ పాపని కన్నాను. కన్న తర్వాత కూడ కర్కశంగా ప్రవర్తిద్దా మనుకున్నాను. కాని— పాప పెద్ద కళ్లు— పాప ముద్దు ముఖం—పాప అమాయి కంగా ఏడ్చే ఏడుపూ, దాన్ని బ్రతికిం

చాయి. నన్ను సంఘం మీదకు వుసి గొలిపాయి. దాని పేరే సీత. ధైర్యంతో సీతను అయిదేళ్ళు పెంచుకొచ్చాను. దానికి ఎనిమిదో ఏడు వచ్చింది. నాలో భయం ఆవహించింది నరనరాల్లో వణుకు పుట్టుకొచ్చింది.

రాత్రి ఏ పదింటికో పదకొండింటికో నే నింటి కొచ్చేవరకూ తెలివిగా వుండేది. ఆ సమయంలో దాన్ని పలకరించాలంటే భయం-దాన్తో నవ్వాలంటే సిగ్గు. రాత్రిపూట నిద్ర పట్టేది కాదు నాకు. నన్ను పిచ్చి ప్రశ్న లడిగేది. 'అమ్మా! ఇంత రాత్రివరకూ ఎక్కడుంటావ్? అమ్మా! నీ గురించి ఎందుకలా మామయ్యలు ఇల్లు తెగ తొక్కేస్తారు? అమ్మా! ఆ పెద్ద మీసాలున్న మామయ్య నిన్నెందుకలా కోపడ్తాడు? అంటూ. వాటికి జవాబులు చెప్పలేక నాలో నేను పడే బాధ పతీ? నీ కర్థం కాదు. చిన్నతనంలో ఎనిమిదవ ఏడు, జీవితంలో ఓ కర్వు లాంటిది. ఆ మలుపు నా కూతురి జీవితంలో సామాన్యంగానే తిరగాలి. ఏ ప్రత్యేకతా దాని కుండకూడదంటూ వెయ్యి దేవుళ్ళను ప్రార్థించేదాన్ని. ఇంటికొచ్చిన మగాళ్ళు దాన్తో. అసహ్యంగా పరాచికాలాడుతుంటే...పతీ! నే చెప్పలేను ఆ బాధ......

తాగుబోతు తన కొడుకు తనలాగే తాగుబోతు కావాలని—తనలాగే అందరిచేత తిట్లూ దెబ్బలూ కాయాలని కొరడు. అలాగే నేనూను. అలా కోరుకోవటంలో తప్పుందా పతీ! ఇలాగే వో సంవత్సరం గడిచిపోయింది.

సీతకు అన్నీ తెలుస్తున్నాయి, సినిమాలంటోంది. షికార్లంటోంది. ఫాషన్లంటోంది. దాని జీవితంలో నా జీవితం ప్రతిబింబిస్తున్నట్లయింది. నా మెదడులో ఖడ్గాలు. నా హృదయంలో ఒక్కసారి సప్త సముద్రాలూ పోటెత్తుతున్నట్టు బాధ......నా కళ్ళల్లో ఓ కంటి ముందు ఏడుస్తున్న నాన్న, మరో కంటి ముందు గగ్గోలు పెడ్తున్న అమ్మ. గుండెల్లో నా పిచ్చితల్లి సీత. భయం...భయం...భయం... విధితో పోరాడి ఓడిపోయానంటూ సీతకోసం సీతతో మా వూరు వెళ్ళాను. ఈ పదహారు సంవత్సరాలలో మా ఇంట్లో చాలా మార్పు వచ్చింది. నాన్నగారు చనిపోయారు. అమ్మ సన్నగా చచ్చేటట్టు వుంది. వున్న అయినుగురు ఆడపిల్లల్లో ఎవ్వరికీ పెళ్ళిళ్లు కాలేదు. నన్ను చూసి అందరూ 'బొంబాయక్కా' అంటూ సంబరపడ్డారు. అందరూ నన్ను తరచి తరచి చూస్తున్నారు. సారీ! నన్ను కాదు, నా చీరెల్ని, నా చెవి రింగుల్ని, నా గాజుల్ని, నా మెడలో వున్న పూసల గొలుసునీ, అంతే! అదురు పుట్టింది. ఆ నరకంలో వుండలేకపోయాను. అమ్మ నడిగాను,

పతి ఎక్కడుంటున్నాడని. ఫలానా అని చెప్పి, నీకు పెళ్ళయిందని, ఇద్దరో ముగ్గురో పిల్లలని కూడ చెప్పింది. రాత్రికి రాత్రే లేచి ఇక్కడికి వచ్చాను.

పతీ! నీకన్నీ తెలుసు. కష్టం - సుఖం-- పాపం - పుణ్యం -అనురాగం- అవమానం. ఎందుకంటే నువ్వు రచయితవి. నాకున్న పరిజ్ఞానంలో డి. హెచ్. లారెన్స్ అన్నట్టు —ఒక రచయితకి వున్నంత విశాల దృక్పథం ఎవరికీ వుండదట. నిన్ను పొగడటం కాదు పతీ! నువ్వు నన్ను బాగా అర్థం చేసుకోగలవని - నా సీతను — నా చిట్టి తల్లిని ఆదరించగలవనీ ఆశిస్తున్నాను.

చూడు పతీ! నేనింతవరకూ ఏమీ నిన్ను అర్థించలేదు. చలాకీ అనుకో, ఆడంబరం అనుకో, గర్వం అనుకో, లేకపోతే దురదృష్టం అనో, విధి అనో అను. నా ప్రవర్తన నన్ను నిలువునా కాల్చి కరిగించేసింది. తల్లి చేసిన తప్పుకి పిల్ల శిక్షార్హురాలు కాదు.

ఆలోచించు పతీ! కనీసం నామీద జాలి చూపించు. ఈ అభాగ్యురాలి కూతుర్ని ఆదరించు. నీ నిర్ణయం చెప్పు. నా బంగారు బొమ్మ భవిష్యత్తును ఏం చెయ్యదలిచావు?" కమల కంఠం సముద్ర తరంగాలుగా ఘోష పెట్టింది.

పతికి అప్పటి అక్కడి వాతావరణం ఇరుకుగా వున్నట్టనిపించింది. ఇబ్బంది పెడుతున్నట్టనిపించింది. తొందరపడి ఏ నిర్ణయాన్నీ తీసుకోడతను. అదే అతనిలో వున్న ప్రత్యేకత.

కమల అతని కడుపులో ముఖం దాచుకుంది. బాధపడుతూ విలపిస్తోంది. అప్రయత్నంగా పతి చేతులు ఆమెను నిమరసాగాయి. వెల్లకిలా పడుకుని ఆ చేతుల్ని గుండెమీదకు చేర్చుకుంది కమల.

"కమలా! నీలో నటన ఎక్కువ కదూ?"

"అవును పతీ! నేను నటినేం! నేను నటిస్తానేం! నా జీవితం నటన కదూ?" అంటూ విసురుగా లేచి, ఏడుస్తూ, గట్లమ్మట పరుగెత్తింది కమల. "కమలా" కేక వేస్తూ ఆమె వెంట పరుగెత్తాడు పతి, దీపాన్ని పట్టుకుని.

కొంత దూరంలో కాళ్ళు తడబడి సత్తువ లేనట్టుగా పడిపోయిందామె. దరిచేరి ఆమెను ఒడిలోనికి తీసుకున్నాడు పతి. ఏడుస్తోందామె. ఆమెను తన హృదయానికి గట్టిగా హత్తుకున్నాడతను.

"కమలా! నన్ను క్షమించవూ" పతి కంఠం వణికింది

ఆమె అతని భుజాన్ని కరుచుకుని చంటిపిల్లలా ఏడుస్తూనే వుంది.

"కమలా! నువ్వెంత ఎదిగిపోయావో తెలుసా! చాలా ...... చాలా ...... ఎదిగిపోయావు. నీలో ఇప్పుడు మహా




పురుషులలో వున్నంత పవిత్రత వుంది. పవిత్రమైన తల్లి ప్రేమ వుంది. అన్నింటినీ మించి పరివర్తన వుంది. నువ్వు పవిత్రురాలివి కమలా! నువ్వు కర్పూరపు బొమ్మవి. నీ కూతురు సీత నా సంరక్షణలో నీ అంత ఎదుగుతుం..."

అతని పెదవుల్ని తన పెదవులతో సున్నితంగా అద్దుతూ కన్నీటితో చూసిందామె.

మల్లెమొగ్గల్లా జల్లు కురుస్తోంది. మలయమారుతంలా గాలి వీస్తోంది. ఆ రెండు హృదయాలూ ప్రకృతి విన్పిస్తున్న నిశ్శబ్ద సంగీతాన్ని ఆలకిస్తున్నాయి.

*   *   *

ఆ చలిగాలిలో వంటినిండా చీర కప్పుకుని – పతి పెట్టిన పసుపూ కుంకుమనూ గుండెకు హత్తుకుంటో గుమ్మం దాటుతున్న కమలని—"ఈ ప్రయాణం ఎక్కడి" కంటూ ప్రశ్నించాడు పతి బాధగా

కోటి కాంతులతో అతని వైపు చూసిందామె.

"పవిత్రమైన కడలి తరంగాల మీదకి. స్వచ్ఛమైన నీలాకాశపు టంచులలోనికి. అనురాగాన్ని-ఆత్మీయతనీ-అనుబంధాన్ని కోరుకుంటో నీలాంటి మహనీయులను వెతుక్కుంటో పోతాను."

కిన్నెరలా కదిలింది కమల.

ఆమె వెళ్ళిన వైపే చూస్తున్న పతిని-గుంజి, ఆరాటంతో, ఆతృతతో అడిగింది కాంత—"ఏమిటండీ— ఇదంతా! అర్ధరాత్రిపూట ఆమె రావడం ఏమిటి? మీరూ ఆవిడా పొలాల గట్లమ్మట కూర్చోవటం ఏమిటీ!? తెచ్చిన పిల్లని మన ఇంట్లో వదిలేసి ఆమె వెళ్ళిపోవడం ఏమిటి!!! నా చేత ఆమెకు పసుపు కుంకుమ ఇప్పించడం ఏమిటి! ఇంతకీ ఆమె ఎవరండీ???"

"నా మొదటిభార్య" అన్నాడతను హృదయపూర్వకంగా

# మిడిల్ క్లాస్

అరిగె రామారావు

మాది మధ్యతరగతి కుటుంబం. మిడిల్‌క్లాస్ ఫామ్లీ అంటారే-అదన్న మాట! మీదీ మధ్యతరగతి కుటుంబమే. ఆయన్దీ అదే! ఈయన్దీ అదే! ఇంకో ఆయన్దీ, మరింకో ఆయన్దీ అదే! వేలాది, లక్షలాది, కోట్లాది మధ్యతరగతి కుటుంబా లున్నాయి మనదేశంలో. అందులో మాదీ ఒకటి! అంటే-ఒక కాలు విరిగిన కుర్చీ; ఒక తాడు తెగిన వుట్టీ; ఇంకా చెప్పాలంటే వోటికుండ, గొర్రెతోకా, తుమ్మితే వూడే ముక్కూ...ఇలా ఎన్నో చెప్పుకోవచ్చు! ఎన్ని చెప్పుకున్నా, ఎంత చెప్పుకున్నా, ఎవరు చెప్పుకున్నా ఎన్నాళ్లుగా చెప్పుకున్నా ఇది తరగని కథ-మామూలు కథ-మాటి మాటికి మొదలయ్యే కథ. ఏళ్లు వెనక్కి పోతున్నా, దేశం ముందుకు పోతున్నా, పాలకులు మారుతున్నా శాసనాలు జరుగుతున్నా, ఇది మాత్రం మారని-మామూలు కథే!

కాకపోతే యింటికీ--యింటికీ కాస్త అటూ ఇటూ మారుతూ వుంటుంది. అలాగే ఒక యేడుకు మరో యేడుగూకుడి ఎడంగా మారినా మారవచ్చు. దానికి రెడీమేడ్ దాఖలా ఏమిటంటే - నేను పోయిన సంవత్సరం కిర్సనాయిలుకోసం డబ్బా పుచ్చుకుని 'కొట్లముందు పడిగాపులు పడ్డాను. ఈ సంవత్సరం వేరుశనగనూనెకోసం డబ్బా పట్టుకుని పడిగాపులు పడుతున్నాను. దట్సాల్. అంతే తేడా! డబ్బా మారింది. రేపు వుప్పుకోసం తాటిచిప్ప పట్టుకుని నిలబడవచ్చు. అది వేరే సంగతి!

నేను వుద్యోగరీత్యా-ఎవరో కవి 'పసిడినాగరం' అన్నాడే-అదిగో ఆ నాగరంలో - భాగ్యనగరంలో - హైద్రా

బాద్. నగరంలో వుంటున్నాను ఏ నగంరలో వుంటున్నా మనందరి కథా ఒక్కటే అని నా వుద్దేశం! ఈ కథంతా చదివి మీరే అవునో, కాదో చెప్పాలి!

ఈ పసిడినాగరంలో ఒక బుడుపులో, ఒక వాడలో, ఒకానొక పాత మేడలో, మేడలోని చవుడుగోడల జమిలి గదుల పోర్షన్లో అద్దె కుంటున్నాము. ఈ వాడా, ఈ మేడా, ఈ చవుడు గోడలూ శాశ్వతం కాదు. వోనర్ లేక వోనరీ అద్దె పెంచితే మరో వాడకి పోతాం. అంటానికి తేలిగ్గానే అన్నాను. మరో వాడకి మేడకి పోవటం ఎంత కష్టమో తెలుసా? నేను ఆఫీసు కెళ్ళిన తర్వాత, భోజనాలూ అవీ చేసి మధ్యాహ్నపూట మా ఆవిడ ప్రక్కింటామెను (ఆమెకు ఏ మాటలు చెప్పి, ఎలా వుచ్చేసి వప్పిస్తుందో నాకయితే తెలియదు. అది మా ఆవిడ పని!) తోడు తీసికొని వాడ వాడా తిరగాలి. ప్రతి యింటిముందూ నిలబడి 'అద్దెకిచ్చే పోర్షన్లు ఏమన్నా వున్నాయా!' అని అడగాలి. ఆదివారాలు నేను అద్దెసైకిలు తీసికొని (పల్లీలు తింటూ) గల్లీలన్నీ తిరగాలి. ఆఫీసులో కోళ్లర్కి, ముఖ్యంగా ప్యూన్సుకు చెప్పాలి—వాళ్ళ వాకూబులో పోర్షన్లు ఏమన్నా వున్నాయో చెప్పమని. పాచి పనిచేసే మనిషితో, పాలసైకిలు పోరడితో, గుడ్డలుతికే దోభీతో, పేపరేసే కుర్రాడితో రోడ్డులూడ్చే మనిషితో,



ఆఖరికి బిచ్చానికొచ్చే ముష్టి వెధవలతో సహా అందరికీ చెప్పుకోవాలి!

పైది అద్దె యిళ్ళ భాగోతం. ఇక యింటిలో భాగోతం పాపం; మా ఆవిడ నా మురికి గుడ్డలన్నీ వుతుకుతుంది. గుడ్డలన్నీ అంటే ఎన్ని! రెండు టెర్లిన్ షర్టులు, తన గుడ్డలూ మా యిద్దరి వెధవల మురికి నిక్కర్లూ, మురికి చొక్కాలు వుతుకుతుంది. ఈ కుళ్ళు గుడ్డల మురికి బాగా పోతుందని మా యిళ్ళదగ్గర వున్న ఒక సబ్బుల ఫాక్టరీకి వెళ్ళి బకెట్‌తో పది పైసల సబ్బు నీళ్లు కొనుక్కొని వస్తుంది. పని మనిషితో పోట్లాడుతుంది. అది నాగాలు పెట్టితే జీతంలో కోసుకుంటుంది. పాల వాడితో పేచీలు పడుతుంది. 'ఎగస్ట్రాల' లెక్కల్లో కాస్త వాడ్ని మోసం చేయటానికే ప్రయత్నిస్తుందని నా అనుమానం. (అనుమానమే సుమండీ!) మళ్ళీ మీరీ మాట ఆవిడ దగ్గర అనేరు! 'ఆ బుద్ధులన్నీ మీ వాళ్ళకే!' (అంటే మా అమ్మకు, అక్కయ్యలకు, వదినోళ్లకూ!) అని తెగ సాధిస్తుంది.

సాయంత్రంపూట ఇరుగు పొరుగమ్మలను వెంటేసుకుని శంకరమఠం దగ్గరకెళ్ళి గీచిగీచి బేరాలాడి, మొగ్గలడిగి కూరలు కొనుక్కొని వస్తుంది. వాడు తురకంలో తిట్టితే 'వెధవను నేను తెనుగులో తిట్టాలే!' అని నవ్వేసి, తనకు తాను సమాధానపడుతుంది

కూరల మార్కెట్ ప్రక్కన వున్న సెకెండ్‌హాండ్ పుస్తకాల షాపులోంచి అద్దెకు నవల్స్ తీసుకొస్తుంది. మధ్యాహ్నాలు వంటయింటికి గొళ్లెం పెట్టి ఆ అద్దె నవలలు చదువుతూ కూర్చుంటుంది. మా ఆవిడ వూరి కెళ్ళినప్పుడు సెక్స్ పుస్తకాలు అద్దెకు తెచ్చుకుని నేనూ చదువుతాననుకోండి!

మొదటి రెండు ఆదివారాలు నేను టిఫిన్‌బాక్స్ ఒకటి తీసుకుని మాంసం దుకాణానికి వెళ్లతాను. నెల చివరి రోజుల్లో యింట్లో వున్న పాత పేపర్లు అమ్మి కాలక్షేపం చేస్తాం. నాకు వచ్చే ముష్టి మూడొందల జీతం డబ్బులు ఈ హైదరాబాదు నగరంలో నెల చివరిదాకా వస్తాయా మరి? మా ఆవిడ ప్రక్కిళ్లకు చెంచాలూ, గిన్నెలూ, చేటలూ పట్టుకుని అప్పు కెళ్ళుతుంది. మా యింటికి బంధువు లెవరైనా వస్తే ఆఫీసులో చేబదుళ్ళు చేస్తాను. అవి పుట్టకపోతే ఆఫీసు ప్యూను దగ్గర వడ్డీలకు అప్పు తీసుకుంటాను. ఆ వచ్చిన బంధువులు తిరిగి వెళ్లుతూ పిల్లల చేతిలో పదీ పరకా పెడితే నేనూ, మా ఆవిడా కలసి ఆ పిల్ల వెధవలను అల్లించి బెల్లించి ఆ డబ్బులు కాస్తా కాజేస్తాం. వాటిని మరోవాటికి ఎడ్జస్టమెంట్.

మా ఆవిడ పుట్టింటి కెళ్ళి వస్తూ వాళ్ళమ్మనూ, చెల్లెళ్ళనూ అడిగి పాత చీరలూ, వోణీలూ గట్రా తీసుకొస్తుంది

వాటిని - స్టీల్ సామానువాళ్లకు పడేసి ఎ గిన్నో కొంటుంది (గుడ్డలు కాక పైన డబ్బులుగూడ ఇస్తుందేమోనని నా అనుమానం!) ఆ గిన్నెను అందరికీ చూపించి మురుసుకుంటుంది. ఒక్కొక్క సారి ఆ పాత చీరల్లో బాగున్న చీరను అట్టే పెట్టి తనే కట్టుకుంటుంది.

బయట చేరే రోజుల్లో కూడ యింట్లోనే వుంటుంది. అంతా కలిపేసుకుంటాం. ఎవరన్నా బంధువులొస్తే మాత్రం ముఖ్యంగా మా అమ్మ వస్తే బుద్ధిగా మూల కూర్చుంటుంది. ఈ తేదీలూ అవి నాకు గుర్తుండి చావవు. కాబట్టి, ఎప్పుడన్నా నా మీద కోపంగా వుంటే 'దూరం బయటున్నా!' అంటుంది. వున్నా లేకపోయినా నమ్మాల్సిందే!

ఇక రాత్రిళ్ళు ఈ పిల్ల వెధవలు యిద్దర్నీ నిద్రలు బుచ్చి మేమిద్దరమూ మాటామంతీ ఆడుకోవటానికి చేసే ప్రయత్నం-అదొక జాతర! ఎవరైనా బంధువులొచ్చినప్పుడు ఈ రెండు గదుల కొంపలో రాత్రుళ్ళు పక్కల ఎరేంజ్‌మెంట్-అదొక సిగ్గుచచ్చే పని! వచ్చిన వాళ్ళల్లో జంటలూ-అందునా పడుచు జంట వుంటే మరీని మా ఆవిడ తెలివైనది! ఆ పర్మిటేషన్స్, కాంబినేషన్స్ ఎలా చేస్తుందో ఏమిటో! మొత్తానికి ముసిముసిగా నవ్వుతూ నా పక్కలోనికి వచ్చేసి, "వూం, జరగండి!" అంటుంది నా పక్క అంటే-అది ఆ వచ్చిన బంధువుల్ని బట్టి వుంటుంది. ఒక్కొక్కసారి ఆ పక్క వంటిల్లూ, వరండా, నూతిపళ్లెమూ, దొడ్లో జామి చెట్టు క్రిందా, కాదూ - మా పాత మంచమూ ... ఇలా మారిపోతూ వుంటుంది.

ఇలా ఎలాగో రోజులు నెట్టేస్తున్నాం. మీరూ ఇంతే అనుకుంటా! అదిగో, ఆయనా ఇంతే అనుకుంటా! ఇదిగో, ఈయనా అంతే అనుకుంటా.

ఇలా ఈ మిడిల్‌క్లాస్ ఫామిలీస్‌లో ఎన్నో సమస్యలు, మరెన్నో ఎడ్జస్ట్‌మెంట్స్, ఎన్నింటికో రాజీపడాలి. ఎన్ని సరదాలకో సలాం కొట్టాలి. సరదా అంటే-అసలు విషయం గుర్తొచ్చింది. నాకు సినిమాలు చూడటం అంటే సరదా! గమ్మత్తుగా మా ఆవిడకీ ఈ సరదా వుంది. మా యిద్దరికీ వుంది కాబట్టి ఆటోమెటిక్‌గా మా యిద్దరు వెధవలకూ వచ్చేసింది.

అసలు మాట్లాడితే ఈ బ్లడీ మిడిల్ క్లాస్ గాడికి ఈ సినిమాలన్ను మించిన వినోదం, రిక్రియేషన్ ఏముంది? క్లబ్బులకు పోలేడు. టెన్నిస్ ఆడలేడు. బ్రిడ్జ్ ఆడలేడు. కేబెరా డ్యాన్సులు చూడలేడు. కాసులుపోసి రేసులు ఆడలేడు. మరింకేం చేయగలడు? సినిమా చూడగలడు. వచ్చే ప్రతి సినిమా చూడగలడా? చూడలేడు దానికికూడ

ఎడ్జస్ట్‌మెంట్ కావాలి. అసలు సిన్మా అంటూ చూడటం మొదలుపెడితే ప్రతి సిన్మానూ చూడాలనిపిస్తుంది. మరది అసాధ్యమైన విషయం. కనీసం ప్రతి సిన్మాను గురించీ తెలుసుకోవా లని పిస్తుంది. దానికిగాను సినిమా పత్రికలు చదవాలి. వాటిల్లోనూ ఒక్కొక్క సిన్మాను గురించి ఒక్కొక్క 'రస వత్తర ఘట్టం' రాస్తుంటారు. మరి మిగతా 'రసవత్తర ఘట్టాల' సంగతి?

దానిగ్గాను మేం ఏంచేస్తున్నామంటే అదిగో మా ఆవిడ వచ్చేస్తోంది. అమ్మో చిటపటలాడుతోంది. చిందులు త్రొక్కుతోంది. అసలే ఎర్రనయిన మొగం, కోపంతో మరీ ఎర్రనయింది. చేతిలోని కూరలసంచిని ఒక మూలకు గిరవాటే సింది.

"ఏమయింది ఇందూ!" భయం భయంగానే అడిగే.

"నా బొందయింది!"

మళ్ళీ తనే అంది: "నేనా రోజు చెప్పితే విన్నారా?"

"ఏ రోజు? ఏం చెప్పావు!"

"సెక్రెటరీ సిన్మా బాలాజీలోకి వస్తుంది. అందరం కలసి వెళ్దాం అంటే విన్నారా? రెండూ ముప్పయి తగలేసి ఒక్కరే వెళ్ళి ఆ సుదర్శన్‌లో చూచివచ్చారు."

నేను అమాయకంగా, ఆ రాత్రే నీకు కధంతా, చివరికి లవ్‌సీన్స్‌తోసహా చెప్పాను కదే!" అంటూ ఆ లవ్‌సీన్‌ను అభినయించటానికి మా ఆవిడ నడుం చుట్టూ చెయ్యేసి దగ్గరకు లాక్కొన్నాను.

విసిరికొట్టింది. "మీరు చూస్తే సరా! మేం చూడొద్దూ! అందులోకీ ఇది వాణిశ్రీ సిన్మా ఆయె!" అంది.

"ఇంతకీ ఇది బాలాజీలోకి వచ్చిందని ఎవరు అన్నారు?" మాట మార్చ డానికి అన్నాను.

"శంకర్‌మఠం దగ్గర బోర్డ్ వేశారు!

ఇక్కడ చిన్న వివరణ అవసరం. ఈ వూళ్లో మనలాంటి మిడిల్‌క్లాస్‌గాళ్లు సిన్మాలు చూడ్డానికొక చిన్న సమ పాయం వుంది. ప్రతి క్రొత్త సిన్మా-పొరుగూర్నుంచి వచ్చిన బంధువులు తెల్సినవాళ్ళందరి యిళ్లకెళ్ళి పలకరించి వచ్చినట్లుగా - ప్రతి హాలులో కొన్నేసి రోజులు ఆడుతూ నగరం నాలుగు మూలల్నీ పలకరించి పోతాయి. ఆ పలకరింపులో మేముంటున్న ఏరియాలో వున్న బాలాజీ, రహత్‌మహల్ లాంటి హాల్సుకి వచ్చిపోతాయి. ఈ హాల్సులో సిన్మా టికెట్ ఖరీదు తక్కువ, మనం వెళ్ళే క్లాస్ రూపాయి ఇరవై పైసలే! అదే ఆడవాళ్ళు ఒక్కరూ వెళ్ళితే అరవై పైసల. కాబట్టి మేం ఈ హాల్స్‌కు క్రొత్త సినిమాలు 'పలకరింపుకు' ఎప్పు డొస్తాయానని కలవరిస్తూ కాసుకుని

కూర్చుంటాం. మిగతా హాళ్ళలో ఒక్క సిన్మా చూచేది, ఈ హాళల్లో రెండు సిన్మాలు చూడవచ్చు. కొన్ని క్రొత్త సిన్మాలు నేరుగా ఈ హాళ్ళ లోనే రిలీజవుతాయి. అప్పుడు మాకు పండుగే! కాని, కొన్ని సిన్మాలు డిమాండ్‌ను బట్టి, ఈ హాల్స్‌కి వచ్చే సరికి రెండు మూడు నెలలు కూడ పట్ట వచ్చు. అంతవరకు వోపిక పట్టలేక పోతే నేనో, మా ఆవిడో ఎవరో వెళ్ళి చూచి వస్తాం. —అలా చూచినవాళ్ళు రెండోవాళ్ళకి సెన్సార్ సర్టిఫికేట్ దగ్గ ర్నుంచి, 'శుభం' దాకా పూస గ్రుచ్చి నట్లు, డైలాగ్స్ సహితం వల్లెవేస్తూ చెప్పాలి. అదీ షరతు! నేను ఇంటి దగ్గర వున్నట్లయితే పిల్లలకు అన్నాలు పెట్టటం, ఎంగిలి కంచాలు కడగటం నా వంతు. ఈ మధ్యే మా పెద్దాడు కూడ తన 'దోస్తులు' తో కలసి సిన్మాలు చూసి వస్తోన్నాడు. వాడూ మాకు కథ చెప్పాల్సిందే! వాడు చూచేవన్నీ స్టంట్ సిన్మాలు. వాడయితే స్టంట్ కూడ చేసి చూపెడతాడు. వెధవది మ్యూజిక్‌ను కూడ నోటితో ఆలపించి వినిపిస్తాడు.

ఇలా సిన్మా కథను చెప్పటం, చెప్పించుకోవటం మాకొక తియ్యటి అనుభవం!

అదెలాగో మనవి చేస్తాను—

'అడిగేవాడికి చెప్పేవాడు లోకువ', అన్నారు కాని, ఇక్కడ మాత్ర 'చెప్పేవారికి అడిగేవారు లోకువ!' నేను సిన్మా కథ చెప్పే రోజున నేను మా యింటికి రాజును. అలాగే మా ఆవిడ ఒకరోజు రాణి అవుతుంది. (ప్రతి రోజూ వంటింటి మరియు పడకటింటి రాణీగూడ— అది వేరే విషయం.) మరో రోజు మా పెద్ద వెధవ "మాస్టర్ రాజు" అవుతాడు.

నేను కథ చెప్పే రోజున ఆ సాయం త్రం నుంచే పెద్ద పోజులు వేస్తాను, పెత్తనం చెలాయిస్తాను.

"ఇందూ, కాఫీ!"

"ఏం వళ్ళు ఎలా వుంది? ఇంతకు ముందేగా టీ తాగారు."

"ఇంతకుముందు టీ త్రాగితే, ఇప్పుడు కాఫీ త్రాగకూడదని వుందా? అయితే ఇవ్వాళ 'రాజు వెడలె'.. " అని చిన్న మ్యూజిక్ బిట్‌ను నోటితో ఆలపిస్తూ, దర్జాగా ఠీవిగా కాళ్లు వూపుతూ కూర్చుంటా.

నెత్తి కొట్టుకుంటూ "కర్మ, ఇదొకటి వుందిగా 'ఫ్లాంచేస్తా! తెస్తా —" అంటుంది.

ఆ సాయంత్రం ఈ వెధవలిద్దరిచేత పాత పాఠాలన్నీ శ్రద్ధగా చదివిం చేస్తా. వూఁ, ఆఁ - అంతే-వుందిగా- 'రాజు వెడలె-', నా మ్యూజిక్ బిట్ వచ్చినట్లు చదువుతారు. "అరేయ్, పాఠాలు చదవకపోతే నాన్న 'రాజు

వెడలె' సిన్మాకథ చెప్పడురా," అని వాళ్ళల్లో వాళ్ళు చెప్పుకుంటూ శ్రద్ధగా చదువుతారు

మా ఆవిడ తొందర తొందరగా పనులన్నీ చేసుకొని స్నానమదీ చేసి వస్తుంది. నా యిష్టాన్నిబట్టి మా ఆవిడ్ని లూజుగా చెవులమీదకు వచ్చేటట్లు జడ వేసుకోమంటా; లేకపోతే రెండు జడలు వేసుకోమంటా. అదీ కాకపోతే డిప్ప తగిలించుకొని కొప్పు పెట్టుకోమంటా. బొడ్డు క్రిందకు జార్చి చీర కట్టమంటా.

"ఇవన్నీ చేయటానికి నేనేం 'సాని పాపను' అనుకున్నారా?" అని కస్సున లేస్తుంది.

వెంటనే నేను "అయితే - 'రాజు వెడలె' — " అని దీర్ఘం తీస్తూ నా మ్యూజిక్ బిట్ ఎత్తుతా. 'ఇదొకటి వుందిగా' అని అంటూ నేను చెప్పినట్లు చేస్తుంది. ఆ పూట నేను ఏ వేషం వెయ్యమంటే ఆ వేషం వేస్తుంది.

తొందర తొందరగా మా అందరికీ అన్నాలు వడ్డించేస్తుంది. అన్నాల దగ్గర రోజూ కొట్టుకునే మా వెధవలు నోరు మూసుకుని తింటారు.. ఏమన్నా చేసారో, నా దగ్గర 'సిన్మాకథ' ఆయుధం వుందిగా? 'రాజు వెడలె' - మ్యూజిక్ బిట్! .

అన్నాలు అయ్యేక తొందరగా మంచాలు ఎక్కుతాం నలుగురం ఒకే మంచం పిల్లల్ని చెరొక ప్రక్క వేసుకుంటాం పిల్లలిద్దరు నా ప్రక్కనే పడుకుంటామని పేచీ పెట్టారనుకో — 'రాజు వెడలె'—మ్యూజిక్ బిట్ లైటార్పేస్తాం కిటికీలోంచి సన్నటి వెన్నెల వెలుగు లోపల పడుతూ వుంటుంది. మా ఆవిడ చెంపలు మెరుస్తూ వుంటాయి. మెడ క్రిందనుంచి, జుట్టులోంచి కమ్మటి పరిమళం, క్రొత్తవేషంతో (నేను వేయించిందే!). క్రొత్తగా కనిపిస్తుంది! దగ్గరకు లాక్కుంటూ చేతుల్లోకి పొదుము కుంటు ఆ సన్నటిచీకట్లో భయపడ్డ బల్లిలాగా నన్ను కర్చుకుంటుంది.

"అబ్బ, ఏంటి నాన్నా లేట్ వూఁ— స్టార్ట్ యువర్ స్టోరీ!" అంట్టాడు మా పెద్దాడు.

ఏంటో వాడికేం తెలుస్తుంది. ఆ చీకట్లోనే మా ఆవిడ నములుతున్న తాంబూలం కమ్మంతా నా నోట్లోకి ట్రాన్స్ఫర్ చెయ్యమని నాలికతో పోట్లాడుతా.

"ఛీ, పాడు!"

"అయితే సిన్మా కాన్సిల్!"—— మ్యూజిక్ బిట్

"అబ్బ, మళ్ళీ ఏమయింది నాన్నా?" చిన్నాడు అసహనంగా అంటాడు

మా ఆవిడ రాజీకి వస్తుంది ఒకొక్కసారి కాళ్ళు వత్తమంటా "ఏం తీపడం నేనొత్త—" అంటుంది "అయితే నేను చెప్పా—" మ్యూజిక్ బిట్! పిల్లలు



అసహ్యంగా "వత్తమ్మా!" అంటారు. ఇలా రాజపోకిళ్లు పోతాను.

మా వెధవ ఈ ఆలస్యాన్ని భరించలేక టైటిల్స్ వాడే స్టార్ట్ చేస్తాడు.

"......ప్రొడక్షన్స్ సమర్పించు... నోటితో మ్యూజిక్ బిగిన్ చేస్తాడు.

"శోభన్‌బాబు - జయసుధ...... ఇలా మా రెండో వెధవ కాస్టింగ్స్ చెప్పేస్తాడు.

"చెప్పేది మీరూ - వినేది మేం!" అని మా ఆవిడ మునిపంటితో నా చెవి కొరికి కిలకిలా నవ్వేస్తుంది.

ఇక నేను చచ్చినట్లు చెప్పుతాను. కాలేజీలో చదివే రోజుల్లో నాకు నాటకానుభవం కాస్త ఏడ్చింది, కాబట్టి టైమింగ్ మాడ్యులేషన్, మన్నూ మశానం మషాలాలు చేర్చి, డైలాగ్స్‌ను పాత్రానుగుణంగా వల్లెవేస్తా. అలా

చెప్పుతున్నప్పుడు ఎప్పుడో వేసిన కాలేజీ నాటకానుభవం, సిన్మాలల్లో నటించాలనే (శాశ్వతంగా వాయిదాపడ్డ) మోజూ - సాకొక 'మూడ్' నిస్తాయి. ఆ మూడ్‌లో నేను ప్రతి బిట్టూ చాల ఇంటరెస్టింగ్‌గా చెప్పుతా. అందుకే మా ఆవిడా, పిల్లలూ నేను చెప్పే సిన్మా కథకోసం చెవి కోసుకుంటారు; సిన్మా చూడకపోయినా నేను చెప్పే కథ విని తృప్తిపడతారు.

సిన్మాలో లవ్‌సీన్స్ (రకరకాలఆల్బమ్ ఫోజులు అంటే సరిగ్గా వుంటుందేమో) చెప్పవల్సి వచ్చినప్పుడు—శోభన్‌బాబు జయసుధను ఇలా చేశాడు అలా చేశాడు అంటూ— ఆ కాసేపు నేను శోభన్‌బాబూ, మా ఆవిడ్ని జయసుధగా వూహించుకొంటు ప్రత్యక్ష వ్యాఖ్యానంతో చెప్పుతా.

మా ఆవిడ నన్ను విదిలించికొట్టి, నా చేతుల్లోంచి విదిలించుకుని, "బాబూ మీ సిన్మాకథకూ, మీకూ ఒక దణ్ణం. నా వళ్ళు హూనం చేసేశారు" అని అంటుంది.

"మరిక్కడ ఒక సాంగ్ వుంది. పాడనా, చెప్పనా" —అని అడుగుతా.

"బాబూ, మీకొక దణ్ణం! పాడొద్దు. పాట తర్వాతది చెప్పండి," అని చేతులు జోడించి మరీ వేడుకుంటుంది. నేను నవ్వేసి పోన్లే పాపం అని వదిలేస్తా. కామెడీ చెప్పుతున్నప్పుడు పిల్లలిద్దరూ కడుపు చేత్తో పట్టుకుని పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వుతారు. వాళ్ళ నవ్వు చూస్తోంటే నా కడుపు నిండిపోతుంది.

మధ్య మధ్యలో వుండి వుండీ యిద్దరు వెధవల్లో ఒకడు చిటికెనవేలు చూపిస్తాడు. 'నాన్నా, నేనొచ్చేవరకు కథ చెప్పొద్దు!' అని మరీ మరీ హెచ్చరించి బయటి కెళ్తాడు. బాత్‌రూం లోంచే మళ్ళీ "నాన్నోయ్, కథ చెప్పకు!" అని గావుకేకలు పెడతాడు.

భయంకరమైన క్రైమ్ సన్నివేశాలను వినేవాళ్ల గుండెలు భయంతో బితుకు బితుకు మనేటట్లు ఆపి ఆపి, సాగదీస్తూ నోటితో మ్యూజిక్ వేస్తూ చెప్పుతా. మా ఆవిడ భయంతో నన్ను కర్చుకుంటుంది. "ఇక చాలు - మిగతాది చెప్పండి-" అంటుంది. మా పెద్దాడు, "కాదు అదే చెప్పు నాన్నా!" అంటాడు. మా ఆవిడ వాడి వీపుమీద ఒకట్టి తగిలించి, "వెధవా! వేలెడు లేవు. ఇప్పట్నుంచే నీకు క్రైమ్ సీన్సా? పెద్దయితే రౌడీ వెధవ్వి అయ్యేటట్లున్నావు!" అని అంటుంది.

నేను సిగరెట్లు కాల్చుకోవాలనుకున్నప్పుడు మ్యూజిక్ యిచ్చి, 'విశ్రాంతి' అని చెప్పేసి, 'ఆఁ—, చుట్టా బీడీ సిగరెట్—' "టీ, టీ," అని అంటూ లేచి లైటేసి సిగరెట్ వెలిగిస్తా. మా ఆవిడ కోపంగా, "ఎక్కడయినా ఇన్ని విశ్రాంతులుంటాయేంటీ!" అని దీర్ఘం తీస్తుంది. "ఇది బాగా పాతకాపీ.




కట్స్ చాలా వున్నాయి" అని సమర్థిస్తా.

ఇవన్నీ గుర్తుపెట్టుకుని తను కథ చెప్పాల్సి వచ్చినప్పుడు రకరకాలుగా నన్నేడిపించుకుని తింటుంది. సగం చెప్పి, "మిగతా రీళ్ళు ఇంకా రాలేదు సార్!" అని పూరిస్తుంది. ప్రేమ సన్నివేశాలను సరిగ్గా చెప్పకుండా తేల్చి పారేస్తుంది. నేను తరచి తరచి వివరాలు అడిగితే, "సెన్సార్ కట్ చేసింది. ఇది ఇంతే!" అని కిలకిలా నవ్వేస్తుంది. తను కథ చెప్పేరోజు సాయంత్రం నా చేత వంట చేయిస్తుంది. పూలు గుచ్చుకుంటూ నన్ను ఒక్కొక్క పువ్వే అందించమంటుంది. మరేం చేస్తా? చచ్చినట్లు చేస్తా.

ఏ మాటకామాటే చెప్పాలి. మా ఆవిడ గొంతు బాగుంటుంది పెళ్ళికాక ముందు అది సంగీత సాధనకూడా చేసింది. సిన్మా పాటలు చక్కగా పాడుతుంది. తను సిన్మాకథ చెప్పుతున్నప్పుడు పాటలు పాడే సన్నివేశం వచ్చినప్పుడు తను ఆ పాట పాడి వినిపించేవరకు గొడవచేస్తాను. తన శ్రావ్యమైన కంఠంతో గలగలా మాట్లాడుతున్నప్పుడు వినటానికి ఎంతో ముచ్చటగా వుంటుంది. మా ఆవిడ మాట్లాడుతుంటే రిథమిటిక్‌గా వుంటుంది; సంగీతం వింటున్నట్లుగా వుంటుంది. చీకటి గదిలో, కిటికీలోంచి పడే లేత వెన్నెల సన్నటి చారికలను చూస్తూ, మా ఆవిడ మధుర కంఠం పలికే మాటలు వినటం ఒక తియ్యటి అనుభవం. అందుకే, ఎక్కువసార్లు మా ఆవిడ్నే సినిమాకు

పంపిస్తూవుంటాను. ఇరుగుపొరు గమ్మలతో అరవై పైసల మ్యాట్నీ సిన్మాకెళ్ళి వస్తుంది. ఆ సిన్మా కథ లన్నీ నేను చెప్పించుకుంటాను. ఒక్కొ క్కసారి ఆ సిన్మాను అంతకుముందే చూచివుంటాను. మా ఆవిడచేత కథంతా చెప్పించుకున్నాక చివర్లో మెల్లగా ఈ విషయం బయటపెట్టుతా. అప్పుడామె కోపం చూడాలి. నా బుగ్గలు రెండూ పిండి పెట్టుతుంది. ఉక్రోషంతో చాప వేసుకుని క్రింద పడుకుంటుంది. ఆ ఉక్రోషం చూస్తే నాకు బలే సరదా!

మా పెద్ద వెధవ చూచిన సిన్మాకథ వాడిచేత చెప్పించుకోవటానికి మేం యిద్దరం వాడ్ని రకరకాలుగా కాకా పట్టవల్సి వస్తుంది. పెద్ద పోజు పెట్టే స్తాడు. పిలిస్తే పలకడు. సీరియస్‌గా చూస్తాడు. ఎలాగో పట్టుకుని యిద్ద రమూ బ్రతిమాలుతాం. పది పైసలు లంచం అడుగుతాడు, లేకపోతే వాడి కిష్టమైన వేరుశనగపప్పు పాకంచేసి పెట్టమంటాడు. నా బాల్ పాయింట్ పెన్ ఇవ్వమంటాడు.

అయ్యా, ఇంతకీ చెప్పవచ్చిందేమి టంటే – ఈ బ్లడీ మిడిల్‌క్లాస్ ఫామి లీస్‌లో ఎన్నో రకాల ఎడ్జస్ట్‌మెంట్స్. అందులో ఈ సిన్మా ఎడ్జస్ట్‌మెంట్ ఒకటి. ఈ ఎడ్జస్ట్‌మెంట్ కూడా ఒక తియ్యటి అనుభవాన్ని ప్రసాదిస్తుంది. వున్న యిద్దరు వెధవల్నీ చెరో ప్రక్క వేసుకొని, చీకటింట్లో, ముచ్చటగా సిన్మా ముచ్చట్లాడుకుంటూ, కిటికీలోంచి కనిపించే ఆరచెక్క ఆకాశాన్నీ, లేత వెన్నెలలో తమాషాగా కదుల్తుండే కొబ్బ రాకుల్నూ చూస్తూ, నా చుట్టూ అల్లు కుని, నా గుండెలమీద తల పెట్టుకుని, నాకు అనిర్వచనీయమైన స్వర్గానందాని ప్రసాదిస్తూ, నా గుండెలు సేద తీరే టట్లుగా మధ్య మధ్యలో గలగలా, కిల కిలా నవ్వుతుండే అర్థాంగి – ఓహో, చాల తృప్తిగా వుంటుంది; చాల మధుర మైన సన్నివేశం. మిడిల్‌క్లాస్ లైఫ్ అవుతేనేం. దేశంలో ఎంతమంది స్వార్థ పరులు ఎన్నిరకాలుగా ఎన్ని తల కాయలు మార్చి గొప్పవాళ్ళయి పోతున్నా, ఈ వర్గాన్ని పైకి రానీయ కుండా ఎక్కడి కెక్కడ, ఎవరికందిన చోటల్లా, ఎవరికి వారు దగా జేస్తోన్నా మాది గొర్రెతోక బ్రతుకే అయినా, ఒక కాలు విరిగిన కుర్చే అయినా. ఒక తాసు తెగిన వుట్టే అయినా ఫర్వాలేదని పించే ధీమానీ, అలౌకికానందాన్ని ప్రసాదించే మధుర సన్నివేశం అది! అది ఎవరికి వారు చెప్పుకునే వోదార్పు. ఇలాటి చెదురుమదురు మధుర సన్ని వేశాలూ, వోదార్పులూ గనక లేకపోయి నట్లయితే, ఈ గడ్డుబ్రతుకు లీడ్చలేక ఎప్పుడో యింత విషం త్రాగి చచ్చి వుండేవాణ్ణి! మీరూ అంతే! అదిగో ఆయనా అంతే, ఇదిగో ఈయనా అంతే!

అవునో కాదో మీరే చెప్పాలి!



# వడ్డించిన విస్తరి

చెలూరి సీతారామేశ్వరరావు

**రా**జేశ్వరికి రెండ్రోజులనుంచి తల నొప్పిగా వుంటోంది. అయినా ఆమె భర్తతో చెప్పలేదు. గంగాధరానికి తెలిస్తే రంగాచారి దగ్గరకి పరుగెత్తి కషాయం పట్టుకొస్తాడని. ఆ రోజు సాయంత్రం మున్సబుగారింటికి పేరంటానికి వెళ్ళినప్పుడు అక్కడికి దగ్గర్లో వున్న రూరల్ ఆసుపత్రికి వెళ్ళింది. శేషుని అక్కడ చూసి నిర్ఘాంతపోయింది. "నువ్వా...నువ్వా..."

"శేషునే. ఇక్కడ డాక్టరుని." రాజేశ్వరిని చూడగానే అతడికి ప్రాణం లేచి

వచ్చింది రెండు రోజులైంది అతడు యిక్కడికి వచ్చి ప్రొద్దుటప్పుడు చెల్లాచెదురుగా పేషంట్లు వచ్చేవారు సాయంత్రం కాంపౌండరూ, తనూ గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడమే పైగా ఆసుపత్రి వూరికి దూరంగా వుంది. ఆ నిశ్శబ్ద వాతావరణానికి అతడు అలవాటుపడలేదు.

అప్రయత్నంగా కల్సుకున్నందుకు ఆశ్చర్యపడ్డారు. వద్దన్నా గతం గుర్తుకు వచ్చేస్తోంది యిద్దరికీ. నోళ్లు మూగనోము పట్టినా మనసులు మాట్లాడు కుంటున్నాయి.

శేషు వాస్తవంలో పడి కాంపౌండర్ని ఏదో పనితో వూళ్లోకి పంపించి రాజేశ్వ రిని ప్రక్క వసారాలోకి తీసుకెళ్ళాడు. "కూర్చో" అంటూ కుర్చీ చూపించాడు.

రాజేశ్వరికి తలనెప్పి స్థానంలో తీయని నెప్పి బయలుదేరింది. అందరి లాగే తామూ ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకుందా మనుకున్నారు. రాజేశ్వరి యింటికి రాగానే వాళ్ళ నాన్న సంబం ధంతో రెడీగా వున్నాడు. రాజేశ్వరి తన ప్రేమ కథ చెప్పి బావురుమంది.

"చేసుకుంటావా...నన్ను ఎండ్రిన్ తాగమంటావా?" తండ్రి సూటిగా అడిగాడు. రాజేశ్వరి కుటుంబానికి కట్టుబడి గంగాధరానికి రెండవ భార్య అయింది.

"నన్ను క్షమించు శేషూ" రాజేశ్వరి వెక్కి వెక్కి ఏడ్చింది శేషు దగ్గర కొచ్చాడు. ఆమె చెయ్యి గుండెలకి హత్తుకుని ధైర్యం చెప్పాడు, "విధి వెక్కిరించింది మనల్ని" అంటూ.

తర్వాత రాజేశ్వరి ఎన్నో ప్రశ్నలు వేసింది

నాకింకా పెళ్ళిచేసుకునే దైలమా రాలేదు. మీ వూరొచ్చి రెండ్రోజు లయింది. ఇంతలో హఠాత్తుగా మీ దర్శన మయింది.

రాజేశ్వరి మందు తీసుకోకుండానే యింటికి వెళ్ళిపోయింది. తలనెప్పి బాధ ఆమెకి లేదు. ఆ రాత్రి గంగా ధరంతో తమ వూరివాడే నని చెప్పి శేషుకి తమ యింట్లో రెండు గదులు యివ్వడానికి ఒప్పించింది. డాక్టరు అవసరం, అందులో అందుబాటుగా యాభై నిండాక తనకీ లాభమేనని గంగాధరం ఒప్పుకున్నాడు. తనకి లాభం లేకపోయినా రాజేశ్వరి కోరితే కాదనలేడు.

ఆ రోజునుంచి రాజేశ్వరిలో చైతన్యం వచ్చింది. ఇంతకుముందు లంకంత యిల్లు నైమిశారణ్యంలా కనిపించేది గంగాధరం ఎక్కువభాగం పొలంలోనే వుంటాడు. పాతిక ఎకరాలు సంపా దించినా అతడికి కాంక్ష పోలేదు. నిత్యా వసరాలు దగ్గరలో వున్నా రాజేశ్వరికి ఏదో వెలితి. అసంతృప్తి. రేడియో, పుస్తకాలతో కాలం గడపడం ఆమెకి దుర్భరమైంది.

శేషులో కొత్త వెలుగు వచ్చింది.

నేను గాబట్టి మీరిలా అర్ధరాత్రిళ్ల వస్తూన్నా,
శ్రద్ధగా భోజనం పెడుతున్నా!!




వున్న పోలీసోద్యోగి తనవైపు మొదట ఆశ్చర్యంగానూ, తర్వాత అదోలాగానూ చూడ్డం సీతారామయ్యగారికి ఆశ్చర్యం కలిగించింది.

"చూసారా సార్! మనిషిచూస్తే ఎలా వున్నాడో. అంతవయసొచ్చినా ఆ బుద్ధులు చూడండి. ఈ మనిషి చూస్తే పరిస్థితి యిలావుంది. 'ఇక్కడికి పోనియ్యి, అక్కడికిపోనియ్యి' అంటూ మొత్తం వూరంతా తిప్పి, రెండుగంటల్నుంచీ నా దుంపతెంపేస్తున్నారు సార్. 'నేనింటికి పోవాలి, మీటర్లో అయినంత మట్టుకు యిచ్చెయ్యండి' అంటే-యీ మనిషేమో తాగుబోతు మాటలాడుతుంది యీయనగారేమో డబ్బుల్లేవంటాడు. చూస్కోండి యెలావుందో ప్రపంచం ......" అంటూ యింకా ఏదో చెప్పబోయిన టాక్సీడ్రైవరు చట్టుక్కున ప్రక్కకితిరిగి, ఆశ్చర్యంగా చూసాడు.

పోలీసోద్యోగి అయోమయంగా చూసాడు.

ఆడమనిషి జాలిగా చూసింది.

కాని-తన కాళ్ళల్లో పట్టు సడలి చెవులు మొద్దుబారి, కళ్ళు మసకలకమ్మి, మెదడు దిమ్మెక్కి, గుండె స్థంభించి తను నేలకొరిగి పోతున్నట్టు సీతారామయ్యగారికి తెలీదు.




చల్లటిగాలి మందంగా వీచటం మొదలు పెట్టింది తడకల ఆవరణంలో నులకమంచాలమీద పడుకున్న రోగులకు అప్పుడప్పుడే కన్ను మలగుతున్నది శారీరకమైన బాధలు ఒక్కొక్కటే చేత్తో తీసేసినట్టుగా నిద్రలోకి జారుకుంటున్నారు

తెల్లవార్లూ "అమ్మా, అబ్బా" అంటూ మూలుగుతూ ఉంటారు రోగులు వాళ్ళ మూలుగులు ఆ తోటలో చెట్లకొమ్మలలోనుంచి అరమైలు దూరాన ఉన్న ఊళ్లోకి వినబడుతూ ఉంటాయి

ఉదయం ఆరుగంటలకు ఎర్రంచు తెల్లచీరె కట్టుకుని – దానిమీద తెల్లటి రవిక తొడుక్కుని – తలవెంట్రుకలు జారకుండా గట్టిగా ముడివేసుకుని – దానిమీద తెల్లటిబట్ట కట్టుకుని – చందమామలాంటి ముఖానికి దృష్టి తగలకుండా పెద్దబొట్టు పెట్టుకుని–ఆకు చెప్పులు